

రాసలీల

చిత్రకారిణి :
శ్రీమతి సి. సీతాదేవి.

# భారతి - షోడశ సంపుటము—భా. ౨.

## వ్యాసముల అకారాది సూచిక

* ఈ గుర్తుగలవి ౧౨-వ సంచికలోని వ్యాసములు.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి




౧౬ సంపుటం. ప్రమాది, ఆషాఢమాసము ( 1939) జూలై సంఖ్య

# ఆహ్వానము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

ప్రతి లేని తెలుఁగు దేశపుఁ
బ్రతి పరమాణువు విచిత్ర పరిణామ కథా
న్వితమై చిచ్ఛక్తి పరి
ష్కృతమై వేనోళ్ల నిన్నుఁ జీరెడు నిదిగో!

౨

నాలుగుశ్రుతుల కామ్నాలాగ్రముగ వర్థ మాలపించిన మాత దల్లపిల్పు
న్యాయదర్శన విమర్శాయత్త మాతర్క మరసిచెప్పిన తల్లి దలమెలుఁగి
అద్వైత వేదాంత మఖిలంబు కరతలామలకంబు నేసినమ్మ దలపల్కు
అతిభాట్టమహా సన్వితాభిధానమతఁబు నలవరించు సవిత్రి దల్లకూయి
రాజనీతిని సకలంబు రాజముఖము
తో వచించిన జనయిత్రి దా వచస్సు
దేవభాషకు నెదురుగా దేశభాష
వెల్లడించిన జనని దా విమలవాణి.

౩

ఏవతె దేశమందు జనియించుట యెవ్వతెభాష నేర్చుటిం
కేవతెదర్శనంబు పఠియించుట పుణ్యఫలంబుగా మహా
ద్రావిడుఁ డప్పదీక్షితుఁడు తా వచియించెనో యట్టి యాంధ్రభా
దేవిది చూడు మీపిలుపు దీనము దివ్యముగా వినంబడున్.

౪

పలపలని తెలుఁగుపాలిమే
రల పదముల సమరనూపురధ్వనితోడన్
మిళిత మయి నేఁడు పలుగూ
బల ఘూత్కారంబు వినఁగఁబట్టుట లేదే?

౫

జ్యేష్ఠాదేవి రథంబు నెచ్చటను లక్ష్మీరథ్యముల్ లాగ నం
గుష్ఠంబున్ విధిలీల నెచ్చటను న్యగ్రోధంబులం గూల్చె భూ
యిష్ఠంబౌ దురదృష్టరేఖ యెచటన్ హీరధ్వజం బామె నా
నిష్ఠాశాలిని యాంధ్రభూమి పిలుచున్ నిన్నున్ నన్నున్ మిమ్ములన్.

౬

కటకం బాదిగఁ జెన్నపత్తనముదాఁకన్ భాగ్యదేశంపుఁ జ
క్కటి యాద్యంబుగ దత్తమండలముదాఁకం బాల్పు జీర్ణాలయ
చ్ఛటలందుండి విశాల దీర్ఘ బహుళచ్ఛాయా స్వరూపంబుతో
అటనంబుం బొనరించు చొక్కరితె యాహ్వానించెడిన్ వింటివే!

౭

వినుచో ముందరి కరుగుము
మునిముందరి కరుగు మింక,- "ముందుకుఁ జనుమా
చనుమా ముందుకుఁ జనుమా"
యని నన్నుని మైత్రేయుఁ డనగా లేదే?

---

# 'సావయధమ్మదుహా'

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

జైనమతమునందలి, సామాన్యధర్మములను, సరసముగఁ జూపి చెప్పిన దీగ్రంథము. పుస్తకము చాల చిన్నదియే. విషయము గూడ సాధారణముగ నందరకుఁ బనికివచ్చునదిగాక ప్రత్యేకమైనది; అనగా, జాలవరకుఁ బారిభాషికమన్నమాట. భాషాబంధము జాలమంచిది. అలంకారములలోని నయగారము, ఛందములయందు వాని జోడించుటయందలి చమత్కారము, కవి కొక ప్రత్యేకతను గల్పించినవి. అన్నివిధముల మెలిదిరిగిన దాతని సిద్ధహస్తము. మలయమారుతములు, చల్లగా, సున్నితముగా వీఁచునుషస్సులలో అల్లన విచ్చుకొనుచున్న పూమొగ్గ లాతని యుపమానములు. భావనుఁ దూచి, గభీరగమనమునఁ బరువెత్తించు శిల్పవిద్య యితని కలవాటు. పాడుకొన్నఛందమా! చల్లని వెన్నెలలో, ఒంటిపాటున మెలికలు ద్రిప్పి కొనుచుఁ బ్రయాణించు సెలయేరువంటిది; శరత్కాలములో, మధుర మందగమనమున వరిచేలఁ బరుగులెత్తు గోదుమనాగు వంటిది; అస్ఖలితములగు లయలతో భరతకన్య యాడి చూపించు, విషమనాట్యము వంటిది— కందములోనిపరుగు, ఆర్యావృత్తములోని యందము, నాకలించుకొనినట్లున్న దోహావృత్తము. పదిపదునొకండు శతాబ్ద
ములనాటికి దోహాఛందము చాలను
బహుశః ఇదియే దోహాఛందములోని
టి గ్రంథ మగునేమో! ప్రాకృతకవ
జవిచూచిన వారికి, గాథావృత్తము
గాదు గదా! అన్నివిధముల, గాథ
మునకన్న పదును, ధారాశుద్ధిగల దీ
ఇంతమాత్రము, జాలును దానిప్రత్యే
గొప్పఁదనమునకు. ధమ్మపదము, ధ
వంటి యుత్తమోత్తమగ్రంథము గాక
ఆ తెగలోని యుత్తమ గ్రంథముల
యొకటి. అందుకు సందేహము లేదు.
యీ గ్రంథము వాటివలె సంపుటీక
గాదు. ప్రత్యేకవ్యక్తియొక్క కలమ
జన్మించినదియే. ధమ్మపదము బుద్ధుఁడు
యలేదనియు, సంతకుముందే ప్రచా
నున్నవాటిని వరుసగాఁ గూర్చినా ర
నొకవాద మున్నది. ఇది యట్టిది
టిని. అంతే.

దీని నిజమగు పేరేదో మన మెఱుం
సామాన్యముగా జైనవాఙ్మయమున ని
థములను శ్రావకాచారము లనియు
నుపాసకాచారము లనియు నందురు.
సంప్రదాయము ననుసరించి యీగ్ర
యొక్క వ్రాతప్రతులలో[1] "శ్రావక

---

1. చూడుఁడు. హీరాలాల్ జైన్ గారి భూమిక: ఆగ్రా: దిగంబరజైనమందిర ప్రతి. "ఇతి శ్రావకాచారదోహుడా జోగేంద్రదేవకృతసంపూర్ణం".

4



...క్" అనియు, "ఉపాసకాచార"[2] అనియు
...డి. మూలగ్రంథము నందు, మొదటి
...వృత్తములో మాత్రము, "[3] సావ
...మ్మ" యని వాడినాఁడు కవి. వేరొక
...యందు, గ్రంథాంతమునందలి శ్లోక
...[6] [4] "దోహా బద్ధ వయధమ్మం" అని,
...డి; అనగా "దోహాబద్ధ వ్రతధర్మ"
...యర్థము. కాగా "సావయధమ్మ దుహా"
...యో, లేక "దోహాబద్ధసావయధమ్మ"
...యో కవి యభిప్రాయమై యుండెనని
...యూహింప వచ్చును.

...కొంతమంది జైనపండితులు, దీనిభాష
...ాగధియని పిలచిరి. కాని యది యర్ధమా
...గధి యని, ఖచితముగాఁ జెప్పలేము.
...సేని మొదలగు నితర ప్రాకృతములలో
...చేరదు. అంతవర కొకరీతిగా నిర్ణయింప
...ను. ప్రాకృతములు దేశభాషలుగా
...టకన్నఁ బూర్వరూపము లిందున్నవి;
...ా, ప్రాకృతములయొక్క వికసితరూపము
...ని, లేక భ్రష్టరూపములుగాని యని చెప్ప
...ను. కాగా, దీనియందలి భాష "నప
..." మనుట సమంజసము. దీనినే వారు
...హిట్ట" యని పిలుతురు. సంస్కృతము
...క్క యధికారము కొంతకుఁగొంత తగ్గిన
...ాత, ప్రాకృతములు, వాటి యపభ్రంశ
...జనసాధారణములై, సంస్కృతమున
కన్న మధురము లనిపించుకొన్నవి. విద్యాపతి ఠాకూరు మహాశయుఁడు తన గ్రంథమగు "కీర్తిలత" యం దపభ్రంశము సంస్కృత ప్రాకృతములకన్నను నాజూకైనదన్నాఁడు.[5] పదియవశతాబ్ద ప్రాంతములయందు, నీయపభ్రంశభాషయే యుత్తర దేశమున విరిసి, యల్లికొని యుండినది. ప్రస్తుతగ్రంథము, మాళ్వ దేశప్రాంతములయందు రచింపఁబడిన దగుటచే, సామాన్యముగ, పశ్చిమ దేశము నందలి యపభ్రంశము లెక్కువగఁ జోటు గలిగించుకొన్నవి. ఆచార్య హేమచంద్రుఁడు ప్రాకృతవ్యాకరణకర్తగదా! అతఁ డపభ్రంశమును సోదాహరణముగ నియమించినాఁడు. అతనిసూత్రములు, దీనికే చక్కఁగా ననువర్తించును. తరువాతి "ణాయకుమార చరితము"నందుఁగూడ, మాళ్వదేశప్రాంతీయమగు నపభ్రంశమే యెక్కువ. ఈ రెంటినిఁ బోల్చి చూచిన, నీ నమ్మక మింకను బాగుగ స్థిరపడఁగలదు.

"సావయధమ్మదోహా" మునకు జైన వాఙ్మయమునందు సమృద్ధమగు గౌరవ ముండె నని యూహించుటకుఁ జాల నవకాశములున్నవి. దీనియందలి సుందరములగు దోహా వృత్తములను సమకాలికులును, తరువాతి వారునుగూడఁ దమగ్రంథములయం దుదాహరించిరి. "దోహాపాహుడ" మను గ్రంథము

---

2. జయపుర:— పాటోదీజైనమందిరప్రతి:
"ఇతి ఉపాసకాచారే ఆచార్య శ్రీ లక్ష్మీచంద్రవిరచితే".

3. ణమకారేప్పిణు పంచగురు, దూరదలియదుహకమ్మ.
సంఖే పేపయ అక్ఖరహి — అక్ఖమి సావయధమ్మ:—

4. ఇయదోహాబద్ధవయధమ్మం - దేవసేనై ఉవదిట్ఠ లహుఅక్ఖరమత్తా హేయొపయసయణఖమంతు.

5. సక్కయవాణీ బహుయన భావయి పాఉయరసకో మమ్మనపావయి
దేసిలవయణా సబ్ జనమిట్ఠా తైతై సనజంపఓ అవహట్ఠా.

నందు, దీనియందలి దొకదోహావృత్త మున్నది. "దోహాపాహుడ" మపభ్రంశభాషలోని యొక కావ్యము. అది యింకనుఁ బ్రచురింపఁబడలేదఁట. పండిత హీరాలాలుగారు ఈదోహావృత్త మా "దోహాపాహుడము" న నున్నదని తమ భూమికయందు తెలుపొసఁగి నారు. శ్రుతసాగరుఁ డనునతఁడు వేరొక జైనకవి. ఇతఁడును గొంతవరకుఁ బ్రసిద్ధుఁడే. అతనిచే "షట్ప్రాభృతటీక" రచింపఁబడినది. అందులో "సావయధమ్మదుహా"లోని యెనిమిది వృత్తము లుద్ధృతీకరింపఁబడినవి. బ్రహ్మనేమిదత్తకృత మగు "శ్రీపాలచరితము"నందును రెండుదోహావృత్తము లున్నవఁట. పై వాక్యములు హీరాలాలుగారి భూమిక యందలివే. ఈ గ్రంథములు కొన్ని యింకను వెలువడ లేదు. వెలువడినవియుఁ బ్రకృతము నా సమక్షమున లేవు. కాఁగా, మనము మహనీయుల గు హీరాలాలుగారి మార్గమునే యనుసరించుట సముచితము. ఇంకను, వెదుకవలయు ననియు, నవశ్యము మరికొన్ని గ్రంథములయందును దీని నుదాహరించియుందు రనియు వారే తెల విచ్చియున్నారు. దీనికి రెండు వ్యాఖ్యానములు గలవు. ఒకటి, లక్ష్మీచంద్రుఁడు వ్రాసిన పంజిక. వేరొకటి ప్రభాచంద్రముని వ్రాసిన "తత్త్వదీపిక"యను వృత్తిగ్రంథము.[6] "పంజిక"కును, "టీక"కును, "వృత్తి"కిని భేదమున్నది. హేమచంద్రాచార్యుఁడు "టీక" కును, "పంజిక"కును నీరీతి భేదముఁ గల్పించినాఁడు. "టీకా నిరంతరవ్యాఖ్యా పంజికా పదభం

జికా"; అందులకు టీక "సుగమానాం విష
గాంచ నిరంతరవ్యాఖ్యా యస్యాం సా టీ
"విషమాణ్యేవపదాని భనక్తి పదభంజి
అనఁగా కఠినములగు పదములకుమా
వ్యాఖ్యానము వ్రాయుట "పంజిక" యని
సరళములగువాటికిని, విషమ పదము
నన్నిటికి వ్రాయు వ్యాఖ్యానము టీక య
నభిప్రాయము. "వృత్తి" యనుద
ప్రాచీనపరిభాష యెందును దొరక
సరళమగు ననువాదప్రాయము వృత్తి
నేమో; అనఁగా నాంగ్లమునందలి parap
వంటి దన్నమాట. పూనాయందలి
ర్కరుగారి విద్యాలయమునం దొక
యున్నదఁట. దానిముఖపత్రముపై
"దోహాశ్రావకాచార్ లక్ష్మీచంద్రకృ
జికాసహిత్" అని వ్రాసియుంచిరఁట.
గురించి, పండిత హీరాలాలుగారి య
య యిది:

"హేమచంద్రసూరి పరిభాష
సరించి దీనిని "పంజిక" యనుటకు వీలు
దీనియందు విషమపదములకేకాక స
లగువాటికిని వ్యాఖ్య యున్నది.
మూఁడుచోటుల బాగుగనే యను
నాఁడు. కాని మొత్తముపైన దనధో
గాని మూలమును సరిగా నర్థముఁ జేసి
డు. ఇతనికి సంస్కృతజ్ఞానము చాలఁదరి
లింగవచనములను, తిఙంత, కృదంత
గూడ నితఁడు గమనింపఁడు. మూల
దలి యమూల్యములగు నుపమా
నెన్నిటినో, దనయనువాదధోరణిచేఁ

6. పూనా:—భండార్కర్ రిసర్చి యిన్‌స్టిట్యూటు ప్రతి:— మూలం యోగీంద్రదేవస్య - లక్ష్మీచ పంజికా, వృత్తిః ప్రభాచంద్రమునే ర్నామాతీ తత్త్వదీపికా.

..ు. ఇతనివృత్తి యంతయు వెదకినను, ..ననువదించిన ఛందము లోకపది ..నెక్కువ లేవు. కవిహృదయమును ..గా గమనింపఁడు. తెలిసిన విషయ ..సరిగా వెల్లడించుపాటి సంస్కృత ..ు గూడ నున్నట్లు దోపదు."

..ఈ ప్రభాచంద్రముని దేశముగాని, యా ..జీవించినసమయముగాని, మనకు స్పష్ట ..ఁ దెలియదు. ధారానగరనివాసి, యొక ..చంద్రముని యున్నాఁడు. అతఁడు "పు ..తుని" కావ్యములకు టిప్పణి వ్రాసెను. ..త్త్రిగ్రంథకర్త యాతఁడు మాత్రము .. జైనవాఙ్మయమున, "ప్రభాచం ..."[7] చాలమంది గలరు. అయిన లక్ష్మీధర ..ఁగు "పంజిక" గతించినట్లేనా? కాదు, ..గారునందలి, "పాటోర్" జైనమందిర ..ని వ్యాఖ్యయే లక్ష్మీచంద్రకృతమని .. హరిలాల్‌గారు నుడువుచున్నారు. ..చంద్రుఁడు, ౧౫౧౬ ప్రాంతముల ..ని, యిప్పటివరకుఁ గావించిన పరిశోధ ..ట్టి తేలుచున్నది.

..గ్రంథము రసవత్తరమైనది, ప్రసిద్ధ .., సలక్షణమైనది. కాని, యీగ్రంథ మును వ్రాసిన మహాకవి యెవ్వరు? గ్రంథము యొక్క ఆద్యంతములయందు కవినామము గాని, కాలముగాని లేదు. అతఁ డేయూర నుండెనో తెలిసికొనుమార్గములును లేవు. వ్రాఁతప్రతులనుఁ బరిశీలింపఁగా ముగ్గురి నామములు దెలిసినవి—యోగీంద్రదేవుఁడు, లక్ష్మీశచంద్రుఁడు, దేవసేనుఁడు. "సావయధమ్మదోహము"యొక్క వ్రాఁతప్రతులలో నాలుగిటియందు లక్ష్మీచంద్రుఁడని గలదు.[8] విద్యానందియొక్క శిష్యుఁడగు శ్రుతసాగరుఁడు దన "షట్ ప్రాభృతటీక"యందు, దీనియందలి దోహదము లుదాహరించుచు, నడుమ నడుమ"తథాచోక్తం లక్ష్మీచంద్రేణ గురుణా" యనియు, "తథా చోక్తం లక్ష్మీధరేణ భగవతా"యనియు నన్నాఁడు. ఆలక్ష్మీధరుఁడు, నీలక్ష్మీచంద్రుఁడు నొక్కరని యూహింపవలసి యున్నది. "షట్ ప్రాభృతటీక"యందలి శ్రుతసాగరుఁడు, దాను వ్రాసికొన్న స్వవిషయమునుబట్టి చూడ, వీ రిరువురును సమకాలికులని తోఁచుచున్నది. బహుశః లక్ష్మీచంద్రుఁడు గురుపీఠమువాఁడగుటచే నతనియందలి గౌరవమువలన నుదాహరించెనేమో! వారి గురుపరంపర యిది: యోగీంద్రుఁడు,

7. చూడుఁడు: "రత్నకరండశ్రావకాచార్"; పండిత జుగలకిశోర్ ముఖ్తార్‌కృత భూమిక.

8. పాటోడీ జైనమందిర ప్రతి:—

"ఇతి ఉపాసకాచారే, ఆచార్య శ్రీలక్ష్మీచంద్రవిరచితే, దోహకసూత్రాణి సమాప్తాని. స్వస్తి సంవత్సర ౧౫౫౫ వర్షే, కార్తిక శు॥ ౧౫ సోమే శ్రీమూలసంఘే సరస్వతీగచ్ఛే, బలాత్కారగణే అక్షయ విద్యానందిభట్టే మల్లిభూషణ తచ్ఛిష్య లక్ష్మణపఠనార్థ దోహా శ్రావకాచార".

మరి రెండు ప్రతులలో నీ రీతిగనే గలదు.

పూనా: భండార్కర్ యిన్‌స్టిట్యూటులోని ప్రతి:—శ్రావకాచారదోహకం లక్ష్మీచంద్రకృతం సమాలం యోగీంద్రదేవస్య, లక్ష్మీచంద్రస్య పంజికా ప్రభాచంద్రమునీంద్రస్య మహతీ తత్వదీపికా.

మరియొకప్రతికలో:—

ఇతి ఉపాసకాచారే ఆచార్య లక్ష్మీచంద్రరచితే దోహకసూత్రాణి సమాప్తాని.

మల్లిభూషణుఁడు, లక్ష్మీశచంద్రుఁడు- అని. కాని పూనాలోని వ్రాఁతప్రతులయం దిందుకు విరుద్ధముగా నున్నది. దానిని బట్టి చూడ మూలకారుఁడు యోగీంద్రదేవుఁడనియు, పంజికాకారుఁడు లక్ష్మీశచంద్రుఁడనియు, వృత్తికారుఁడు ప్రభాచంద్రముని యనియుఁ దేలుచున్నది. దీనికిఁ దోడు జయపూరునందలి ప్రతియందు, "మల్లిభూషణ తచ్ఛిష్య పం॥ లక్ష్మణపఠనార్థ దోహాశ్రావకాచార" అని గలదు. కాఁగా మూలమును విద్యానంది పట్టభద్రుఁడగు మల్లిభూషణుఁడు వ్రాసెననియు, నది తన శిష్యుఁడగు లక్ష్మణుని పఠనార్థము వ్రాయఁబడె ననియుఁ దెలియుచున్నది. లక్ష్మణచంద్రుఁడు గురుపీఠము నెక్కుటకు ముందు లక్ష్మణుఁ డనుపేర నుండియుండ వచ్చును. పై జయపుర ప్రతిలోని "లక్ష్మణచంద్రవిరచితే" యనుపదము పొరపాటు. "లక్ష్మణచంద్రలిఖితే" యని యుండవలసి యుండెను. దానికిఁ దరువాతి వ్రాయసగాండ్రా తప్పుడుపాఠమును జూచి మోసపోయియుందురు. వాస్తవమునకు "లక్ష్మణచంద్రుఁడు, ప్రాకృతమునందుఁగాని, సంస్కృతమునందుఁగాని, దేనిని వ్రాసినట్లు గానరాదు.

ఇఁక రెండవవాదము యోగీంద్రదేవుఁడు వ్రాసెనన్నది. భండార్కరువిద్యాలయమునందలి ప్రతిలో మూలకారుఁడు యో[గీంద్ర]దేవుఁ[9]డనియే యున్నది. జైనవాఙ్మయమందు, యోగీంద్రదేవుని గ్రంథము లి[...] నాలుగు[10]మాత్రము గానఁబడినవి. వా[...] రెండును, ప్రస్తుత కావ్యమువలెనే ది[...] బద్ధములు. మూఁడవది ప్రాకృ[...] యోగీంద్రదేవుని పరమాత్మప్రకాశము[...] వృత్తములకు ప్రస్తుతగ్రంథములోని [...] దోహలకుఁ గొంతవరకు సామ్యము [...] పోలేదు. కాని యవి గతానుగతికముగా [...] నవే; అనఁగా, ప్రతియొకనికిఁ దెలిసిన,[...] తములు కొన్ని దానియందును, దీనియం[దు] నున్నవి. ఈ స్వల్పసామ్యముచేతనే, [యో]గీంద్రుఁడే దీని కర్తయని నిరూపింప[...] భాషావిషయమున, నక్కడక్కడఁ గ[...] నలఁతియలఁతిపోలికలు, వాడుకచే [...] యుండునేగాని వేరుగాదు. పైగా, యో[...] ద్రుఁడు, సార్థకనామధేయుఁడు. ఆ[...] ప్రకృతియంతయు నాత్మమయమే. ఆధ్యా[...] దృష్టితో నిండి తొణుకున వాతని [...] ములు. గురువు, [11]శాస్త్రము—యో[...] కందరాని దాతనిజ్ఞానదృష్టి. అట్టివాఁడు [...] పూజా, ఉపవాసాది మహత్వ ప్రతి[...] మగు దీనిని వ్రాసియుండుననుట [...] గదు. గృహస్థాశ్రమములో నున్న[...] వ్రాసియుండు ననుటకును వీలులేదు.

---

9. మూలం యోగీంద్రదేవస్య లక్ష్మీచంద్రస్య పంజికా, వృత్తిః ప్రభాచంద్రమునేర్మహతీ తత్వదీపిక[...]

10. పరమాత్మ ప్రకాశము, యోగసారము, అమృతాశీతి, నిజాత్మాష్టకము.

11. చూడుఁడు:-

దేఉలు దేఉ వి సత్థుగురు తిత్థువి వేఉ వికవ్వు.
వత్థుజాదీసయిఉగురుమియవుఇంగణుహో సయుసవ్వు. (—పరమాత్మ ప్రకాశము.)
కౌను సమాహికర ఉక్కో అంచఉ ఛోపు అఛోపు కరివికోవంచఉ
హలసహ కలహికేణ సమ్మాణఉ జహిజహిజో వఉ తహి అప్పణాఉ. [—యోగసారము

...త్మ్రప్రకాశమువంటి మహాశాస్త్రగ్రంథమును ...ంచు కవికలమును నిందు లేదు. భాషా ...తోఁ జూచిన, నిది యాతని గ్రంథముల ...ఁ గొంచెము వెలుసు. కాఁగా, యోగీంద్ర ...ఁడే, దీనిని వ్రాసియుండు ననుటకు, ప్రబ ...ారము లేమియుఁ గానము.

కారంజవ గ్రంథమాలయందలి, వ్రాఁత యందు, "దేవసేనై ఉవదిట్ఠ" యని ...న్నది; అనఁగా "దేవసేనేనోపదిష్టం"అని ...ర్థము. దిగంబరజైనకవులయందు, దేవ ...ఁడు మహాప్రసిద్ధుఁడు. దర్శనసారము, ...ాధనసారము, తత్త్వసారము, నయ ...క్రము, ఆలాపపద్ధతి, భావసంగ్రహము అను గ్రంథము లాతనివి. దర్శనసార మొకటి ...ఁ దక్కినయన్ని గ్రంథములును బ్రచు ములైనవి. భావసంగ్రహమునకు సావయ ...త్రదోహకు భావసాదృశ్యములు చాల ...కున్నవి. కొన్నిటి నీక్రిందఁ జూపుదును:

(౧) మజ్జమంసమహు పరిహరహి
కరిపంచుంబరమూరి [సావయధమ్మ.]

[మద్యమును మాంసమును మధువును ...రము చేయుము. పంచోదుంబరముల వద ...ము.]

మహుమజ్జమంసవిరయా చాఓఝణ ఉంబరాణ
...పణ్ణాం [భావసంగ్రహ.]

(౨) తం అపత్తు అగామిభణి ఉ
గయవయవం పణుజాసు
జిప్పలదిణ్ణ ఉహోయితాసు
జహ ఊసరికహుసాసు.

[దర్శనము వ్రతము లేనివాఁ డపాత్రుఁ ... యాగమము లన్నవి. వాని కొసఁగిన ...న మూసరక్షేత్రమువలె వ్యర్థము.]

ఊసరఖిత్తే బీయం సుక్ఖే రుక్ఖేయ
జీరయహి సేఓ
జహతహ దాణ మవత్తే
దిణ్ణం ఖు ణిరత్థయం హోయి.
[భావసంగ్రహ.]

(౩) ఇక్కవి తారయి భవజలహి
బహుదాయారసు పత్తు
సుపరోహణు ఎక్కవిబహుయ
దీసయిపారహుణింతు.

[సుపాత్రుఁ డొక్కఁడే, యనేకులు దాతలను భవజలధినుండి తరింపఁజేయును. మంచినావ యొకటే చాలమందిని గట్టుచేర్చుచున్నది.]

జహణావాణిచ్ఛిద్దా
తారయిపారావారే
తహ సంసారసముద్దే
తారేయిసణాహియంపత్తం
[భావసంగ్రహ.]

ఇట్టి వనేకము లున్నవి. తజ్జ్ఞులు చూచు కొందు రనుకొందును. మొత్తముపై రెండు గ్రంథములకును భావసంపత్తియందును, భాషాసంపత్తియందును, గద కుక్తివిశేషము నందును జాలసాదృశ్యము లున్నవి. పదములు గూడఁ జాలవర కిచ్చిపుచ్చుకొన్న ట్లున్నవి. దాననిరూపణము, దానపాత్రనిరూపణము, సర్వరసాభిషేకవిషయము, అష్టద్రవ్యపూజ మొదలగునవి రెండుగ్రంథములయందును, నొకటేచోటున, నభిన్నసూక్తివిశేష ముతో నున్నవి. కొన్నికొన్ని విషయముల కొకదానిలో నుల్లేఖమాత్రము, వేరొక దానిలో సవిస్తరవర్ణనము నున్నది. అష్ట మూలగుణముల విషయము, పదిరెండువ్రత ముల విషయము భావసంగ్రహమున [illegible]

మరియు, ౩౪౩ గాథలలో సంకుచితముగా నున్నది. ఏతన్నిరూపణమే "సావయధమ్మ" ౮౩ దోహావృత్తములలో నున్నది. "భావసంగ్రహ"మున ౩౭౫ వ గాథలో సప్తతీర్థంకరులయుల్లేఖముమాత్ర మున్నది; దీనిలో కావ్యభక్తిలో వారివర్ణన మున్నది. "సావయధమ్మ"లోని ౨౧౨-వ దోహాలో, సిద్ధచక్రముయొక్క స్థాపనా విషయమున, సూక్ష్మోల్లేఖముమాత్రమే గలదు. ఈ విషయము, భావసంగ్రహమున విస్తృతీకరింపఁబడినది. ఇట్టివే మరికొన్ని. ఇంతే గాక, "సావయధమ్మ లోని ౯౩-వ దోహా, భావసంగ్రహములోని ౫౧౩-వ వృత్తముగా నున్నది యున్నట్లె చెక్కు చెదరకయున్నది. భావసంగ్రహమునకు, రెండు వ్రాఁతప్రతు లున్నవి. అందొకదానిలో, యీవృత్తము "ఉక్తంచ" యను మకుటముతో నున్నది. ఆప్రతీకము, మూలకారునిదే యని నమ్మితిమేని, యొకరీతిగా, "సావయధమ్మ" మొదటి గ్రంథ మనియు, "భావసంగ్రహము" తరువాతి దనియుఁ, బూర్వకృతమగు గ్రంథములోని శ్లోకములు, ప్రసంగాంతరమున నుదాహరింపఁబడిన వనియు నిర్ణయింపవచ్చును. ఈ యలవాటు దేవసేనుని యితర గ్రంథములయందును గానవచ్చును. "దర్శనసారము"లోని యనేకశ్లోకములు "భావసంగ్రహము"లో నున్నవి. దేవసేనుని గ్రంథములలో "నయచక్రము"గూడ నొకటి. ఈనయచక్రము "లఘునయచక్ర"నామమునఁ బ్రచురింపఁబడినది. వేరొకటి "బృహన్నయచక్ర" మున్నది. అది మాహల్లదేవకృతము. ఇతఁడు దేవసేనుని శిష్యుఁడే. దేవసేనుని నయచక్రములోని

విషయములు "బృహన్నయచక్రమ
యొక్క యంతమున,

సుశిక్షాణదోహరక్షం ఏగ్గం హసి ఊణసుహంకరోథ
ఎత్థిణ సోహాయి అత్థో గాహా బంధేణ తం భణహ.
సియసద్దసుణ యదుణ్ణయదణు దేహావిదార ణేక్క వరవి
తం దేవ సేవ దేవం ణయ చక్క యరం గురుం ణమహ
దవ్వసహావ పయాసం దోహాయబంధేణ ఆసి జంది
గాహాబంధేణ పుణో రయియం మాహల్ల దేవేణ.
సుసమీర ణేణ పోయ స్సేరి యసంతంజహా తిరం ణట్ఠం
సిరిదేవసేణమణిణా తహాణయ చక్కం పుణో రయి

అనగా దేవసేనుఁడు
లోక నయచక్రమును గూర్చియుం
శుభంకరుఁ డనుపండితుఁడు దానిని
తర్కకర్కశమగు నీ విషయము దోహా
త్తములలో బాగుగ నుండ దనియు, దా
గాథానిబద్ధము గావించు మనియు నన న
అనంతరము దేవసేనశిష్యుఁడగు మాహ
దేవుఁడు దానిని గాథాబంధముల
వ్రాసె నని యర్థము. దేవసేనునికిముం ద
"నయచక్ర" ముండె ననియు, నది స్ఖలిత
గాఁగా, దేవసేనుఁడు దీనిని వ్రాసె నని
నాలుగవ శ్లోకతాత్పర్యము. దేవసేను
చాల గ్రంథములఁ బునరుద్ధరించినాఁ
"దర్శనసారము"న పూర్వగాథలను సం
దించియే, తా నీగ్రంథమును వ్రాసితి
స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.
యట్లుండె.

కాఁగా, పైశ్లోకముల ననుసరించి తే
విషయము లివి. "ఆనాఁటికి దోహాఛంద
నూతనము. అందులకుఁగాను, పూర
చారపరాయణతాపటిష్ఠు లగు ప్రా
పండితులు దాని నెరవుగాఁ జూచుచుండి
దేవసేనునకు దోహావృత్తములపై రు

ల్య మెక్కువ. అందువలనఁ బాండిత్య
ర్ణమగు "నయచక్రము" మార్చఁబడినను
ారణగృహస్థధర్మముల మాత్రము వివ
ు "సావయధమ్మ" యథారీతిగనే
న్నది.

దేవసేనునికాలవిషయమున నంతగాఁ
ము లేదు. దర్శనసారమునం దాతఁడే
ముగాఁ దా నాగ్రంథమును, ధారానగ
సందలి, పార్శ్వనాథమందుఁ గూర్చొని
సితినని చెప్పియున్నాఁడు.

ఆ శ్లోకము లివి:—

యరి యక యాయింగావోయిం సంచిశీణవియత్థ
సేణగణిణా ధారాయే పవ్వసంతేణ.

యా దంసణసారో హారో భవ్వాణ ణవసయేణవయే
ణావాగేహే సువిసుద్ధే మాహసుద్ధదసమీయే.

మాలవ ప్రాంతములయందు నాఁటికి,
ికి విక్రమార్క-శకమే ప్రచారములో
్నది. దర్శనసారమునందును కంతో
"విక్కమకాలస్సమరణ ప త్త స్న"
ు కవియే యన్నాఁడు. తాను విక్ర

మార్క-శకము, ౯౯౦ మాఘశుద్ధ దశమి
నాఁడు గ్రంథమును ముగించితి నని వ్రాసి
యున్నాఁడు.

ధారా నగర మానాఁడు పండితులకుఁ
బండితసన్మానములకుఁ జాలఁ బ్రసిద్ధము.
ప్రాకృతములఁగూడపఠన, పాఠనములుసాఁగు
చుండినవి. ప్రాకృతములకుఁ బ్రాచీన
తమమగు కోశము "పాయియనామమాల"
నిందే ధనపాలుఁడు గూర్చెను. పుష్పదంత
కావ్యటీకాకర్త ప్రభాచంద్రముని యీనగ
రమువాఁడే (చూ. నాగకుమార చరిత
భూమిక). కనుక దేవసేనుఁడు ధారానగరము
నం దుండెనాయని మనము సంశయింపనక్క
ర లేదు. ఇంతవరకుఁ దేలిన యాధారములఁ
బట్టి చూచినను "సావయధమ్మ" కర్త "ధన
సేనుఁడే" యని స్పష్టముగఁ దేలుచున్నది.
"సావయధమ్మ" లోని కవితావిశేషముల
గురించియు, దక్కిన యితర కావ్యగుణముల
గురించియు మరొకమారు దర్కించుట
యుచితము.



# వ స ం త జీ వ న ము

శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

౧

నా పద్యాలకు ప్రాణదాత, త్రిజగన్మాధుర్యకేళీకళా
సోపానమ్ము, విశుద్ధ శారద నవజ్యోత్స్నా తనూవల్లి మ
త్స్వప్నోత్ఫాళనగాంగవేణిక, కృపావద్దేవతాశీర్వచో
రూపప్రాప్తి, హఠాత్ప్రసన్నయయి, మేల్కొల్పెన్ మృతప్రాయునిన్.

౨

ఆయమ, తీవ్రయౌవనభయంకరి గాదు, విలాసగాఢవాం
ఛాయుతజీవి గాదు, వికసన్నవపుష్పసుగంధిలాంశిక
శ్రీయును గాదు, పూర్వకవిసింహులు చెక్కిన కావ్యనాటక
ప్రేయసి గాదు, జన్మల వరిష్ఠతపఃఫలసిద్ధిమూర్తియౌ.

౩

నా ప్రియురాలు, నీలగగనాంతవికస్వరతారకాసుమ
వ్యాప్రియమాణదేహ, నరవాసన కిట్టని దేవకన్య, తా
నై ప్రియుగా వరించెను పునాదుల కంట పెకల్చి స్వర్గమున్
క్షిప్రము నాదువాకిటికి చేర్చెను కూర్చె నలోకమాధురుల్.

౪

ఒక గాఢాంధతమస్సులో, చెలియ దివ్యోద్యానప్రాంతావనిన్
వికసింపన్ దొరకొంటి జీర్ణతృణపృథ్వీభాగవుం బూవునై,
సకలోద్యానము, వాసనాభరిత పుష్పశ్రేణి నర్తింపగా
సఖ, యేతెంచి యనుగ్రహించె, తృణపుష్పమ్మున్ ననున్ వేణిలో.—

౫

ఆ సుముహూర్తమందు మొదలై సఖివేణికలోని పూవులో
దూసుకువచ్చె, సౌరభమధూదయరేఖలు రాగవాహినుల్
ఈసుమనోమనమ్ము భరియింపదు పొంగినపాటతీపి, నీ
కోసము పాడివైచు, వినగోరెదవో — రసికప్రియాతిథీ!

౬

ఆమెకపోలపాళి దరహాసము వెల్గును ; నా హృదంతరా
శామలదుగ్ధవార్నిధి వియత్పథ మంటును పర్వరీతిగా
కోమలి వీణవోలె పలుకున్ పలు కొక్కటి, నాదుగీతమ
ల్లీమృదుపుష్పమాలిక సలీల గళమ్మున వైతు కాన్కగా.—

౭

ఈ గహనాలయమ్ము వెలిగించినలక్ష్మి, నిరాశ లేలు నీ
రాగవిపంచి మీటిన సరస్వతి, యీ మృతశీతలాద్రిపై
నైగమమంజుగీతముల నాట్యము సల్పిన గౌరి, నామనో
రాగిణి నన్ను దివ్యపదరాజవతంసుని జేసె రక్తిమై.

౮

అల జయదేవసత్కవిగిరాంపథగీతమధూత్సవమ్ము నా
వలపులరాణిసౌహృదము, పండితరాజవిలాసకావ్యపుం
బులకితభావముల్ తరుణిముగ్ధవచోరచనమ్ములోని సొం
పులు భవభూతిభావరసమూర్తియె మత్ప్రియయై గనంబడున్.

౯

జాజులు పూచినన్, నవవసంతదినాంతహిమాంశుమూర్తి నీ
రాజన మెత్తినన్, దిశల రాగసుధారసకంఠనిర్గళత్
కూజితగానముల్ కలికికోయిల క్రోల్చినభంగి మ్రోగినన్
భ్రాజితమూర్తి మత్ప్రియ తలంపున బారు, హసన్ముఖాబ్జయై.

౧౦

ఈ యమృతానురాగకథలే, బ్రదు కెల్లెడ పూచి పూవులై
తీయని యెన్ని పద్యముల దిద్దునో,—యెన్ని కథానికల్ ఫల
శ్రీయయి లోకమెల్ల మధురించునో.—తీరని కాంక్ష లెత్తగా
వేయి యుగమ్ములైన ప్రభవింతును కమ్మని తెన్గు తోటలో.—

---

# కవిత్రయము వా
# రఖండయతిని బాటించినారా?

శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

"కవిత్రయము వారు తమ భారతము లో సఖండయతిని విరివిగానే యుపయోగించిరి. కాని పరిష్కర్త లట్టిపాఠములనెల్ల సంస్కరించి ముద్రింపించిరి" అని మనపరిశోధకు లెందరో యభిప్రాయపడుచున్నారు. అట్టి యాశయ మెంతవఱకు సత్య మనఁదగియున్న దియో స్థాలీపులాక న్యాయముగా విమర్శించి చూపెదను.

నన్నయ:

"సీ. నీలజీమూతంబులీల వాక్షేపించి
నల్లనై తోతెంచు నల్లగృహము
(భార. ఆది. ౬ఆ. ౨౧౧౫.)

సీ. ... ... ...
నల్లనై తోతెంచునట్టితఱవు

"ఇదియే సాధుపాఠము. మనపరిష్కర్త లఖండయతిభయముచేఁ బైరీతిని మార్చియున్నారు. కాని పైపాఠమున నర్థమే పొసఁగ నది; లేనిచో నర్థమేమి?" అని రావుసాహెబు శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు తమ యప్పకవీయ విమర్శనమునఁ బ్రశ్నించిరి.

నే నీసందర్భమున మదరాసు, ఓరియంటల్ లైబ్రరీలోని చాలప్రతులను బరిశోధించితిని. నా చూచినంతలో నన్నిటను 'తోతెంచు నల్లగృహము,' 'తోఁచిన యల్లగృహము' అనియే కానవచ్చినది. ఇందుచేఁ

బంతులువారే పైపాఠమున నర్థము లే
నూహతోఁడా మిట్టిపాఠమును గల్పించి
దురా? యని యూహింపవలసివచ్చుచున్
'కాలమేఘుంబునుబోలె విశాలమై, సి
దేహంబు గ్రాలుచుండ' (భార. ఆది.
౨౦౧౫)అని నన్నయభట్టారకుఁడు హిడి
సురుని వర్ణించినవర్ణన మిట్టి పాఠకల్పన
వీరికిసాయపడి యుండవచ్చును. ఈ సం
మున సంస్కృత మూలమును బరిశోధించ
వాగనుశాసనుఁ డెట్టిపాఠమును గ్రహి
యుండునో తెలియవచ్చును. ఈపద
భీముఁడును హిడింబాసురుఁడును యుద్ధ
రించు సమయమున మేల్కని తనకట్టె
నున్న హిండింబను జూచి యామెవృ
తమునెల్ల నెఱుఁగఁదలఁచి కుంతి 'నీ వె
దాన విట కేల వచ్చితి' వని యడుగ
హిడింబ తనవృత్తాంతము నెఱుకపఱచు
దర్భము లోనిది. (పైపాఠమున 'నల్లనై
తెంచు= నల్లగాఁ గనఁబడు, అల్లగృహ
అ(కనఁబడు) గృహము, (ఇట 'తో తెంచు
అల్ల, అని యుండ సంధిలో నగాగమ
'నల్ల' యయినది.)

ఈ పాఠమే మూలానుగుణమై య
విధముల సాధుపాఠ మనఁదగియున్నది.

మూలము:

'కస్య త్వం సురగర్భాభే, కాచాఽసి వరవర్ణి
కేన కార్యేణ సుశ్రోణే, కుత శ్చాఽఽగమనం త

... ... ... ...

దక్ష్య మమ త త్సర్వం, కి మర్థం చేహ తిష్ఠసి'.

కుంతి ప్రశ్నింపఁగా హిడింబచెప్పిన

ాధానము వినుఁడు.

మ దేత త్పశ్యసి వనం, నీలమేఘనిభం మహత్,

ాసో రాక్షసస్యైవ, హిడింబస్య మమైవచ.

స్య మాం రాక్షసేంద్రస్య, భగినీం విద్ధి భామిని."

డి వసశబ్దము గృహబోధకము (చూ.

ి విశ్వనిఘంటువులు.)

పై మూలములోని 'నీలమేఘనిభం

ాత్' అనుదానికే 'నీలజీమూతంబులీల

ేపించి, నల్లనై' యనియు, 'యదేత త్ప

వనమ్' అనుమూలమునకే 'తో తెంచు

గృహ'మనియు నన్నయభట్టారకుని తెనిఁ

యున్నది. తక్కినపద్యభాగమును

ంచినమూలమునే వ్యక్తపఱచుచున్నది.

'శబ్దమునకు నిర్దేశార్థమున సూర్యరాయ

ంటుకర్తలును దీనినే ప్రమాణీకరించిరి.

సందర్భమున భారతము లక్ష్మీపతి సోమ

జులుగారు నీక్రిందివిధముగా వ్యాఖ్యాన

చేసిరి.

"నీలజీమూతంబు............తో తెంచు నల్ల

ము," గ,

గా నల్లమబ్బును ఆక్షేపించి నల్లగానున్న

యిల్లుగల యనుట —

యదేత త్పశ్యసి వనం నీలమేఘనిభం మహత్"

యున్నది." (లక్ష్మీపతి సోమయా

వారి వ్యాఖ్య), 'నీలమేఘనిభం మహత్'

మూలములో నున్నను 'నీలజీమూతంబు

నాక్షేపించి' యనియే నన్నయ వ్రాసెను.

యుపమానమే వైశాల్యమును దెలియఁ

ది యిక్కడి మహదర్థమును సంగ్రహిం

చునని యీతనియాశయము కానోపు. ఇది

వఱలో నే నుదాహరించిన హిడింబాసుర

వర్ణనమే యీ యుపమానము నీతఁడు వైశా

ల్యమునఁ గూడఁ బాటించె ననుటకుఁ దా

ర్కాణము. ఈతఁ డిట్లే మూలమున 'నివా

సో రాక్షసేంద్రస్య హిడింబస్య మమైవచ'

అని యుండఁగా నట్టిగృహముకలవాఁడు

హిడింబుఁడు మాత్రమే యని చెప్పించెను.

అపరిణీతయుఁ బితృవిహీనయునగు కన్య

భ్రాతృగృహముననే నివసించును గావున

"మమైవచ" అని చెప్పుట పునరుక్తిప్రాయ

మని యీతఁడు భావించియుండును. ఈసం

దర్భమున ని ట్లంతయు నొక్కపదమేనియు

విడువక తెనుఁగుసేతకుఁ గడఁగిన నన్నయ

యిక్కడి ప్రకృతసందర్భమునకు ముఖ్య

మును మూలమునఁ బై ప్రశ్నమున కవసర

మగు నీవిషయమునుమాత్ర మేల విడిచి

యుండును? ప్రకృతమున కేమాత్రమును

సందర్భపడని హిడింబాసుర వర్ణనమును బున

రుక్తిప్రాయముగ నేల పొందుపఱచును? ఇది

యునుగాక తనభారతభాగమున నంతటను

నీసపద్యమును బ్రాసయతితో నారంభించినఁ

బ్రాసయతితోడను, నేవలయతితోఁ బ్రారం

భించినఁ గేవలయతితోడనే తుదముట్టించు

నలవాటుకలవాఁడై సాంకర్యమున కలవ

డని నన్నయ యీపద్యమున నెల్లఁ బాటిం

చిన ప్రాసయతి నిటమాత్ర మేల విడుచును?

తెనుఁగు గ్రంథములలో హెచ్చుపరిశ్రమము

చేసినా రనుప్రసిద్ధిగల శ్రీపంతులుగా రిట్లు

నన్నయనియమముల నెఱుఁగక యఖండ

యతిని వాడినాఁ డనుట మిక్కిలి విచార్యము.

ఇట్లు మూలమున కేమాత్రమును సంబంధ

ము లేక యన్నివిధముల నసంబద్ధముగాఁ

గాన్పించు శ్రీపంతులువారిపాఠము సాధుపాఠ మగుటెట్లు? సర్వవిధముల నుచితముగాఁ దోఁచు పైపాఠము పరిగ్రాహ్యము కా దను టెట్లు? ఇన్నిప్రతు లేకరూపముగా నిట్టిపాఠ మునే ('తోఁతెంచు నల్లగృహము' అనుపాఠ మునే) యెఱుకపఱచుచుండఁ బరిష్కర్తలే యీపాఠమును గల్పించినా రనుటయు నెంత మాత్రము విశ్వసనీయము కాదు. మఱియు ననాలోచితముగా నన్నయ కఖండయతి నతి కింపఁజూచుటయు న్యాయ్యము కాదు.

తిక్కన:

సీ. ...డన్న,
యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ
వెడగరపడియె దీయువవిలోన
(భార. సౌప్తి. ౧అ. ౬౧. అని
దేవ ప్పెరుమాళ్లయ్యగారి ప్రతి.)

సీ. ...డన్ని
యున్నవాఁడవు నిద్రయును లేకయున్నది
వేగిరపడియెద నేల యింత
(అని ప్రాఁతప్రతులు - వీరేశలింగముగార్లపాఠము)

దేవప్పెరుమాళ్లయ్యగారి ప్రతిలోఁగూడ నిది ప్రాఁతప్రతిలోని పాఠమనిక్రింద నుదా హరింపఁబడినది. ఇక్కడి ప్రాఁతప్రతులను బరిశోధింప నీక్రిందికీతిపాఠ మగపడినది.

సీ. ...డన్ని
యున్నవాఁడవు నిద్రయును లేకయున్నని
వెడఁగురుపడియె దీయదవిలోన
నిల్చి,...

నా పరిశోధించిన ప్రతులన్నిటను 'నీవు వెడగురుపడు', 'వెణంగురుపడు,' 'వెడకటపడి యెడీ యడవి' అనియే కానవచ్చినది. ఈ 'వెడ గురుపడు'టనే మన దేవరాజసుధి 'ఎడగర పడు'గా గ్రహించినాఁడు. ఇతని కేదేని యొకప్రతిలో నిట్టిపాఠము గాన్పించి ... డనో లేక 'నీవు వెడఁగురుపడు' అను... మునే గణభంగమును బరిహరించుటకు... నిట్లుసంస్కరించెనో చెప్పఁజాలము. ఏమై... నిది 'వెడఁగుర:పడు'గాని 'ఎడగరపడు'కా... వలసియున్నది. కావుననే మననిఘంటు... లెవరును పైపదమును గ్రహించియుండ... ఇది యెడగరపడుటయే యగుచోఁ దరు... కవు లెందఱో యీపదమును దమగ్రంథ... లలో నిల్లే వాడియుందురు. అట్టి దేద... భాషాప్రపంచమునఁ గాన్పింపదు. ఇక... మూలమునుబట్టి చూచినను నీసందర్భ... 'వెడఁగురుపడియెదు' అనుపాఠమే సమ... ముగా నున్నది. (ఇది నిద్రఁబోవు పాం... పాంచాలురనెల్ల నర్ధరాత్రమునఁ దెగట... దృఢనిశ్చయుండగు నశ్వత్థామతోఁ గ... చార్యుఁడు చెప్పువాక్యము.)

మూలము:

"అవాభ్యాం పతిత శ్శత్రూన్, క్వోనిహన్తాసమా...
విక్రమ్య రథినాం శ్రేష్ఠ పాఞ్చాలాన్ సపదానుగా...
శక్తస్త్వమసి విక్రమ్య విశ్రమస్వ నిశా మిమామ్,
చిరం తే జాగరితం తాత స్వపతావన్నిశా మిమాం...
విశ్రాన్తశ్చ వినిద్రశ్చ స్వస్థచిత్తశ్చ మానద,
సమేత్య సమరే శత్రూన్ వధిష్యసి న సంశయః"

పైమూలమున 'శక్తస్త్వమసి' యను... 'శ్రాన్తస్త్వమసి" అని యుండునని తో... చున్నది. ఇట్టితప్పులు భారతములోఁ... యున్నవనుటకు 'న హత్వా రథినాం శ్రే... ...జేతు ముత్సహతే కశ్చిత్' అనునది... నిదర్శనము. ఇట్టి వనేకములు. వావిళ్ళ... ప్రతిలోనేగాక యీపాఠ మితరప్రతులల... గూడ నిల్లే కానవచ్చుటచేఁ గొంచె మా... చింపఁదగియున్నది. ఐనను మూలము ...

చూచుచో 'శక్తస్త్వమసి విక్రమ్య'
పాఠము స్వరసముగా సమన్వయింపక
రు క్లిష్టాయ మగుచున్నది. కావున 'శ్రా
వ్యమసి' అనునదియే ప్రాచీనపాఠ మన
యున్నది. కనుకనే యీ సందర్భమున
కవిబ్రహ్మ 'డస్సియున్న వాఁడవు' అని
ంధ్రీకరించెను. ఇఁక 'చిరం తే జాగరితం
త "సనిద్రశ్చ' 'స్వస్థచిత్తశ్చ' అను పైమూల
నే "నిద్రయును లేకయున్నేని, వెడఁగురుప
డియడవిలోన[1] నిల్చి, డప్పి దేఱ నిద్రిం
అని తెనిఁగించెను. మూలములోని చకా
హేత్వర్థకము. సనిద్రుఁడగుటచేత స్వస్థ
డగునని యర్థము. ఈయాంధ్రీకర
మునందలి 'వెడఁగురుపడు' అనుదానికి
స్వస్థచిత్తుఁడగు; మాంద్యము వహించు"
యర్థము. ఈపద మిట్టియర్థమున నిర్ధార
గా హరివంశాది ప్రబంధములలో
దరువాతికవులచే వాఁడఁబడియున్నది.
ప్ర యో గ మే వా రి కి ట్టి ప్ర
గమున మార్గదర్శకము కానోపు. నిద్ర
మునయెడల స్వస్థచిత్తుఁడ వగుదు వను
లమునే భంగ్యంతరమున నిద్రలేనిచో
స్థచిత్తుఁడ వగుదని తిక్కనార్యుఁడు
ఁగుసేసెను. ఇఁక శ్రీ వీరేశలింగము
తులువారును ప్రాఁతప్రతులనుండి గ్రహిం
'వేగిరపడియెద వేల యింత' యను
ండయతిపాఠము మూలమున కేమాత్ర
ము సంబంధము లేకయున్నది. ఇట్టిపాఠ
ండయతి భారతములోఁగూడఁ గల వ
కఖండయతిప్రియు లెవ్వరో మూల
ము బరిశీలింపక కల్పించియుందురు; లేక
ఁగురుపడితె దీయడవిలోన' అనుభాగ
ము కాకయేని యిట్లు దిద్దియుందురు.
నను నిట్లు మూలానుగుణమై బహుళ
ముగాఁ దాటియాకుప్రతులలో నేకరూప
ముగాఁ గాన్పించు సాధుపాఠమును బోఁద్రోసి
తిక్కనగారి కంఠమున కీయఖండయతి నురి
వోయుట సాహస మనక తప్పదు.

ఎఱ్ఱన:

౧. సీ. నీవును వాలియు నేఁడును వాఁడును
ప్రియమునఁ బాలించు పెద్దతోఁట,
మధువనం బది...
(భార. అర. ౭ఆ. ౯౫.)

౨. సీ. నీవును వాలియు నేఁడును వాఁడుఁ బ్రి
యంబునఁ బాలించు నాఁకతోఁట

౩. సీ. నయముతోఁ బాటించు నాటతోఁట

౪. సీ. ... ... ... ...
అనయంబు బాలించు నాఁకతోఁట

ఇందు మూఁడవపాఠము శ. ర. గ్రహించినది. 'నయముతోఁ బాటించు నాఁకతోఁట' యని ప్రాచీన ముద్రితపాఠము. ఏమైన నీరెండుపాఠములు నఖండయతితో డనే యలరారుచున్నవి. నాచూచిన ప్రతులలో శ. ర. పాఠ మెత్తని కెక్కడనేని దొరకనేమో చెప్పఁజాలము. ఇందలి నాల్గవపాఠము శ్రీ వీరేశలింగము పంతులువారు గ్రహించినది. ఇది చాలవఱకు నాచూపిన రెండవపాఠము ననుసరించియున్నది. దీనినే శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు తమ నిఘంటువున నాఁకతోఁటలోఁ బ్రమాణీకరించిరి. ఇక్కడి మూలమునుబట్టి చూచుచో నాయుదాహరించిన మొట్టమొదటి పాఠమే నిజమగుపాఠము కాఁదగి యున్నది.

మూలమ్:

"రక్షితం వాలినా యత్తత్, స్ఫీతం మధువనం మహత్"
త్వయాచ ప్లవగశ్రేష్ఠ, తద్భుక్తం పవనాత్మజైః
వాలిపుత్రోంగదశ్చైవ, యేచాఽన్యే ప్లవగర్షభాః"

పైమూలములోని 'రక్షితం వాలినా యత్తత్' 'త్వయాచ' అనుదానినే 'నీవును నాలియు నేఁడును నాఁడును బ్రియమునఁ బాలించు' అని యెఱ్ఱాప్రెగ్గడ యాంధ్రీకరించెను. మూలమున 'రక్షితం' అని యుండుటచేఁ బైరీతిఁ 'బాలించు' అనుటయే యుక్తము. ఇఁక మూలమున 'స్ఫీతం', 'మహత్', 'మధువనం' అని యుండుటచే 'పెద్దతోఁట, మధువనం బడె" అని యాంధ్రీకరణమై యున్నది. కావున నాయుదాహరించిన మొదటిపాఠమునే ప్రబంధ పరమేశ్వరుఁడు గ్రహించియుండును. ఇఁక 'నయముతోఁ బాటి నాటతోఁట' యను శ. ర. పాఠము కేవలఖండయతికొఱకే యెవరో మార్చిరనుఁదరని దృఢముగాఁ జెప్పవచ్చును.

కావున భారతములోని యఖండయతి పాఠము లెల్లఁ జాలవఱకు మనపరిష్కర్తలు సంస్కరించినవే యనియు, నఖండయతిరహిత పాఠములే ప్రాచీనపాఠములు కాఁదగియున్నవనియు మనవి చేయుచున్నాను.

---

# పిలుపు

శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యం

ఎవరి నూరక పిల్చెదవే పికాంగ
నామణీ, యూరివెలుపల నామ్రశాఖ
మాటునం డాగి, తహతహ తేటపడఁగ
కుహూకుహూ యని సలలితోత్కూజనముల.

నిన్ను విప్రలబ్ధ నొనర్చు నిర్దయుండు
నీటుకాఁ డెవ్వఁడోగాని, నీరవము శ
పోయుగళి దూఱి మరుకోలవోలెఁ బ్రణయి
లోక మతలకుతల మొనర్చును నిజమ్ము.

ఉలవచెల్లగిలు పడుచు లుల్లముల ది
టవుపఱచుకొనెదరు పని నవలఁ బెట్టి;
చెంత వరికుప్పఁ ద్రొక్కించుచిన్నకాపు
పశువు నదలింప మఱచు సప్రత్యయుండు.

ఇచ్చటికి నాగరికు నన్నుఁ దెచ్చినపని
మళ్లు మాన్యంబులుఁ జనుల్ మఱచిపో
నిల్చు నాస్మృతిపథమున నిశ్చయముగ
నీ పిలుపుతీపు నీమావితోపువలపు.

---

# సత్యసందీప్తమైన సాహిత్యము వైకుంఠమునకు సహాపాథికాదా?

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రకృతి, ప్రణయము, భక్తి హృద్వికాసతంత్రు మీటు శక్తులు. ప్రాచీ ప్రతీచీ కవుల వైక్యము భావ ప్రకాశమునకై పురికొలిపినవి. భారతీ ల సంఘము కేవలము మనవ్య ప్రపంచమందే యిమిడి ంపలేదు. పూవులును, పండ్లును, కుజములును, కుంజ లను, పక్షులును, తుమ్మెదలునుగూడ భారతీసంఘ నుచితస్థానము నందినవి. కావుననే భారతకవులకు ృతి, రంగస్థలమున కుశీలవుల వెనుకనుండు దృశ్యమే యుండక వారి హావభావములందు, ప్రసంగములందు క పాల్గొనుపాత్రలై వెలసినది. శకుంతల అత్త ంటి కరుగుచుండ గణ్వఋషిరచే వ్యథకొంది దా? చెలికత్తెలైన అనసూయా ప్రియంవదలే ఖిన్న నసలైరా? ఆశ్రమాంగణమందలి మృగములును, లతా ములందలి నవలును, చెట్లకొంపమందలి శకుంతము గూడ మిగుల మనికితంపనలేదా? తనకిష్యకు కన్య "శకుంతల" యను పేరల పెట్టినో రెఱుగమా? ృతి యనుడు, ప్రకృతిప్రాతినిధ్యము వహించిన పక్షు డు మాతృభావమున నామెను పెనుచుట చేగదా! పంచవటీపులివతలమున నిలిచి శ్రీరాముడు "యత్ర ద్రుమా అపి మృగా అపి బంధవో మే" అని పలికి ృతికిని దనకును గల చుట్టరికమ్ము మెట్టిదో ప్రక పలేదా? రాముడు సీతను పరిత్యజించినను, ప్రకృతి త ఆమెను పరిత్యజింపక, ఆమె దుఃఖమున శ్లాన గా? ఆమెవలె తానుకూడ ఖిన్నవదన కాలేదా? ఆమెకుతోడును, నీడను జూపలేదా? ప్రాచీనాటకోని పరిశీలించితిమేని, యీ బాంధవ్య భావము వగ్గడించు ఉహుళదృష్టాంతములను గనజాలుదుము. ప్రతీచీసాహి త్యము నెంత గాలించినను ఏతాదృశదృష్టాంతము నొక్కండైన గనజాలము. ప్రకృతిలో నీశ్వరసందేశ మును పసిగొనినవారును మునులైన భారతకవులే!

ప్రేమనుగూడ ప్రాచీకవు లాధ్యాత్మిక దృష్టితోనే వీక్షించిరి. ప్రణయ ప్రదీపకళిక ఒక్క జన్మయందే లేజరిల్లి నిర్వాణముగునని మనకవు లెన్నడు విశ్వసింపలేదు. జన్మ జన్మలందు దీనిదివ్యద్యుతులు తళ్కొత్తుట వీ రెఱుంగుదురు. నిందమూలాలై వనమునకు తరలి వందురు సీత భావిభ వమున గూడ రాముడే తనభర్త కావలెనని, ఆపుడు తా నెడబాటు నెఱుగరాదని దురంతహృదయావేదన మున బొగులుచు, మహోత్కృష్టమైన తన యాశీష్టయును వ్యక్తీకరింపలేదా?

సాహిత్యమునకును, మతమునకును సన్నిహిత సంపర్కముండి తీరునని నేను వాదింతును. క్రైస్తవమ తము భవపరంపరను విశ్వసింపదు. మరణానంతమున జీర వాకమో చిరనరకమో[1] ఆత్మకు లభించునని దానియుద్దేశ ము. ప్రేమ మహత్త్వము మలిపుట్టువునగూడ ప్రకాశమగు నని క్రైస్తవకవు లెట్లు విశ్వసింతురు? ప్రాచీన సంప్ర దాయముపై భక్తిపూరితదృష్టి బఱపిన ఇటలీదేశపు ఋషికవి డాంటే, తన ప్రేయసి బియాట్రిస్‌తో నవ్యలోకమున మసలెను (Vide, Dante's Divine

1. ఇందలి లోపము ఈశ్వరకారుణ్యమున కెదుట ప్రశ్నచిహ్నముగ నిలుపునదని క్రైస్తవపండితులు గుర్తిం ; క్రీ. శ. ౧౪౩౯ లో ఫ్లారెన్సులో జరిగినసమావేశమున స్వర్గముగాని నరకముగాని కానితావు (Purgatory) వని తెలిపిరి. ఆత్మ అనుతాపమందుటకు కొంత అవకాశమును పడయునని ఫరార్ మున్నగుక్రైస్తవవిజ్ఞాను లనిరి.

Cemedia). ఈతని దృష్టాంతమున కంజలిఘటించిరియు, ప్రేమము గీర్తించిరియు (Vide, Shelley's "Love's Philosophy") షెల్లీకవీంద్రుడు ప్రతీచీ ప్రపంచమున ప్రఖ్యాతి నందుట నిక్కమే! కాని యీతని ప్రేమ తాత్త్విక మహత్త్వముతో నుదాత్తమైనది కాదు. ఒక్కొక్క యువతితో కొంతకాలము చెలిమిచేసి, తానందిన తాత్కాలికోద్రేకముకతన షెల్లీ ఒక్కొక్క పద్యము వ్రాయువాడు. హేరియట్ వెస్ట్‌బ్రూక్, ఎలిజబెత్ హిచెనర్, మేరీ, తెరిసా, జేన్ మున్నగు యువతు లీతని పద్యములందు ప్రత్యక్ష మగుచుందురు. డాంటేకవి రచించిన "Vita Nupva" తో షెల్లీకవి విరచితమైన ప్రేమ గీతిక "Epipsychidian"ను పోల్చి చూచితిమేని, వారిదృక్పథము లెవ్విధమో తెలియును. మన చంపక పుష్పమును దలచి పులకిత హృదయుడైన షెల్లీకవి, మన సంప్రదాయమందలి పీయూషమును గ్రోలినాడు కాడు. పెట్రార్క్, బొకేషియో, వర్జిల్ మున్నగు యూరోపియను మహాకవులైనను మనమహాకవులవలె తాత్త్వికచింతయందు (మానససరోవరమందలి కలహంసలవలె) మునుగిత నీద జాలరైరి.

పంతములు కావున భారతకవుల కన్నులందా ధ్యాత్మికదృష్టి తేజరిల్లెడిది. విశ్వరూపసందర్శన భాగ్య మెట్టిదో స్వానుభవమున దా నెఱిగి వ్యాసభట్టారకుడు తనప్రధానపాత్రలలో నొకరిద్దఱికి దాని నలవడజేసినాడు. దివ్యదృష్టిగల మనకవులు అతిలోక చిత్రముల నెన్నిటినో విలోకించి మురిసిరి. మహిమోపేతమైన అంతర్దృష్టి (Mystical Vision అని వ్రాయవచ్చును) మహాత్ములకే లభించును. భవ్యభావములను ఆత్మజీవితములందు దీపశిఖ లొనరించుకొని, వానివెలుంగున మనకవులు మహోత్కృష్టములైన రచనములను సృష్టించి, ఎమర్సనాది పాశ్చాత్యమహనీయుల కైమోడ్పుల నందిరి. వీరివలె నుజ్జ్వలచరిత్రులైన రచయితలను పాశ్చాత్యవసుంధరలో గానము.

జాతీయత్వమును గాక అంతర్జాతీయత్వమునే మనకవు లారాధించిరి. భారతాంబ తనబిడ్డల నొక తీరునను, విదేశీయుల నింకొక తీరునను, తనమత

ములు, తనసాహిత్యమును ఒక దృక్పథమందును
మతములను సాహిత్యములను అన్యదృక్పథము
వీక్షించినది కాదు. గ్రీకులు, రోమనులు, సిథియ
వీరును వారు ననవేల ఎన్న జేరజాలెడివారికి వారి
శయ లెట్టిదైనను, స్వాగత మొసగినది. ఈ సమ
బుద్ధిని ఈసమాదర సంప్రదాయమును భగవద్గీతయే భ
భగవతికి గఱపినది. భారత ఋషికవులు "సర్వే జ
సుఖినో భవంతు!" అనువాక్కు నుచ్చరించి ఇద్ధ
వైభవులై జగద్ధితమగు మహాకావ్యములనే రచి
కాని "మాదేశమే మాపాడిపంటలే!" యని
గానము లాలపించిరి కారు.

ప్రపంచ పరిస్థితుల ననుగమించి, చరిత్ర కాని
ఆదేశము ననసరించి, నవ్యభావములు ప్రజా
యములందు ప్రవేశించి స్వీయచరితార్థత గాంక్షించ

ఆంగ్లయుగమున నీభావములు భారతమాన
నాశ్రయించిన వని యొప్పుకొనక తప్పదు. ఆంగ్లర
మనిన ఘనత ఆంగ్లేయులదని తలపకెల్లరు. ఆ
విర్భావమును, సమస్త వసుంధరలో జనించిన
భావోద్యమమును ఒక్క సమయమున తెలసూపు
ఆంగ్లయుగ మని భారతీయులము తఱచుగ పేరొ
దుము. కాని, అవ్వలి భావసృష్టి ఆంగ్ల వాఙ్
హృదయమున సంపూర్ణప్రవేశ మందుటచే వాఙ
కాలమున నాంగ్ల భాషాయోష లోకోత్తరప్ర
ముము పడసి, నవయుగ సందేశమును భారతీయు
దెలుపు రెండవ భారతియైనది. సర్వాంగసుందరి
మున ప్రవేశించుతఱి ఆమె నుపలక్షించుదృష్టి నముప
ఆమెవలన చేకుఱుఫల మెందును. ప్రాయవతి గ
ప్రవేశము గావించినపుడు, చాలకాలమునుండి నట్టి
విడసి కన్నతల్లియై స్తన్యమొసఁగి, విద్యాబుద్ధులు
పుము పండుముత్తయిదువైన స్త్రీలలామను జుగుప్
జూచుట చెప్పరాని చేటు చేతకు దలపడుటకాదా?
యుగమున పాశ్చాత్యుల మిందులకు గడంగితి
తెలుపుట సత్యదూరము కాదు.

వంగీయులందు అత్తాకోడండ్రవగ అంతిగా
రాదు నవవధువును పంచుముత్తయిదువైన గృహిణి

ద్ధీకరణమును క్రొన్నవయును కలికొరమున చెలు
దులీల) వంగావనిలో వెలసి, వంగదేశమున నపూర్వ
దర్శసృష్టి గావించిరి. ఇంతకుమున్న మనము పలికిన
చీప్రతీచీసాహిత్యపరిశీలన మీ యిర్వురసుణవిమర్శ
!

తమ భావరోచులను, దానితల్లియైన సంస్కృతము
లను గల భక్తి కించుకంతైన భంగము రానీయక యుంచి
ఆంగ్లము నాదరించి వంగసాహిత్యోపాసకు లిరు
లనుండి చేకులు మేళ్లు గైకొని, తమమాతృకకు సమ
చిరి. సచేతన సంప్రదాయ నూతనభావనై భవముల
రసమేళ్ళనము చేటి వంగసాహితిని పరిశీలించి
డు గోచరించి మనమనసుల కెంతేని యానందము
వఫును. విపులపరిశీలనమున బహుళదృష్టాంతములను
నజాలుదును. కాని స్థలపరిమితి ఇందులకు సమ్మతిం
. పూర్వపశ్చిమ సంప్రదాయములకు తమరచనలందు
చెలిమి చేకూర్చిన ప్రజ్ఞాధురీణు లనుకు మైకేల్
దనూదన బంకించద్రులును, గిరీశచంద్రద్విజేంద్రులును,
చంద్రశరచ్చంద్రులును ప్రాచీప్రతీచీ వసుంధరలందు
కీర్తి మ్రోగించి, దిగంతవిశ్రాంత కీర్తిమంతులైరి.
రచనములను విలోకించినపుడు విచిత్రములైన దృశ్య
లు మానసగోచరమగును. గిరీశచంద్రఘోషు ఆధుని
!! కాని యాతనిరచనలు ఆధ్యాత్మికవిభవముతో
ప్యను, రామకృష్ణపరమహంస వివేకానందస్వాముల
ంప నందినవి. మరొ మోహతిమైన చైతన్యస్వామి జీవి
నీతడు నిరుపమానకౌశలమున చిత్రించినాడు.
జేంద్రుడు షేక్స్పియరుమహాకవి ననుకరించె నని
హరణోపేతముగ నీతని నాటకముల నాంధ్రీకరించు
పెక్కండులకు మున్నే ఆంధ్రపత్రికలకు
సితిని. ద్విజకవిని కొందఱు వంగవాసులు
క్స్పియరు మహాకవితో పోల్చుచుందురు.
చిత్రక నాటకములను దేశభక్తిని ప్రధానాశయము
వించుకొనిన రూపకములను మనదేశమున లేవంటిని.
ంతవనుక ద్విజేంద్రు డీలోపమును మపుచేసెనని
వచింతును. స్వాతంత్ర్యమునకై, ఆత్మగౌరవమునకై,
హిందూ ధర్మరక్షణమునకై, ఉదారాశయసిద్ధికై రఘ
పుత్రవీరులను రసపుత్రరమణులను ప్రాణములు పరి
త్యజించుటకైన సంశయింపనివిధము నీత డత్యద్భుత
ముగ దనపాత్రల క్రియాకలాపమున, కుశలపుల చరిత్ర
గ్రథనమున దృష్టాంతీకరించెనుగదా![2] ద్విజేంద్రుని
దృష్టాంతము ననుకరించి, రమేశచంద్రుని చారిత్రకనవల
లను చేకొని అమృతలాల్ చక్కని రూపకములను
రచించినాడు. బంకించంద్రునకును స్కాటునకును చాల
పోలిక లున్నవి. "దుర్గేశనందని", "ఐవేన్ హో"లను పరి
కించినపుడు వీరి భావసామ్యము సుబోధకమగును. ఈ
మహారచయిత లిర్వురును దమతమ ప్రజాజీవితములను
చక్కగ చిత్రించిరి. ఇబ్సెన్, గాల్స్వర్దీ ప్రభృతుల
మేలిరచనలు పొడసూపకపూర్వమె శరచ్చంద్రుని లేఖిని
నవ్యభావోద్రేకముతో చలించినది. హిందూసంఘజీవి
తమందలి ఉడుకుతలపులు ఈ మహారచయిత మనసున
కొరబడినవి. పదపడి అపూర్వపాత్రసృష్టియం దాత్మ
ప్రకాశ మందినది. వంగసాహిత్యగగనమున నిక్కముగ
చంద్రార్కులై యుదయించిన శరచ్చంద్ర రవీంద్రుల
సంఘజీవితమున నవి మేమాలోచనులై వీక్షించి నూతనా
లోకమును దానిపై ప్రసరించి తమోనిలీనములైన సెర
కుల నరిగొనిరి.

ఆదర్శకవి నారదమునివంటివాడు. ఇతడు
త్రిలోకసంచారి. దేవ మానవ జీవితములు నడచుతెంపు
నీత డనుక్షణము పరీక్షించుచునే యుండును. మానవ
సంఘమందు నడచు నాటకమును రంగస్థలమున నెక్కిం
చును. నెక్కిరించి, వెడలిపోవుట వీని యాశయము
కాదు. సంఘసముద్ధరణ మీతని ప్రధానోద్దేశము.
శోద్ఘాటన విమలగాంధర్వము వినిపించి, హృదయమున
నీత డపూర్వమైన పులకలు లేపును. ఇట్టికళోపాసకుడు
రవీంద్రుడు.

ఉపనిషచ్ఛిఖరములనుండి జాల్వారుభావధుని
రవిరచనమున గలదు. రవివాక్కులు దివ్యదోలికలు.

---

2. సావిత్రి కల్యాణి మానసి మహామాయలను రాణాప్రతాప దుర్గాదాసు గోవిందసింహ భీమసింహు
లు చిరస్మరణీయులు కాలేదా ?

జయదేవ షెల్లీలను, చండీదాసు కీట్సులను ప్రణయ పరిష్వంగములందు పరితోషమందును వానియం దూగాడుచుందురు.

ఆధునికయుగమున నద్భుతప్రశస్తినందిన ఆశయములు — దేశభక్తి, దరిద్రనారాయణసేవ[3] — దివ్యమందిరములోని రవిరచనమున శంఖారవఘంటానినదములు సలుపుచుండును. ఈశ్వరుని సృష్టి సముక్షమందిడికొనియే యెట్టి యుత్కృష్టాదర్శములనైన నీతడు ప్రస్తుతించును.[4]

ఆధునిక యుగమునకు మున్నె అస్తిత్వమే యెఱుగని వంగసాహితి కొన్ని దశాబ్దులలో ప్రపంచ ప్రశస్తినంద, ననల్పమైన పూర్వవిభవముకలవై ననర్ఘమైన ప్రసిద్ధినందిన ఆంధ్రవాఙ్మయము నవయుగమున వసుమతీసాహిత్యములలో నింకను స్థానము నందజాలకపోయెను.

మనరచయితలు బాహ్యప్రపంచములో జోక్యము గలిగించుకొనిరికారు. వీరిలో నాంగ్లమునకు పరిచితులైనవా రించుమించుగ లేరనియే చెప్పవచ్చును. కొం దఱే కాంగ్లమున నలవోక. భావబంధురమైన వాతూలము రివ్వురివ్వున వీచుచుండ దలుపులు కొని తమయింట దాము పడియుండి, ఘోషతో వీరు కాలక్షేపము జేయుచుండిరి. మను చదివిన కొలదిమంది ఉద్యోగములను సకో లను పిడికిట బట్టుటకే అక్కరైన ముక్క ముక్కున బట్టిరి. వీరి హృదయమున జిజ్ఞాసా రవుల్కొనలేదు. వీరు రచయితలు కారు. ఆంగ్ల వముకలిన దమకును, తమ సాహితికిని, సంఘమునకును, తమ సేవకును వీరు చేటుదెచ్చిరి మేలును గాదు. దైవందినవ్యవహారములనుండి మును బహిష్కరించి, ఆంగ్లమును (దీనిలో తా నది మిడిమిడి జ్ఞానమే యైనను) ఆహ్వానించిరి. వ విద్యావిధానమునకు వీరిప్రకృతి వంగి సలాము చేసిరి

జిజ్ఞాసాగ్ని వంగహృదయమున ప్రజ్వరిల్లి భుక్కై గతశతాబ్దమున వివిధ విజ్ఞానాంగముల మహాద్భుత ప్రజ్ఞాధురంధరులను విశ్వదిగ్వలయ నిలిపినపుడు ఆంధ్రభూమి ఒక రామమోహన రా

---

3. ఇట్టిసేవ గ్రామజీవితమున విశేషముగా నివ్వటిలునని ఈతని దృఢవిశ్వాసము. రవీంద్రుని పలు పరిశీలింపుడు :

"Our object should be to try to flood the choked bed of village with the stream of happiness. For this, the scholars, the poets, the musicians, artists have to collaborate to offer theircontributions. It is fulness of life makes one happy, not fulness of purse." మధురభావగానములందే కాలము గడపివేయక, రాగపూరితాంతరంగుడై, అర్ధశతాబ్దమునుండి స్వీయరాష్ట్రమందలి పల్లెవాసులపునరోభివృద్ధికై పవిత్రమైన కృషిసలుపుచున్నాడు.

4. రవీంద్రుని కవిత్వమహత్త్వము సవిశేషముగ నిర్ణయించుట కిందు తావులేదు. పూర్వోక్తాంశ దృష్టాంతీకరించుటకై రవీంద్రుని గీతాంజలి వాక్కుల గొన్నిటినిమాత్ర మిందు నుల్లేఖించుచుంటిని:

"My poet's vanity dies in shamebefore thy sight O! Master poet! I sat down at thy feet. Only let me makemy life simple and straight like a flu reed for thee to fill with music." "Hereis thy footstool......lost." "When I t bow to thee......and lost." "God is there......on the dusty soil." "Come out of meditations...sweat of thy brow." "Miseryknocks...of night." "Yes, I know.... forehead." "The morning light......touchedthy feet." "This is my prayer......t will with love." "Where the mind is with-out fear and the head is held high..... that heaven of freedom, my father, let mycountry awake."

ఉపనిషత్తులభావములు రవివాక్కులందు మెండుగా గలవని పాఠకులు గ్రహింపగలరు.

ఒక కేశవచంద్రునిగాని, ఒక రామకృష్ణ పరమ
ను గాని, ఒక వివేకస్వామినిగాని, ఒక జగదీశచం
గాని, ఒక ప్రఫుల్లచంద్రునిగాని, ఒకరసవిహారిని
ఒక లాల్‌మోహనునిగాని, ఒక సురేంద్రుని
ఒక ఆశుతోషునుగాని, ఒక రమేశచంద్రునిగాని,
యదునాథునిగాని, ఒక హేమేంద్రునిగాని, ఒక
ద్రునిగాని, ఒక గిరీశచంద్రునిగాని, ఒక బంకిం
నిగాని, ఒక రవీంద్రునిగాని, ఒక శరచ్చంద్రుని
సృష్టింపలేదు. ఇందఱు యుగపురుషు నొక్క
న నొక్కరాష్ట్రము కనుట ప్రపంచచరిత్రయం

వంగవసుమతిలో వెట్టినవ్వనియైనను, ఆంధ్ర
సరలో ప్రతిధ్వనించి తీరును. దివాలన లేది ఆం
లపుడు నానాదిశల బరుసలెత్తెనరు. బంగాళమున
ించిన భావోద్యమతత్త్వము మన పెద్ద లెందఱు
యుంగము గావించుకొనిరి? ఈశ్వర చంద్ర విద్యా
గరి దాంపించు మహానీయుం డొక్కండు తెలుగు
బుట్టుట నిక్కమే! ఈతడు క్రొత్త
దీసిన మహాపురుషుడే! ఈతని సాంఘికోద్య
వ చేతగల ఆంధ్రులు పాల్గొనుట వాస్తవమే!
వీరు తమనాయకుడైన వీరేశలింగమువలె వాంగ్మ
శ్యాభివృద్ధికై నడుము గట్టిరి కారు మాతృభాషా
గములు విశేషముగ విస్మృతించి, పూజాదులను
నములను పరభాషలోనే సాగనిచ్చిరి. స్వభా

మను మఱచి, భావస్వాతంత్ర్యమునుకుట్టించి పర
భావలో మహోపన్యాసము లిచ్చుట విరుద్ధకృత్య
మనియు, స్వతదనవిఘాతమునకు దలపడు టనియు వీరు
గ్రహింపకుండుట శోచనీయము. పరిహాసాస్పదమైన
ఈ దృశ్యము మఱే రాష్ట్రమందును గోచరింపలేదు.
చేదైనను ఇది మన రాష్ట్రమునుండి అంతర్హితము
కాలేదు.

ఈ యంశము నిక్కమైనను అప్రియమైనది.
మనసును వేధించునది. తోడిసోదరుల నుద్రేకించునది.
అప్రియమైన దైనదేమి సత్యము నిత్యారాధనము నంది
తీరవలెను. సత్యాన్వేషి సాధారణప్రజాభిప్రాయముల
కెదురేగువాడు కావున సత్యాచారునకు తలవొగ్గి
తీరవలెను. నేడు గాకున్న రేపైన సంఘ సారస్వతము
లకు కల్యాణము చేకూర్చువా డీతడే! ఆత్మపరిశీలన
మీతని ప్రథమకర్తవ్యము. అంతరంగములోనికి త్రిప్ప
బడిన దృష్టియే ఆత్మపరిశీలన మందుము. ఈ
పరిశీలనమున దొంగ గోచరించును. అబద్ధమే దొంగ.
గుర్తింపబడిన అనృత మరనిముషమైన నిలవదు. అంధకార
మంతరించినపు డాలోకము కనులపండు వొనరించును
గదా! అనృతము అంతర్ధానమైనంతన శ్రీ విష్ణువలె
సత్యము ప్రత్యక్షము కాదా? సత్యసందీప్తమైన
సాహిత్యము వైకుంఠమునకు సహపాఠి కాదా? సాహిత్య
వైకుంఠము నాంధ్రవసుంధరలో నెపుడు చూతుమో!



# పురాస్మృతి

"సంపత్"

ఎవరు పలికింతు రా జరావృజినవీణ
శ్రుతి లగింపక, మూర్ఛనాగతులు లేక
ఒకదరిద్రాణజీవితశకల మింత
కలతవడి — ఒక్కస్మృతికీల కలవరింప.

శిథిలజీవితతంత్రీవిశీర్ణగీతు
లుదితకీలాప్రతానమ్ము లుఱిమికొంచు
నన్ను, నాలోని జీవనానందసుధను
ముసురుకొనివచ్చి, నిశ్శబ్దముగ దహించు.

ఆ సుఖస్ఫూర్తి ఎన్నడో అంతరించి
హృదయమే మసనమ్ముగా నిదురవోయె
శకలితమ్మైన మధురప్రశాంతి కింక
లేదు నవజీవనారుణలేశమేని.

లనదుపస్స్వప్నపరిమళలాలనముల
సంతరించిన మధురోహ లంతరించి
శీర్యదానందపరిధూతచిక్కణాస్ర
మధువు చషకమ్ములో త్రాగుమని యొసంగ.

ఒక వసంతానుభూతిలో నుండనీక
ప్రతిఋతువుకూడ నన్నేల బాధపెట్టు
పాయ లైపోవువలపుల తీయదనము
లెద భరింపని స్మృతికీలలే మిగిల్చె.

నవవసంతాల శైశవానందకేళి
ప్రథమచుంబనపరిసిక్తరసికరేఖ
వెఱి వెఱుంగని యౌవనోద్వేలభరము
స్వాప్నికామృతసీమాతుషార మయ్యె.

ఏదో శూన్యము నిరుపేదయెద వసించి
ప్రత్యణువులోన శూన్యభావమ్ము నింపు
తెలతెలని వేగు మొయిలుదారుల చలిం
బలమెఱుంగదు నాగరుచ్ఛలనమేని

బ్రతుకు నిశ్శబ్దమున కూలిపడిన నన్నె
ఈవినోదమ్ము చవిగొన నీడ్తు రేల?
పవలెఱుంగని నామనఃపద్మమునకె
అది సంధ్యారుణోత్సవ మందు రేల ?

అంగనాశ్లేషపారవశ్యమునకన్న
ప్రణయినీవియోగవిషాదభరమె ప్రియము
కృభ్రపరికల్పితశ్లేషకృతులకన్న
తలిరుచెడదకు భావగీతమ్మె ప్రియము.

నాకుటీరమ్ములో నేను శోకమూర్తి
నిరులతెరలందె శూన్యపుటిరుకులందె
కూరుచున్నాను శిలవోలె గొంతులేక
కుమిలి హృదయమ్ము తాపాన కొట్టుకో

చుకన్నీరు సితకటాక్షాంచలముల
చి తొలుకాడ పొన్నపూనెలత, విరియు
రముతోడ చిఱునవ్వుకిళలు దేర
చు నిశ్వాసపరిమళోర్మ్ముల నొకింత.

మునిద్దురలో నిశ్వాసవిరవీణ
నోద్వేజితాలాపవిహ్వలతి నింప
జీవికః గదలించు సుమ.రీమ
ష్మ లాశాపథాంచలలాస్యములకు.

శర్వరీచ్ఛాయలో నొక స్వప్నశకల
మమృతశైతల్యభానస్మహా॰ప్రకీర్ణ
కాముకీస్వర్ణతోరణకాంతి విరిసి
శమితజీవితప్రణయప్రశాంతి నిచ్చు.

మూసికొనిపోవ నయనాలు-మూగవోవ
గళముసందులలోని గద్గదికకూడ
ఒక్కమెఱ పేదొ జీవక కొత్తిగిల్లి
మధురచైతన్యమూర్తిగా మంతరించు.

---

# ఆంధ్రప్రభ

శ్రీ శివరామం

యుగాలనుండీ జగాల నిండిన
అనంతశక్తే ఆంధ్రప్రభ రా
పూర్వాపరశైలోర్వులు పండిన
అరుణజ్యోతే ఆంధ్రప్రభ రా!

ఆంధ్రప్రభ నీహారాహార్యం
మస్తకనిస్తుల మహత్వతత్వం
ఆంధ్రప్రభ క్షీరాంభోధితరం
గాంతరవిస్ఫురదసితవికాసం.

వీరకరాంచిత దారుణాసిధా
రాంచలబలమే ఆంధ్రప్రభ రా
తరుణీమోహనతరదరవికసిత
హాసచ్ఛవియే ఆంధ్రప్రభ రా !

వాడవాడలూ ఆడే మాటగ
పలకర ఆంధ్రప్రభగాథావళి
గుండెగుండెలో మండేపాటగ
పాడర ఆంధ్రప్రభగీతావళి.

# సోమయాజి ప్రతిభ

శ్రీ విశ్వనాథ అచ్యుత దేవరాయలు

" అశ్వత్థామ ప్రముఖరథికత్రయంబు సత్వరంబున నచ్చట (రాజరాజు పడియున్న చోటున) కరుగుదెంచి, యరదంబులు డిగ్గి,

"కడు బెట్టిదంబగు గాలిచేఁ గూలిన
మహనీయసాలభూరుహము పోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన
రాజితవన్యవారణము మాడ్కిఁ
కల్పాంతవాయుసఖస్ఫురణంబున
నివిరిపోయిన మహార్ణవము కరణిఁ
కాలవిపర్యయమునఁ దూలి మేదినిమీఁదఁ
బడిన పూర్ణేందుబింబంబుపగిది
దుఃస్థుఁడై యుండియును నొప్పుదొఱఁగకున్న
యన్నరేశ్వరుఁ గనుఁగొని యడలు సెడలఁ
దోఁడ మేనులు దూలఁగఁ ద్రొట్టువడుచుఁ
జేరి యాతనిచుట్టు నాసీను లైరి."

ఇది తిక్కనసోమయాజి రచించిన శల్యపర్వద్వితీయాశ్వాసమునందలి చివరిపద్యము. ఇందలిభావము కృప కృతవర్మాశ్వత్థామలు పడియున్న రాజరాజును గనుగొనుట.

ఇచ్చట ఉపమానములు చాల సొగసుగా కూర్చబడినవి. దూరముననుండి రథికత్రయము రాజరాజును జూచిరి. ఆపడియున్న దొక మద్దిచెట్టువలె నున్నదట. ఊరిబయట అగుటచే పడియున్నది చెట్టనుకొనుట సహజము. ఇంక కొంచెము ముందునకు వచ్చిరి. ఆవస్తువంత సువిస్పష్టముగా కనపడకపోయినను అవయవములు కనపడజొచ్చినవి. అందు

వలన కిరాతమార్గణముల ద్రెళ్లిన వన్య
రణములతో పోల్చినాడు కవి. వారు వ
నది యుద్ధభూమికి. కాన వా రావస్తు
జూచి పడిపోయిన ఏనుగని భ్రమసిరి.
బుద్ధి ఎప్పుడును తత్పరిసరములకు సన్నిహి
ముగా నాలోచించును. మన మరణ్యము
నున్నా మనుకొనుడు! ఏ చెట్టు కనపడినను
టిలో ఏలుగుగొడ్డుగా భావింతుము. కాన
యున్న దుర్యోధనుని ఏను గనుకొనుట
త్యము. రథికత్రయము మరికొంచెము
రకు వచ్చిరి. ఆపడియున్న దొకమనుజు
తెలిసినది. శక్తిహీనుడై పడియున్నాడు.
దువలన కవి ఆయనను నివిరిపోయిన మ
ర్ణవముతో పోల్చినాడు. వారు రాజర
వద్దకు వచ్చిరి. ముఖము కనపడినది.
యున్నది దుర్యోధనుడు. అందుచే ఆయు
కాలవిపర్యయమున మేదినిమీఁదఁ బడిన
ద్రునితో పోల్చినాడు. ఈవిధముగా ఉప
నములు ఒకదానితరువాత నొకటి స
ముగా వ్రాసి, వారు రథమునుండి దిగి దు
ధనుని వద్దకు వచ్చిరన్న మాటను సొగసు
చెప్పినాడు.

ఇక ఇందు దుర్యోధనుని పాత్ర చ
గా పోషింపబడినది. సాధారణముగా
చెట్టు ఎంతగాలికిగాని పడదు. కిరా
తదితర వన్యమృగములను చంపును
ఏనుగును చంపుట ఎచ్చటనోగాని ఫల

గాడు. సముద్ర మేందుట, చంద్రుడు
ుమీాద పడుట ప్రళయకాలమున గాని
గవు. అట్లే దుర్యోధనుడు గూడ కష్టసా
డు. ఆయనను జయించుటకు పాండవులు
ంబంధు పరిచ్యుతులైరి. కృష్ణుడు చేయ
ినన్ని యన్యాయములు చేసినాడు. అప్ప
ో కాలవిపర్యయమువలన గాంధారిసూ
ం ఓడిపోయినాడు. ఈ ఉపమానముల
ాలమున కవి కురురాజసూనుని శౌర్య
ు ధ్వనించినాడు.

సాలవృక్షము, అడవిఏనుగు, సము
ు, చంద్రుడు— అవి యిప్పు డే స్థితియం
్నను, ఉత్తమజాతికి చెందినవి. దుర్యో
డిప్పుడు దీనావస్థయం దున్నను రాజాధి
ా కురువంశసూనుడని ధ్వని. దుఃస్థుడై
డియును ఒప్పుదొఱఁగకున్నా డనుట.

పడియున్న దుర్యోధనుడు కిరాతమా
మున చంపబడిన ఏనుగువలె నున్నాడట!
గును అడవిలో చంపగలిగినది ఒక్కసిం
ుమాత్రమే. అదికూడ కష్టముమీాద
ంచును. అందువలన ఏనుగు అడవిలో
చారముగా తిరుగును. రాజరాజు ద్వం
ుద్ధమున మదించిన ఏనుగువలె తిరిగి
ు. ఆయన ఊర్ధ్వకాయము వజ్రశిలా
్మితము. అధఃకాయమును రక్షించుకొన
రము లేదు. ఎందువల్ల ననగా ధర్మయుద్ధ
అధఃకాయమున కొట్టరాదు. కాని
భీముడు కిరాతమార్గమున అధర్మయుద్ధమున తొడమీాద కొట్టి జయించినా డనుట వ్యంగ్యము. ఎంత అర్థమును ఒక చిన్న పాదమున కుదించినాడు కవి!

దుర్యోధనుని ముఖమును చంద్రునితో పోల్చినాడు. చంద్రుడు రాజులకు రాజు. దుర్యోధనుడు గూడ రాజరాజు. ఎంత చక్కటి ఉపమానము!

అట్టిదైన్యావస్థలో నున్న దుర్యోధనుని పాత్రను అంత చక్కగా పోషించిన తిక్కన గారి శిల్పము రమ్యతమముగా నున్నది.

ఒకానొకకవి చిన్నభావమును విస్తరించి చెప్పును. మఱియొక డొకపెద్దభావమును కుదించి చెప్పును. రెండవది మహాకవికి లక్షణము. అందుననే తిక్కన ప్రతిపద్యమును అంత అర్థవంతముగా వ్రాయును. ఈయన కవితయందు వ్యర్థపదము లుండవు. ఔచిత్యము ననుసరించి శబ్దార్థములు కూర్చుట కీతని కీతడె సాటి. ఈయన వ్రాసిన ప్రత్యక్షర మంత యర్థవంతముగా నుండును! ఇట్టికవితాశక్తి కిది నాతోచినంతలో ఒక ఉదాహరణము. ఇంతటికవితాశక్తి వలన కర్మయందేకాక కైతయందుగూడ సోమయాజిత్వమును స్థిరపరచుకొన్న కవిబ్రహ్మ, ఉభయకవిమిత్రుడు తిక్కనార్యునకు నా నమస్సులు.

# క వి త్వ ము

## దానితత్వము : అధికారము : స్వరూపము

శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

గణబద్ధమైన రచన కవిత్వ మని మహాజన (People at large) అభిప్రాయము. కవిత్వము వ్రాయుటకుగాని, చదువుటకుగాని యోగ్యమా? లేక కేవల కాలయాపనామాత్రోపయోగమేనా? అమూల్యమైన మన కాలాపహరణము చేయుటకు దీని కెంత యధికారము గలదు? ఇంతకును కవిత్వ మనగా నేమి?

కవిత్వ మొకకళ; లలితకళలయం దొకటి. ఇంద్రియములను ప్రబోధించు భావవ్యక్తీకరణమే కళాయావత్త్వము. వస్తువులు ఆయా యింద్రియముల పరముగ బుజుమార్గమున రసభావముల (Emotions) ప్రేరేచును. అప్పుడే రసనిష్పత్తి. "విభావానుభావ వ్యభిచారీసంయోగాద్రసనిష్పత్తిః" అనిన సూత్రమున భరతమహర్షి కాంక్షించిన మహార్థ మిదియే.

శిల్పమునకు శిలయు, చిత్రలేఖనకు రంగును, సంగీతమునకు స్వరమును, కవిత్వమునకు శబ్దార్థములును వ్యక్తీకరణసాధనములు. శిల్ప, చిత్రలేఖన, సంగీతములందాయాయి కళల ననుసరించి వానిని విశదీకరించు సాధన వస్తువులు క్రమపరిణామముగ నుచ్ఛ్రితనొందుట సుప్రతిష్ఠితము, నుపాదేయము నైయున్నది. సంగీతమునకు సాధనమైన స్వరముకంటె కవితకు సాధనమైన శబ్దము యొక్క గౌరవప్రాముఖ్యము సర్వత్ర విదితము.

శబ్దము భావమునకు సంజ్ఞ; అనగా భావబోధలము. కాని శిలయు, రంగును, స్వరమును భావగర్భితము లనిపించుకొనవు. పైపెచ్చు కవిత్వమువలె నవి యవిచ్ఛిన్న కార్యకలాపము నసలే చిత్రింపలేవు. శబ్దములకే యీశక్తి కలదు. ఇట్టిశబ్దములచే సృష్టింపబడినదియే తప్ప కవిత్వ మన వే రేదియులేదు. మనచిత్తము నాకర్షించు ప్రతిపద్యమునందలి సమ్మోహనశక్తియు నీశబ్ద[illegible] క్రీకరణప్రభావమే!

అసలు శబ్దమునకును మనకునుగల సం[illegible] మేమి? అవి మనజీవన సాధనోపకరణములు [illegible] తమకు తామై మన జీవితముతో తాదాత్మ్యమునొ[illegible] సగభాగములు. బ్రహ్మ యీజీవసృష్టికి కారణభూ[illegible] చెప్పు పురాణవాదులు భాషాధిదేవతయైన సర[illegible] నాతని యర్థాంగిగ జేయుట, యీవిషయమును సూ[illegible] నిమిత్తమే కదా! మొత్తముమీద భావమును, మానవ[illegible] మును అన్యోన్యాశ్రితములు. ఏశబ్దమైనను మనస్థూల[illegible] అవగాహన మగునట్లు అభిప్రాయసంజ్ఞాత్మకమా[illegible] కాదు; అది మానవప్రవృత్తిజ్ఞానముచే దో[illegible] చేయబడి, పరిపుష్టమైన భావమును కన్నులకు గ[illegible] రసదోహలి. శబ్దబ్రహ్మోత్కృష్టత యిట్టిది.

ఇందుచే కవిత్వము భావసంపూర్ణమైన [illegible] రచనావిధానము లన్నిటికంటెకూడ పద్యము [illegible] రస సమగ్రమనుట నిర్వివాదము. కనుకనే [illegible] మహాకవిపద్యరచనను..."The best words in [illegible] best order," అని నిర్వచించినాడు. కవిత్వ[illegible] శబ్దప్రయోగమునకు గల అర్థసాకల్యమే దీనికి కార[illegible] ఇందుచేతనే రసభూయిష్ఠమైన పద్యమునం[illegible] యొకపదమును మార్చి యన్యపదముచే దానిని పూ[illegible] నప్పుడు ఆపద్య మాచముట్ట భ్రష్టమగుచున్నది. [illegible] కవులు శబ్దార్థములు రెండును నిండారి తొ[illegible] ట్లుపయోగించు పదజాలముయొక్క నూర్పుపద్యము[illegible] పరంపరాగతముగ శబ్దము తనయం దిమిడించి[illegible] మహార్థపటుత్వమును చేర్చి బ్రతుకువాడే కవి య[illegible] మనము గ్రహింపదగును. కవికి శబ్దము కేవలము[illegible]

ధియేగాదు; అనగా బుద్ధితోఁజే యోచింపదు. త్మసంబంధియు, హృదయానుభవసంబంధియు . ఒక్కొక్క శబ్ద మెుకానొకరసమూర్తియగు స్ఫురించినచో నది యాతని మనఃపథమున నెసే లేని పరిభ్రమణాలతో ప్రతిధ్వనించి ప్రతిధ్వనించి, రంపర్యసంపాదితమగు రసభావార్థములచే నత ు పుల్కలెత్తి యతడు ఊగునట్లు సేచనము చేసి, నుభవస్మరణలను, తత్తదనుభూతకాలమందలి ని చిత్తవృత్తిని, యిప్పుడు దృష్టిగోచరము చేయ ; అనగా నొక్కొక్క శబ్దము మానవానుభవస్మృతి సకల సహృదయుల కన్నులకు గట్టునట్లు చేసి త తానరై మనోవీథియం దానందతాండవభ్రమణ చే వెలుగొందును.

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" (Form and ent wel-matched is Poetry) అని భా ండును, "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ," (Poetry a collocation of beautiful words ionised with the desired sense) అని ్యచార్యుడును, "రమణీయార్థప్రతిపాదకః శబ్దః ్యమ్" (Poetry is a composition which esses a fine idea) అని జగన్నాథపండితు , "కావ్యం రసాత్మకం వాక్యమ్," (That position in which developed a Rasa alone constitute Poetry) అని విశ్వనాథు పల్కుటలోని యభిప్రాయ మిదియే! పని గన దప తనతో నెట్టి సంబంధములేని గణితశాస్త్ర కేతిలో బడి కేవల సంజ్ఞవలె నుపయోగింపబడు ముపలెగాక, శబ్దము కవి నారాధించి వాడు కి కాలానుగుణముగ చిత్రవిచిత్రనూత్న నూత్నార్థ వములతో వాసించు నవిమాత్రము ప్రస్తుతము ంచుకొందము.

ఇక కవితకు మన అమూల్యమైన కాలము నప ముటకు గలయర్హత యెట్టిది? ఇది వ్రాయనుగాని నుగాని యోగ్యమా? అను ప్రశ్నలున్నవి. ఈ రెం కొకే ప్రత్యుత్తరము గలదు. దానినైనను చాల సం ముగ చెప్పి విడుతును.

చార్లెస్ డార్విన్ మహాశయుడు వస్తుపరిణామ తత్త్వమునకు ప్రాపైనవాడు; ప్రకృతిశాస్త్రకోవిదుడు. అంతటి మహాశాస్త్రప్రియుడే పునర్జన్మప్రాప్తి తన కున్నచో శాస్త్రపరిశీలన నుజ్జగించి, నిండుమనస్సుతో తనయందలి కవితాప్రకృతిని పెంపొందచేసికొందునని చెప్పెను. ఇట్టిచో కవితయం దెంత యధికారము లేదు? దీనియొక్క యాధిక్యము పతితయొక్క యధికార మునుబట్టి యుండును. అందరకును దాని మహత్త్వనిర్ణ యము సాధ్యము కాదు. ఆంగ్ల సంస్కృతాంధ్ర కవి తలలో ప్రకృతివ్యాఖ్యాతృగౌరవముచే కవితాసింహాస నము నధిష్ఠించిన రసమూర్తులు, కవి శిల్పులనను షేక్స్పి యరు, కాళిదాస తిక్కనాదులు నిర్ణయింపవలెనేగాని, లలితకళలయందు కవిత్వమునకుగల యగ్రస్థానమును, సహృదయులు దానికి బట్టిన బ్రహ్మరథమును మనకు నిర్ణయింప నలవిగానివి. అనుభవైకవేద్యమగుటచే కవి త్వముయొక్క యాధిక్య మేమి యని కవులైనవారు ఎవ్వరు నడుగరు. సహృదయులు నడుగరు. తదితరు లం దాలోచ యంతయు వ్యర్థముగానిచో విస్పష్టముగ జెప్పుటకు దీర్ఘకాలము పట్టును. కవితామహత్త్వమును, అంతమునునది యెరుగనట్టి కాలమే యెరుగును; విశాల మగు ధారుణియే యెరుగును. సత్యసంకల్పులై, కవితను పోషించిన మహారాజులను, రాజకవులను, కవిరాజులును ఎరుగుదురు.

అట్లయ్యు కవితాధిక్యమును ప్రాకరిణికముగ నిచ్చుట మహాకవుల కొందఱిపల్కుల మూలమున నివే దించెదను. కవిత్వము జగత్తునందలి సత్యమైన వస్తువును గూర్చి బోధించును. సత్యం, సుందరం, శివమ్- ఇవియే కవిత్వమున కాశయములు. వీని నేమరనిదియే కవిత్వము. రసము లన్నియు కాన్తిగుణమునుండి యుద్భవించు చున్నవని "దీప్తరసత్వం కాన్తిః" (కావ్యాలం కార సూత్ర III--II--౧౪) అని పల్కుచున్న వామనా చార్యు లొకటి రెండుసూత్రములలో "కావ్యం గ్రాహ్య మలంకారాత్" అనియు, "సౌందర్య మలంకారః" అనియు ప్రశంసించెను. ఇక్లే:

"A thing of beauty is a joy for ever
... It will never fade into nothingness"...
(About art and Artistic)

అని మహాకవి కీట్సు నుడివినాడు. అంతియే కాదు: "Beauty is truth, truth beauty-that is all you know on earth, and all ye need to know" అని గర్జించినాడు.

కవిత్వము సత్యం, సుందరం, శివమ్ అనువాని యముల బొందు టనగా విశ్వలీలా కారణభూత మగు బ్రహ్మ సంకల్పమునకు వ్యాఖ్యానము చేయుటయని యర్థము. ఒకేవాక్యములో చెప్పినచో కవియనువాడు సర్వమానవ హృదయములలోను చొచ్చి యోచింప గలుగవలెను. మానవకోటియొక్క క్షేమము తప్ప తదితరాపేక్షలతో నిట్టికవులకు జరుగుటలేదు.

ఈ యంశము ఆంధ్రశబ్ద చింతామణియందలి "విశ్వశ్రేయః కావ్యం" (సంజ్ఞాపరి-సూత్రం, ౧) అను సూత్రమువల్లను, నన్నయభట్టు "మహాభారతసంహితా రచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్" అనుటవలనను, 'కృష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని గావించె' ననుటవలనను, 'ఆంధ్రావళి మోదముం బొరయు'టకై తిక్కన భారతాంధ్రీకరణమునకు దొరకొనియె ననుటయందును నిరూపిత మగుచున్నది.

అగుచో కవిత్వ మెట్లుండవలెను? సూక్ష్మముగ చెప్పచో నిది యప్రయత్నలబ్ధముగను, రసానందజనకముగను, సర్వజనసాధారణ స్వభావసిద్ధముగను నుండవలెను. "It should strike the reader as a wording of his own highest thoughts and appear almost a remembrance" అని కీట్సు ఆదేశించెను. అప్రయత్నలబ్ధముగనే గాక భావములు మహోత్కృష్టములుగ నుండుటయు కవిత్వమున కావశ్యకము.

ముఖ్యముగ కవిత్వమునకు కావలసినది యాంతర ప్రేరణ (Inspiration). దీనిచే తీగ మొగ్గలు దొడిగి నంత స్వాభావికముగ కవిమానసవీథియందు భావము లంకురించు చుండును. కవిత్వము నేల రచింపవలెను? ఏల చదువవలెను? అని సహృదయులు ప్రశ్నింపరని యను కొంటిమి; ఏలయనగా కవికి యది యంత సహజసిద్ధము.

> I do but sing because I must,
> And pipe but as the linnets sing"

అని టెన్నిసన్ పల్కెను. ఇట్టియయత్న కృతి ననివార్యమునగు నాంతరప్రేరణయే కవితారచ కారణము.

> "ఒగరు చిగురాకు మేయుచుండు గండు
> కోయిల కుహూకృతుల రీతిఁ గ్రోల్చు నేను
> నా తొలకరించు భావవేగాతిశయము
> గదుర కూజించెదన్ లేఁత కంఠమెత్తి"....

అని శ్రీ కుటుంబరాయశర్మగారు పాడుకొనిరి.

> "సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు"?

అని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ప్రశ్ని చున్నారు. సౌందర్యానందజనక పారవశ్యమును, ఆం ప్రేరణవల్ల నుద్భవించు నావేశమును మహాకవిత్వ నకు కారణములు. ఏదో విధమైన యానందసంపాదన గదా ప్రతిజీవియు నీవిశాల ప్రపంచమునందు వాంఛి నది? ప్రతికళయు, ప్రతిరసమును, ఆనందమునే పర వధిగా నంగీకరించును. ఆనంద మక్కరలే దన రుండరు. జననమాది మరణపర్యంతము మన మెల్లరము ప్రతిబుషిస్వామియును కోరునది యానందమేగ అట్టి యానందవిశేషమునే కవిత్వ మొసగుచున్నది. నది వ్రాయను, చదువను, ఆనందింపను అర్హాతిపుర్హ అవతారపురుషులు సంసారముచే బవలిన యనేకుల పచ్చరణారవిందములకడ కెట్లు గొనిపోవుదురో, య కవులును తమతోపాటు సహృదయుల నందర వా వికసులకేయ శక్తిగలవారు.

కవిత్వము గణబద్ధ మేల కావలెను?

మనోహరముగ నున్నచో వచనము పైతము త్వము, లేక వచనకవిత్వము (prose poetry) పేర్కొనబడదను నని తజ్జ్ఞులవాదము. అయ్యు గ మైనరచవనే మన వివ్యాసమున పరిశీలించుచుండు దీనియొక్క యుత్కృష్టతాతిశయముల నించుక ప్ర వింతము. ఇట్లు చేయుట వచనమును నిరసించుట మాత్రమును కాజాలదు.

"భావస్థిరాణి జననాంతరసౌహృదాని" సందర్భవశమున శాకుంతలములో (అం ౫ శ్లో కాళిదాసమహాకవి నుడివెను. ఏభావస్థితి రసభావ

ods and Emotions) సుందరవస్తు సందర్శనా
ొందిన జన్మజన్మాంతర సంస్కారబలపరిణామ
స్థాయిభావమును, కవిత్వరచనానుకూలముగ జేయు
నో ఆభావస్థితి రసభావములే శ్రుతిమధురములు,
సుందరములు, శ్రుతిమృదువులు నగుపదములలో కవి
యును సువ్యక్తపరచుచున్నవి; అనగా కవిహృద
్పణజేసి రచించిన యేరచనగాని మధురము, సుంద
, మృదులము, మంజులమునై యున్నచో నది
ొవిధమున గణములచే నిబద్ధమైన పద్యమో, లేక
విశేషమో యయియుండును.

"The distinction between poets and
se-writers is a vulgar error" అని తన
ence of poetry యందు పలికిన షెల్లీ
కవియును, "………nor does verse make
whole difference between prose and
try" అని చెప్పిన హాజ్లిట్ పండితుడును, మతి
సులించి యనేకరీతుల పల్కిన తదితరులును
ము తమకు తామై కొన్ని నిబంధనల నేర్పరచికొనియే
ంచిరి. ఇట్టి గణనిబంధన మొకవిధముగ నానంద
మగుటవలనను, కవులు తత్క్రమము నవలం
రు. యోచింప నసలు భాషకును భావము
ను అవినాభావసంబంధ మొకటి గోచరించును.
దరమైన భావమెప్పుడును సుందరమైన భాష నైపు
మొప్పును. కావున కవిత్వము గణబద్ధ మేల కావలె
ప్రశ్నకు తావులేదు. వృద్ధాచారమని (Tradition)
ంపక గణనియమము కవితోద్భవమునకు కార
ు గాకపోయినచో, అన్నవా కవిభావము నైనేయు
న్నదనిరైన మన మంగీకరింపవలెను.

భాషాపరణికిగల లయ (Rhythm) యపారము.
్యచాతుర్య మొప్పునట్లుంచులు తీర్చి, మెరుగులు దిద్ది
ంచినచో గద్యముకూడ పద్యమువలె లయాన్వితమై
యుండును. నేటివఱకు మనకు లభ్యపడిన యాంగ్ల
షలోని గద్యకంటె నాంగ్ల భాషలోని గద్యము బహు
ృద్యము. ఏ భాషయందైన నేవిధరచనయందైనను
ను యింద్రియార్థముల కనుకూలమై కూర్పునట్టినిగ
వలెను; అనగా శ్రవణసుఖము నిచ్చుటావశ్యకము.

పదపారుష్యముచే కర్ణజ్వరకారిగ నున్నచో నది. పద్య మైనను గద్యమైనను సర్వ జనాదరపాత్రమై వెలయదు. పద్యమందలియు గద్యమందలియు లయకు నీవ్యత్యాసము లేకపోలేదు. కవిత్వము లయ యనుగుణముసే యతి, గణ ప్రాసాదులను చేరితో క్రమప్రకారమున నేర్చి కూర్చి వేర్వేరుపద్ధతులకు దెచ్చి యాయాయి కూర్పుపద్ధతులకు శార్దూలోత్పలాదులని పేరిడుచున్నది. దీనినే గణ నిబంధన మనుచున్నారు. ఇట్టి నిబంధనారూఢమైన శబ్దదాంపత్యము భావము ననుకరించుటయేగాక, భావ మున కొక విలక్షణమగు సొగసును పొందించుచున్న దని పూర్వమే గ్రహించితిమి.

అయ్యు మరియింకొక్క సంగతి గలదు. విశ్వ సాహిత్యమందెల్లెడను కవిత గణబద్ధమగుట స్పష్టము. సర్వభాషలందును కవులు గణనిబంధనను పరిగ్రహించు టకు కారణము భావము నందగింప జేయుటకేనా? లేక స్వార్థాభిలాష యేమైన నున్నదా? దీనికి జవాబుగ నొకవిషయము స్ఫురించును.

కళాసౌందర్య మొకవిధమైన ప్రవీణతను, నాజూకుపసందును ప్రకటింప నాస గొనుచుండును. ఇట్టిది లభింపగనే కవి శిల్పులను కొందఱికి పద్యవిశేష ముల (Species of Poetry) యొక్క బాహిరస్వరూ పమే (External form itsef) ప్రీతిదాయక మగును. వెంటనే వారీ యాగణబద్ధమైన పద్యవిధాయీ భావ ప్రకటన కనుకూలమైన దనికూడ స్వానుభవముచే నిర్ణ యింతురు. దీనినే వృత్తౌచిత్య మందుము. వృత్తముల యొక్క యౌచిత్యానౌచిత్య నిర్ణయమున కధికారి కాత్యాయనమహర్షి. ఇతడు "వీరస్య భుజదణ్డానాం వర్ణనే స్రగ్ధరాభవేత్" అని వేర్వేరు రీతులుగ విధించి యున్నాడు. రస, భావ, విషయానుగుణములుగ వృత్త ము లుండవలెనను కాత్యాయనుని యాదేశమునే భాష కులు పరిశోధించి తమగ్రంథములలో స్థాపించిరి. ఇట్టి నిర్ణయమునందు చాలసత్యము కలదు. కనుక పతితయొక్క ఆనందముపైనను ఆలంకారికుల కొక కన్నున్నది. పతిత కానంద మెట్లు కల్గునో విచారించినచో మన కొకరహ స్యము గోచరించును. ఆచారముగ వచ్చుచున్నదగుటచే పద్యబాహిరస్వరూపము పతితకు పరిచితము. పద్యాంత

ర్గతభావము అపరిచితము కనుక చదువరుల యానందము పరిచితమైన పద్యాంతర్గతభావముయొక్క గుణగ్రహణ శక్తితో పరస్పరసంబంధము గల్గి యుండును.

ఇదియేగాక గణబద్ధ మగుటచే సంగీతధోరణి యేర్పడి పద్యము పాఠకుల కింకొకవిధముగగూడ ఆనందము గల్గించును. మఱియు నిది చదువరుల జ్ఞాపక శక్తికిని సాహాయ్యపడును. ఒక చెట్టున కుండు ఆకు లన్నియు నేకనామముచే వ్యవహృతమగుచున్నను వాని యాకారమునందు వ్యత్యాస ముండును. అట్లే భగణ రగణేత్యాదిగణనిబద్ధ మయ్యును ఒకానొకవృత్తము నందలి నాల్గుపాదములలోని శబ్దములయొక్క ధ్వనియు సర్వత్ర సమానమై యుండదు. అక్షరద్విత్వ, బిందు సంయోగాయోగాద్యంతర భేదములచే శ్రవఃపుటములం దొకేపద్యములోని సమగణబద్ధమైన భిన్న భిన్న పాదములు కలిగించు ధ్వని పృథక్పృథక్ఫలితముల కలిగియున్నది. ఇది కవియొక్క శబ్దోపయోగ నిపుణతనుబట్టి యుండును. నిర్ణీతమైన యిట్టి పద్ధతులయం దప్పుడప్పుడు గల్గు నీషద్వ్యత్యాసములచేతనే సుందరమైన వస్తువులపై మనకు మొగము మొత్తక ఆనంద మధికమగుచున్నది.

ఈ విధముగ గణబద్ధమైన కవిత యింకెన్నియో మనము తెలిసికొనుటకై శ్రమింపలేనన్ని విధములచే మన కానందమును గల్గించుచున్నది. ఈ బాధ పడలేకయే రాబర్టు బ్రిడ్జెస్ అను నాంగ్లవిమర్శకుడు

"We can hardly imagine it (the necessity of metre) and may therefore take metre as a necessity of the conditions justified by results." ('Necessity of poetry'- పుట 24 నందు) అని అనెను.

గణబద్ధమైన కవితను హెచ్. బి. చార్ల్టన్ అను నాంగ్లేయ విమర్శకు డిట్లు ప్రశంసించెను :—

"Verse is the voice of the extra-ordinary, the exlted, rare, it moves on a higher plane than the actual" ('The art of Literary study'-పుట 117.)

ఏడవ శతాబ్దమందు కవితకు 'గుణ'మే ప్ర[...] మని చెప్పిన సుబంధుడను సంస్కృతకవి వాసవదత్త (౧౧. శ్లో) సత్కవుల భణితియందే, యనగా సంయోగమునందే యొకవిధమగు మాధుర్య మున్న పలికెను.

"అవిదితగుణాపి సత్కవిభణితిః
కర్ణేషువమతి మధుధారామ్,
అనధిగతపరిమలాపి హి
హరతి దృశం మాలతీమాలా—"

కనుక నింతటితో కవిత్వ బాహిర స్వరూ[...] విమర్శనమును మాని దానియందలి రెండు ప్రధాన [...] ముల గూర్చి తెలిసికొందము.

స్థూలదృష్టిని పద్యరచనను ద్విధాకరిం[...] యొకటి మానవుల గుఱించియు, సంఘటనల గు[...] చియు, కొన్ని కొన్ని స్థలములగురించియు చెప్ప[...] వస్త్వాశ్రయకవిత, లేక వస్తుకవిత యనియు; రెండ[...] మానవ భావస్థితి రసభావములు మొదలగు వాం[...] విషయముల గూర్చి చెప్పబడు రసభావ ప్రధానక[...] లేక భావకవిత యనియు బలుకవచ్చును. ఆంగ్లేయు[...] వీనినే Narrative and Lyrical types of poe[...] అని యందురు. సర్వసాధారణముగ నీ రెండు[...] లొకదాని నొకటి యాక్రమించుట (overlappin[...] తటస్థించుచుండును. అది అనివార్యము. మఱియు భా[...] కవిత వస్తుకవిత కాదే యని విచారించుట, రంభ[...] మాచి యూర్వశి కాదే యని వగచుటవంటిది. [...] బద్ధము వస్తు, భావప్రధానము నను నిట్టిభేదముల [...] కింపక కవితయనుదాని నద్వైతదృష్టితో పరిశీలిం[...] దానియాత్మ తత్త్వమును సూక్ష్మముగ వివరించిన [...] భూమిపైనున్నను, సుదినమునైనను, దుర్దినమునైన[...] ఉత్తరదిక్కునే యాకర్షించు నయస్కాంతమువ[...] కవిత్వ మే రూపమున వ్యక్తమైనను రస మను మ[...] సూత్రముచే నిబద్ధమైనదియే గాని యన్యము లేదు—.

"వాక్యం రసాత్మకం కావ్యమ్" అని వి[...] నాథుడు పలికిన దీయర్థముననే! రుద్రభట్టాచార్యుడు [...] (శృంగార తిలకం, ౧-౬ శ్లో) ఈ తాత్పర్యమ[...] బోధించుటకే

"యామినీ పేందునా ముక్తా నారీవరమణం వినా,
లక్ష్మీరివ ఋతే త్యాగాత్ వాణీభాతి నీరసా."
.. కనుక కవిత్వము రసాత్మక మనుట తథ్యము

ఇట్టి తమ తమ కవితాత్మను (Poetic genius) భిన్నభిన్న కవులు భిన్నభిన్నాభిరుచుల మూలమున వ్యక్తపరచిరి.

---

# శంపాలత

శ్రీ దేశరాజు వేంకటరమణుఁడు

...ఁగుఁబయ్యెద, చెఱఁగు గాలులకు నెగుర
...నవగవీథి మబ్బుల కాఱుఁద్రోవ
...బియలు గిల్లుగిల్లు మటంచు ప్రమాయ
...తవఱకట్టులనుఁ బయనింతులతిక ?

...వ్యముకేశుని జడవాఁగువోలె మెఱసి
...జల నభోవిపిలిమఁ దోలఁచి, మెలఁచి
...ంఝులుగర్భమ్మునం దింకిపోదు వింత
...ల్పముగు జీవి వఱప్రాణమైన నన్నె ?

...ౖచీఁకటి చెఱఁగుటంచలముఁ దివిచి
...ాముసకు నడ్డముగఁ దల ముసుఁగు నునిచి
...ఁ గనినయంత నే గిరుక్కున మరలెద
...త చిన్నారి సిగ్గు గడించినావొ ?

...ులకకన్నులఁ బసిఁడి జ్యోత్స్నలను గురిసి
...రిసికొని యట్లె మాయమైపోవుచుందు
...వమృతగతి యగుదివ్యపదానుపదివి
గూఢజన్మాంతములు నీకుఁ గూడఁ గలవొ ?

విరిసిపోయిన చిన్ని విరిమల్లె బుగ్గని
గ్గులు వెన్నెలలవన్నెఁ గలసినట్లు
నళినీదళములఁ గన్నుల నిద్ర విడిన యు
షశ్శోచులుదయాంశు జాఱినట్లు
చిఱునవ్వునవ్వక్రొన్నురువుమొత్తమువాఁగుఁ
దరఁగజొంపములందు దాగినట్లు
చదల మబ్బులు రేఁచు సంజపుప్పొడిధూళు
లరుణకాంతములందు నడఁగినట్లు
నొకట ముజ్జగములను సమున్మిషించి
ముదిమి చీఁకటి కప్పఁ గొప్పున నదృశ్య
మగునినుం గను ప్రతివేళయందు నేలొ ?
నాచిఱుత గుండెలోనె యణంగిపోవు.

"వేలాలత" నుండి

# వైపెచ్చుట, తప్పు మాదిట!

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

ఒకనాడు రాగయ్య మేం సరసగా కలుసుకుంటూండే చోటికి కాళ్లీడుచుకుంటూ కళేబరం జేరేసి బస్తాలాగ ఓకుర్చీలో కూలబడి ఉస్సూరుమంటూ ఈ కిందిమోస్తరుగా ఏకరెట్టకం ప్రారంభించాడు. అప్పుడప్పుడు మేం ఏదేనా ప్రశ్న వెయ్యడంలో నెగ్గినా, అతడు తను మాట్లాడుతూనే అది వినేసేవాడుగాని, సాధారణంగా ఆగి వినేవాడు కాడు. అందుకని రమారమీ అవిచ్ఛిన్నంగా ఉన్న అతని ఉపన్యాసం మేం, రైల్లో మందుల ఏజంటు అప్పగించే ఉపన్యాసంలాగ, శబ్దగ్రాహిలో ప్రతిఫలించే ఛాయోపన్యాసంలాగ, సశబ్ద చిత్రంలో ఉద్భవించే అఖండ గానంలాగ, ఆపెయ్యడానికి వీలులేని అవస్థలో వినవలిసొచ్చింది:

"వైపెచ్చుట, తప్పు మాదిట! సెబాసు. సిగ్గుండద్దూ! ఎవడేనా నవ్విపోడూ! తనజాతి ఘనిమూలజాతి, చేష్టలు కోతిచేష్టలు, బుద్ధి కుక్కబుద్ధి, నడక పీతనడక. ఉన్నసౌదుభాగ్యం ఇదీ, దీనికి సాయం వేళా పాళా లేకుండా శ్రీరంగనీతులు. వీడిభార్య! — బాబో, అసలు మాట్లాడలేం. వీళ్ల నేరాలు జాస్తీ అయిన కొద్దీ వీళ్ల సబబులుకూడా జోరుచేశారు. వీళ్ల పెడసరం బండలుగానూ! వీళ్లు ఎవరికో నాబోటి మేకలాంటివాడికి ఘోరాన్యాయం చెయ్యడం, వాడు ఎందుకొచ్చిందని సాత్వికంగా నోరు నొక్కుగుని ఊరుకోడం, అయినా ద్రోహబుద్ధి పీడించడంచేత వీళ్లు ఊరుకోలేకపోడం, అక్కణ్ణించి ఆసాత్వికుడికి తన... జరిపిన ద్రోహమే ఆసాత్వికుడివల్ల త... జరిగిందని వీళ్లు ఏడుస్తూ ఎదురు తిరిగి, ... తిరగేసి, నోరుచేసుగుని, అమ్మలక్కల్లాగ ... మీదా వినేవాళ్లమీదా విజృంభించ... అప్పుడు మధ్యవర్తు లంతా అవతలవా... సాత్వికుడుల్లా కనబడుతున్నాడేగాని ... ద్రోహి అనుకోడం, నిజంగా బాధపడ్డది... అనుకోడం. సత్యం ఏదో అసత్యం ... తెలియకుండా పూతపూసి వీళ్లు ఊరుకు...న్నారా, సత్యమే అసత్యంఅని జనం నమ్మే... గోలత్తకం, అసత్యానికి సత్యగౌరవం తె...చి నెగ్గడం. ఏక చెండ్రుకోడం, ఏకఎద్దే... చెబితే గర్వం అని ఏడుస్తారుగాని, నేను... మాయింట్లోవాళ్లంతే, మేం అంతా ... సాత్వికులం! దిక్కుమాలి నక్కలా ళ్లి... వచ్చి నన్ను పేడ్రేగకొట్టకపోతే, ... కోసినా — చాకు మీయిష్టం వచ్చి... తెండి పదునెట్టి — కోపం ఉందా! ఇం... జోలి నాకు కావాలా! వీళ్లకి మరీ వచ్చి... నా అద్దెవాటాలో నేను చేరడానికి ... పూర్వమే తను అవతల పక్కవాటాలో... లాగ పోగై కూచుని, తనమీదికి నేను ... వచ్చానంటాడు, వీడిదుంపతెగా! నేను... నావాటాలో దిగీ దిగకుండానే నాతో... మాతో పోటీ ఎందుకండీ వీళ్లకి! అడిగే... లేకగానీ! మళ్లీ వీళ్లు ఎల్లాంటి సమర్థింపు...కున్నారు, మహా ఋషులకేనా ఇ...

టలు చెల్లవ్! నాకు ఉద్యోగం లేదని
ఎంత ఏడుపో! నాకు ఉద్యోగం కాలేదం
నే వీళ్లు ఇంత ఏడిపిస్తున్నారు, నాకే
ద్యోగం అయితే వీళ్లు బతుకుతారా!
బ్బ! వొళ్ళుగు తినేస్తున్నారు. వేగలేకం
న్నాం. అమ్మయ్య! ముగుడే ముగుడు,
మే పెళ్లాం! పేళ్లతో సహా వీళ్లని ఎల్లా
సంపుటీచేశాడోగాని ఆబ్రహ్మ!"

ప్రశ్న— ఎవరిమాటా ను వ్వనేక!

రా — ఏట్లో వాళ్ల మాట! ఎవరున్నా
మా పొరుగువాటాలో అద్దెకుంటూన్న
గులు!

ప్ర— పేర్లు!

రా— వాడిపేరు గుండయ్య. భార్య
యమ్మ.

ప్ర— ఓహో! ఉమ్మడిస్థలం గురించిన
లా? ఆ మిరియమ్మా మీ కూచమ్మ
పట్టింపులుపోతూంటారు గావును!

రా— అంతటితో కుదిరిందా! హాలూ
ఉమ్మడి. నావాటా తూర్పుది, నాది
పడమటిది. మధ్యహాలులో చెరిసహా
గీత గీసుకున్నాం. కాని, ఆచచ్చినాడు
తిమమ్మల్ని కునకనిచ్చి ఆగీత మావా
కేసి జరిపేస్తూంటాడు. కానీ, వాడిగీత
గారం వాడికి అవుతుందని ఊరుకుంటిని
, ఊరుకుంటూన్న కొద్దీ వాడికి నో
పిపోతోంది, పోటీ బిగిసిపోతోంది.

ప్రశ్న—అసలు కమామీషు ఏమిటి?

రా— అసలా? వాళ్లు గొప్పవాళ్లనీ,
అల్పులంఅనీ; వాళ్లు ఉద్యోగులనీ, మేం
నీ! వాళ్లు డబ్బున్న వాళ్లనీ మేం లేని
వాళ్లంఅనీ! ఏముందీ! గుండయ్యకి కొడుకు
ఓడున్నాడు. వాడు అచ్చంగా బూడిదిగుమ్మిడి
కాయిలా ఉంటాడు. ముహం కొండముచ్చు
మొహం, ముక్కు చిప్పబుడ్డి. అంతోటి
కుమారస్వామి తమరికి ఉన్నాట్టా, మాకు
లేట్టా, అందుకని నేనూ మాఆవిడా ఉడికి
పోయి, వెళ్లి, మాచెల్లెలిగారి అబ్బాయిని
తెచ్చుగున్నాంట తమరిమీద పోటీకోసం!
ఈ మాట పట్టుగుని మమ్మల్ని అడ్డమైన వాళ్ల
దగ్గిరా నిరసన! వాళ్లొచ్చి నాతో చెప్పరనే
గావును ఈబోడిగాడి ఉద్దేశం!

ప్ర— మీరు అక్కడికి వెళ్లింతరవాతే,
వాళ్లకి పిల్లాడున్నాడు అని తెలిసింతరవాతే,
ఒకపిల్లాణ్ణి మీరుకూడా తీసి తెచ్చుగున్నారు
గావును!

రా—సరె! మేం మా చెల్లాయిగారి
అబ్బాయిని అనేకమాట్లు, ఈగుండయ్యకి
కొడుకుకుంక పుట్టకపూర్వమే అపేక్షకొద్దీ
తీసితెచ్చుగునే వాళ్లం. నీచులికిగాని పోటీ
మాకెందుకు ఉంటుందీ! గుండయ్య అంత
టితో ఊరుకోవచ్చా, తన కుర్రవెధవకి
తోపుడుబండీ ఓటి కొన్నాడు. కొన్న
మూడోనాడు, మాఆవిడ, —చెడి బతికావా
బతికిచెడ్డావా అన్నట్టు, స్వతహా అయినింటి
బిడ్డగనక —నాతో: "తీరా మనం పిల్లవాణ్ణి
ఒణ్ణి తీసి తెచ్చినవాళ్లం అవసేఅయాంగదా!
ఊళ్లోవాళ్ల కుర్రవెధవ లందరికీ తోపుడు
బళ్లు ఊరేగుతూన్నప్పుడు మనం అంత చెడి
పోయామా, అంతకీ చాలమా, అంతా
చెయ్యమా? పాడురకాలకిగాని మనబోటి
గాళ్లకి పోటీబుద్ధి ఎందు కుంటుందిగనక! మనం
తీసికట్టు అని ఋజువుచెయ్యడానికేట వాళ్లు
బండీ కొన్నది! ఈపిల్లాడికిమాత్రం బండీమీద

ఎక్కువ ఉండనేఉండదా, కుర్రనాగమ్మ విప్పిచెప్పుకోలేదుగాని! మీరుకూడా వీడికి ఓటి అల్లాంటిదే కొని గౌరవం నిలబెట్టండి" అని సన్నసన్నంగా సమంజసంగా నాభార్య చెబుతూంటే ఆవిడమాట వినకపోడం అనేది మహాపాతకం అనిపించింది. కాని, బులబాటం చల్లారింతరవాత, తీరా బండీమీాది వ్యామోహం రెండుపూటల్లో గతిస్తే, కొన్నబండీ మళ్లీ ఎం జేసుగోం? అని, నేను ఆలోచించుగుని, ఓబండీ 'కిరాయీ'గా తెత్తాంగదా అని మర్నాడు చీకటడ్డతరవాత ఓవడ్లాబత్తుడింటి కెళ్లి, అక్కడికి మరమ్మతునిమిత్తం వచ్చిన ఓ బండీ చూసి, బదులుచేసి తెచ్చిన ఓ పావలా వాడిచేతిలో పడేసి, మర్నాడు సాయింత్రానికి అది మళ్లీ అప్పగించేసే షరతుకి ఇంటికి తోసిగల్లాను. పొద్దున్నే మాపిల్లాణ్ణి అందులో కూచోపెట్టి ఇంకా మావాటాలోనే ఇటూ అటూ తిప్పుతూంటేనూ, గుండయ్యగారు పిరికిపందలాగ వెనకాలే — వీడికాళ్లు పడిపోనూ — వచ్చి, — వీడివేళ్లు అంటించా —అంటుగునేట్టు ఒక్కచరుపునన్నూ చరిచి, పిల్లాణ్ణి కింద పడగొట్టి, బండీ లాక్కు చక్కాపోయాడు. అల్లరవుతుందని అప్పట్లో వాణ్ణి నేను కొట్టలేదు. న్యాయతహా చెప్పొచ్చుగు కొట్టవలిసింది. ఇహా వడ్లాబత్తుడితో ఏం చెప్పనురా బాబూ అనుకుంటూ వాడిదగ్గిరికెళ్లేసరికి ఆరాలుగాయిశనిగాడు సీలుగుతూ, 'సిత్తం. అది గుండయ్యగారిదేనండి. మరమ్మతుకోసం అంపారు' అన్నాడు!! ...ఇది గుండయ్యపనే అయి ఉంటుంది, వీడికొమ్ములు ఎల్లా కొట్టెయ్యడమా, నేను తనంతవాణ్ణే అని వీడికి పాఠంచెప్పడం ఎల్లానా, నాగౌరవం నిలుపుగోడం ఎల్లానా అని నాకు అనిపిస్తూ ఉండేది.

ఎల్లానో పోనీ అయింది దిగమింగి
పెట్టుగుందాం అని యత్నిస్తూండగానే,
యమ్మ ఓచీర కొంది. అందులో విశే
ఏమీాలేదు. దానికి అంచు మా
పచ్చగా నదరగా ఉంది. ఆ చీ
సింగారించుగుని, మెడ కెక్కించ
తాళప్రకారం నడుస్తూన్నట్టు నడవ
ఒయ్యారం ఒలక పొయ్యడం, ఉమ
హాల్లోకి రావడం, మాఆవిణ్ణి వచ్చి కూ
మనడం, అర్థ లేని కబుర్లెట్టడం! ఎందుక
మహా అక్కడికి చీరకొందికాదూ ఎల్లాగె
వెధవచీరా! — నోరు తిన్నగారాదు
ఏమనుకున్నారోగాని — ఆ సింగారంఅం
ప్రకటించుగోడానికి! ఆమాత్రం మేం కొ
క్కోలేంఅనే దాని ఊహ! మాఆవిడ
యమ్మగర్వం చూసి క్షమించి కిమ్మనకుం
ఊరుకుంది. ఇంకోత్తి అయితే అచ్చ
అల్లాంటిచీర నుంచున్నపాట్న తెస్తావా
దానికి ఉరోసుగోమన్నావా అని ము
అంపాన్ని బట్టి రాసేసేదే. కాని; మావా
అల్లా చెయ్యక, రెండోవాళ్లకి బాధలేకుం
అన్నంమాత్రం మానేసి బొట్టు చెరిపేసు
అతిశ్రావ్యంగా లయయుక్తంగా రాగ
పెట్టారు. ఇలాగంటియిల్లాలి కంటినీరు కా
సముద్రాలు ఏకం అవుతాయని భయం
చటుక్కున నాడుంగరం తాకట్టెట్టి రా
రాత్రి వెళ్లి నేనూ అల్లాంటిచీరి గాలించి
గుని తెచ్చి మా ఆవిడి కిచ్చి, అదిఆవిడ ధ
తూర్పు తెల్లారకుండా ఉమ్మడిహాల్లో
పీట వేసుగుని కూర్చుని, మిరియమ్మని పి
ఆవిడతో సోదివేస్తే, అప్పుడు మిరియ
మాతక్కువ ఏముందో తన ఎక్కువ
వచ్చిందో బోధపడి సిగ్గురావచ్చు గ
అల్లా కానిమ్మని మా ఆవిడతో చెప

, ఉదయాన్నే నన్ను లేవగొట్టి మాఆవిడ
ించడం మొదలెట్టింది. ఏమంటే నే
్చినచీర అంచుకంటె మిరియమ్మ చీర
ను, రంగులో, ఒత్తుగా ఉండట. నిజమే
ఉంటుంది. రాత్రి నాకు ఆనదు. ఇంతే
అనేసి ఆలస్యంకానీకుండా నిలువు
మీద పచ్చసిరా తీసి తెచ్చి మాచీర
మీద ఓ 'కోటింగు' వేశాం. దాంతోటి
యమ్మజలుబు వదిలిపోయిం దను
్నం. కాని, మిరియమ్మ మర్నాడు ఓ
ై వెయ్యిట్టి బనాత్ చీర కొంది. మాఆవిడ
ణం తనకి గౌరవహాని కలగడం కనిపెట్టి,
బాగుల్ది గనక ఎంతోంత చిన్నబుచ్చు
, తన పాతనాగరమూ పట్టెడా కరిగించి
మ్మ తెప్పించి, అదెట్టి శుద్ధబనాత్ కొని,
యమ్మకంటె ముందు కట్టేసుగుని ఉమ్మడి
్లో కూచుంది.

ప్రశ్న— కొంత పోటీభావం మీలో
ంటూ వా ?

రా— ఏడిసినట్టే ఉంది. ఇదా నీతీర్పు!
ువాళ్లు ఎప్పుడు ఏం పనిచేసినా తమరి
త్తం కాదు, పక్కనున్న మాదరిద్రం, మా
త్వం, మా అధమత్వం, మా అజ్ఞానం
డి చెయ్యడానికే అని మాకు తెలుసు.
"నవీజం" మీకేం తెలుసూ! నాకు నీ
్యంగాని, గుండయ్య లక్ష్యంగాని,
మెడమీద తలఉన్న వాడిలక్ష్యంగాని
. నా గౌరవానికి భంగం వస్తూన్నప్పుడు
అన్నం వడ్డించేవాణ్ణయినాసరే పాడి
ను. అవసరాన్ని బట్టి నేను దేవుణ్ణి
లక్ష్యం చెయ్యను. సమయం వచ్చే
అసలు నా అంత తల్లకిందులు
డావాడు ఉండబోడు. ఇంతలో

గుండయ్యగాడు ఓకుక్కపిల్లని కొన్నాడు. 'దొంగభయం దొంగభయం ఉండదు. భైరవం అవతారాల్లో చేరుతుం దన్నారు. ఓకుక్కపిల్ల ఉండడం మనికి మంచిది' అని నా అర్ధాంగి నాకు అప్పటికి పదిరోజుల క్రితం నించీ సకారణంగా నూరిపోస్తూంటే వాడె ప్పుడో వినేసి చేసినపనే అది. మా ఆవిడ మాటల్లో ఉండే యాథార్థ్యం మరి తోసెయ్య లేక, మర్నాడు నేను కుంభయ్యగారి కుక్క పిల్లని ఓ మాటు అరువిమ్మని అడిగి, గొలుసు పళంగా తీసుగొచ్చి, మా స్తంభానికి ఇల్లా కట్టేస్తూంటే, ఆ కుక్కపిల్లకి ఏం అను మానం తగిలిందో, లటక్ మని నాకాలు పట్టుకుంది. 'బాబో, రావే రావే' అని మా యింట్లోవాళ్లని ధైర్యంకోసం కేకేశాను. గుండయ్యకుంక ఇంట్లో లేదు. వాడి కుక్క పిల్ల ఏమనుకుందో దానితాడు తెంపు గుని వచ్చి నే తెచ్చిన కుక్కపిల్ల మీద పడబోయి- అది తప్పించుకోగా- నా రొండో కాలు పడేసి పట్టుగుంది. ఇంట్లో మూల జేరేసి ఉన్న మస్యఫుకర్ర తెచ్చి మా ఆవిడ ఉమ్మ డిగా, దంచి తిరగేసింది. నాకాలికి కొంచెం దెబ్బ తగిలినా నేను లెక్కచెయ్యలేదుగాని, కుంభయ్యకుక్కపిల్ల కుయ్యో మొర్రో మని మొరుగుతూ గిరగిరా తిరిగి పడుకుంది. గుం డయ్యకుక్కపిల్ల దెబ్బ తగిల్నట్టే లేదు. అప్పుడు నేను లోపలి కెళ్లి చేంతాడు తెచ్చి దాన్ని కాళ్లమీద ప్రాణావశిష్టంగా ఉతికి మళ్లీ మా వాటాలో అడుగుపెట్టడానికి వీల్లే కుండా ఏర్పాటు చేసేశాను. మిరియమ్మ ఏడుచుగుంటూ ఇదంతా గుండయ్యతో చెప్పగుంది.

ప్రశ్న — కుంభయ్య తన కుక్కపిల్ల కోసం పేచీ పెట్టలేదూ?

రా— ఎందుకూ! అది చావందే! ఊరికే పడింది. గంజోసి లేవదీశాం. అక్కణ్ణించి గుండయ్య మొహం చూడకూడదు అన్నంత అసహ్యం నాకూ మా ఆవిడికీ కుడా పట్టుకుంది. అదిలగాయతు, నిద్రాహారాలు మానుకుని, ఆ వెధవ ఏ కొత్తవస్తువు ఇంటోకి తెచ్చుగుని బడాయి కొడుతూనో కొట్టకుండానో ప్రకటిస్తూంటే మూడు మూర్తులా అల్లాంటిదే నేనూ తక్షణమే తల తాకట్టెట్టయినా సరే తెచ్చి నాయింట్లో పడేసి, "ఏమిట్రా నీ గొప్ప! ఎవడికి భయంరా ఇక్కడ! నేను తక్కువ తిన్నానుట్రా! చూసోక్కరా!" అని నేననుకుంటున్నానని వాడికి బోధపడేటట్టు చేసేవాణ్ణి. మిరియమ్మ చెవలికి గరిగమ్మల్లాంటి లోలకులు చెయించింది. మేమూ చెయించాం. ఆవిడ కాళ్లకి చక్కీలాలు చెయించింది. మేమూ చెయించాం. ఆవిడ వెండిగ్లాసు కొంది, మేం మా పల్లెటూరిలో స్థలం అమ్మేశాం— లేకపోతే ఏళ్ల పొగరు అణిగి ప్రపంచం బాగుపడేట్టు కనపడలేదు. ఆ డబ్బొచ్చింది. మేమూ వెండిగ్లాసు కొన్నాం— అల్లాంటి పలకల వెండిగ్లాసే. ఆవిడ పోటీ కోసం ఇరవైకాసు లెట్టి ఒడ్డాణం చెయించింది. మేం రహస్యంగా గిలుటుది కొన్నాం. ఆవిడ గంగాళం కొంది. మేమూ కొన్నాం. ఆవిడదాసీదానికి కుడికన్ను గుడ్డి. కుడికన్ను అల్లానే ఉన్నవాళ్లు ఆ ఊళ్లో దొరక్క మేమూ దాన్నే పెట్టుగున్నాం. గుండయ్యగాడు ఫిడేలుకొని మొదలెట్టాడు. నేనూ కొని వాయించడం మొదలెట్టగానే అది విన
డానికి వాడికి చెవుల్లేక తను వాయించడ
మానేశాడు. వాడు లెక్చరు ఇచ్చా
నేనూ లెక్చరు ఇచ్చినట్టు ఒకవిలేఖరికి రె
రూపాయి లిచ్చి పత్రికలో వెయించా
వాడు పుస్తకం చేశాడు. నేను ఓడి
రాయించి వాడికి అయిదు రూపా
లిచ్చి, నాకర్తృత్వం దానికి పెట్టించాను.

కాని, కొనడానికి వీల్లేని వస్తువ
కొన్ని కొన్ని వాడికి సంక్రమిస్తూ ఉంద
నేను ఒకటోరకమైన ప్రజ్ఞగలవాణ్ణే గ
ఒక్కొక్క వసీసుల్లే దాటేవాణ్ణి. వా
ఉద్యోగం ఉంది లెండి. వాడల్లా అనుక
టున్నాడుగాని, వాడి ఉద్యోగమూ
దగ్గిరున్న గుడ్డి· వ్వా సమానం! ఓ నా
వాడి అధికారిగారి రెండుగుర్రాల 'సారట
ముస్పైత్తి దానిమీద తనింటికి వచ్చి వా
దిగడం నాకు తెలిసింది. తనంతటి ఉత్త
రాలికి జీవితేశ్వరుణ్ణే అయిన నేనుకుడా అ
రావడం చూసినప్పుడు గాని తనక
చల్లగా ఉండ వని మా యింట్లోది ప్రతి
పట్టింది. ఊళ్లో అల్లాంటి 'కోచి' మరో
లేదు. పోనీ రెండు విడిగుర్రాల్ని మాట్లా
వాట్లమీద ఓ చెక్క పడేసి, దానిమీద వచ్చి
మా యింటిమెదుట దిగెయ్యచ్చు, ఎవడే
ఇదేమి టని నవ్వితే, ఓరికుంకా, రెం
గుర్రాల బళ్లు అనేకరకాలురా, అని బు
యించచ్చు, అనుకుంటే, అంత సమానపడ
గుర్రాలు దొరకవంకీ, ఏమాత్రం విషమం
నడిచినా చిక్కు, అని గుర్రాలవాళ్లన్నార
అందుకని, ఆ అధికారింటికే దొడ్డిదారి
నేనూ వెళ్లి, ఆబండితోలేవాడి చేతిలో ఓపా
వేడ పెట్టి, ఆబండీ అధికారిగారికోసం వె
టప్పుడు మావీధిలోంచి పోనిమ్మని వాణ్ణి అ

ాను. వాడు అల్లా చేశాడు గాని నన్ను
కాల ఉండే బల్ల చెక్కమీద కూచో
ాడు. అక్కణ్ణుంచే ఉగాను. దొంగతనంగా
దరు పిల్లలు బోలపడుకునే కొందరు
మనీ వెకుతూండే చోటుట అది.
ంగా, మిరియమ్మ, ఒళ్లు తిప్పుగుంటూ
లు గిరవటేస్తూ, కళ్లు మిటకరిస్తూ,
దేమిటీ! మీ వారు అక్కణ్ణించి
కేమిటి?" అంటూ ఈసడించి
ట్లాడిందిట! మా ఆవిడ మళ్లీ రాగా
, తనముచ్చట్లన్నీ అల్లానే ముక్కలైపో
న్నాయని కుములిపోయింది. బండీతో లే
కి సన్నిహితంగా పృష్ఠభాగంలో
చోడంకంటే వెనకాల పోయిమంటూ
లీస్తూండేచోట కూచోడంలో నామర్దా
ం పోదూ అని తెగేసి ఈ మాటు మిరి
మ్మకి సమాధానం చెప్తే సరి అని మా
ణ్ణి సమదాయించాను. ఏదో వోటి
ానే ఉంది. గుండయ్యగాడికి విందు
పు గురించి ఓ కార్డు వచ్చింది. నే యింటో
. అరుంధతిలాంటి రోషవంతురాలు
త శిరచ్ఛేకం అయినట్టు అయి మా
డ నే రాగానే ఆమాట నాతో చెప్పింది.
దినవా రెవరో తెలియదాయిరి. అయినా
న్నాడు కొంచెం కాళ్లు అరిగేటట్టు తిరిగి,
మనం దొరక్క, ఇది పనికాదని చెప్పే
సి, ఆ చీట్లు అచ్చుకొట్టిన ప్రెస్సు పట్టు
, అక్కడ అటువంటి చీటీ ఒకటి ఓ కాఫీ
చ్చి పారేసి సంపాదించి, దానిమీద నా
ు నేనే ఎడంచేత్తో రాసుకుని పట్టిగల్లి
భార్యకి చూపెంచి, ఆవిడయొక్క బాధ
లగించి, ఆవిడకి ఆనందం కలిగించి, అది
లో పెట్టుగుని భోజనానికి వెళ్లి తరద్దీగా
ుందు లోపల ప్రవేశించాను. గుం

డయ్య యత్నాలన్నీ వమ్మల్ని కొంచ
పరుద్దాం అనే. అందుకనే వాడికి తెగనష్ల
యిలు అవుతాయి యింటికి. ఓమాటు ఓపల్లె
టూర్కించి వాడికి గేద్దూడలాంటి పనస
పండూనూ నిలువెత్తు తెల్ల చెక్కరకేళీ
గెలానూ వచ్చాయిట. కాని, వాళ్ల
పుణ్యమా అని, ఆ సమయానికి మిరియమ్మా
వాళ్లూ ఎక్కడికో భోయినాని కెళ్లారట.
చూస్తూ చూస్తూ అంతంత పసందైన ఫలాలు
చెయిదాటపెట్టుగుంటే పంపాసం మెడకి
చుట్టేసుగుంటుందో అని మాఆవిడ భయ
పడుతూ "ఎవరికి" అని పట్టుగొచ్చినవాణ్ణి
అడిగిందిట. వాడు — గుండయ్య అన్లేక
గావును— 'గున్నయ్య'గారికేనండి అని చీటీ
ఇచ్చాడట. మాఆవిడ ఆచీటీ విప్పి చిరునవ్వు
ముఖంతో అది చదవడం అభినయించి,
"మా కే! ఇక్కడికే! లోపల పెట్టు పట్టుగొచ్చి!
ఆ పేరు మాయింటాయన చిన్నప్పటి ముద్దు
పేరు!" అని వాడితో చెప్పి, అవియింట్లో పెట్టించి,
వాడి కింత ఊరగాయి పడేసి ఇంత మజ్జిగ
దాహంయిచ్చి, దెయ్యాల్లాగ మిరియమ్మా
వాళ్లూ వచ్చిపడకుండా వాణ్ణి తరిమి కొట్టేసిం
దిట. నేను వచ్చింతరవాత ఇదంతా మాఆవిడ
నాతో చెప్పగానే, వాళ్లకి తెలిసినాకుడా
తగాదా లేకుండా మాఆవిడ వ్యవహరించి
నందుకు నేను తెగ ఆనందించి, తెగనవ్వుకుని
ఆవిడప్రజ్ఞ తెగపొగిడి, స్వజనవిషయం
అయినా తప్పనిసరివల్ల చాలా మెచ్చుగున్నా
ను. ఒకనాడు ఈమధ్య నేను ఇటూ అటూ
తిరిగి ఇంటి కొచ్చేసరికి మిరియమ్మ డొక్కుం
టోంది. ఏమిటని కనుక్కుంటే వేవిళ్లు అని
తేలింది. సరే. మరిఆఖరు. మనం ఆత్మగౌర
వం నిలబెట్టుగోడానికి ఇంతబాధా పడు
తూంటే వాళ్ల ఆధిక్యత ఖాయపడడానికి

దేవుడుకూడా సంకల్పించాడు కాబోలు అని నాకు దిగులు పట్టుగుంది. పిల్లాణ్ణంటే తెచ్చాం గాని, ఇ వెల్లాక నే నిల్లానే ఒకనాడు ఆలోచిస్తూ కూచునిఉండగా, మాఆవిడ డోక్కోడం మొదలెట్టింది. వెళ్లి చూస్తే రాగిచెంబుని చిలుం అరగతీసి నోట్లో పెట్టుగున్నా నంది. ఆ వేళకి మాఆవిణ్ణి అంతటితో ఆగమని, అది ప్రాణాపాయం అని ఆవిడతో చెప్పి మర్నాడు ఒక కాకి ఈక తెచ్చి అది గొంతికలో తిప్పుగుని డోక్కోడం అభినయించ మని ఆవిణ్ణి ప్రార్థించాను. ఆవిడ అల్లానే చేస్తోంది. వాళ్లిద్దరి రోగాలూ చప్పగా కుదిరాయి. కాని, గుండెలు బద్దలుచేసే పిడుగు పడ్డట్టు, గుండయ్యకి మూడువేలు లాటరీలో కొట్టుకొచ్చింది ఒక్కమాటుగా! మాఆవిడ మంచం పట్టి, "మనకి మాన ప్రాణాలు నిలవాలీ అం... ఈమాటు లాటరీలో మీ పేరు మోగా... అంది. నేను తక్షణం లాటరీ అధికారు... మాట్టాడాను సొమ్ము అడక్కుండా ఉం... ఆదివ్యయం నేను భరించేపరతుకి, లా... నాకే వచ్చేటట్టుగా కార్యక్రమం నడప... అనివాళ్లు అన్నారు. ఆఖర్చు మొత్తం మొద... 'వెయ్యి' అని అన్నా చివరికి అయిదు వంద... అని స్థిరపరిచారు. నాకు రెండెకరాలభూ... ఉంది. అది అమ్మి వాళ్లకి అయిదువంద... ఇచ్చేశాను. లాటరీ ఫలితం రేపో మా... రావాలి. పోటీకుంకలవల్ల ఆత్మగౌరవ... భంగం వచ్చేటప్పుడు అష్టకష్టాలూ పడ... పోస్తే పణ్ణాపడాలి, పడుతూనూ ఉన్నా... అయినా సరే, పై పెచ్చుట, తప్ప మాదిట!

---

# పలవరించెను మనసు భాను! భానూ! యనుచు

శ్రీ కో. వేం. కృష్ణమాచార్యులు

౧

ణయు వారాశిలోపల పొంగు కెరటాల
నసి తుంపెనలాడు మోటు జేడిసమీాల
ంగు చుట్టంబగుచు నాడుచుండెను మనసు,
వరించెను మనసు-భాను భా ా యనుచు;

౨

గమమ్ములలోని యంతరార్థంబగుచు
గమంజుల మగుచు—
రాగరంజిత మగుచు
గకారణమై విరాగకారణ మగుచు
గపూరితమై విరాజిల్లు నీరూపు,
నంద మూర్తి యయి,
నంద హేతు వయి,
నంద మయ మగుచు నలరారు నీరూపు,
ాన సమ్మనకు సంభ్రమము నాపాదించె—

౩

రణీయమై ఉనుఃస్ఫురణీయమై జగత్
స్మరణీయ మయి సదావరణీయ మయిపొలుచు
అరుణ మగునీమూర్తి—
అరుణ మగు నీస్ఫూర్తి—
అరుణారుణాం బగుచు హాటకాత్మక మగుచు,
సరసిజాక్షుంబయి మొసంగు నీ విస్ఫూర్తి
రణీయము నడంచె-
కన్నులను భ్రమియించె—.........

౪

జలములోపల నిల్చి
జలబిందువుల రాల్చి
కులపాలికా వృత్తమున కాలమును వేల్చు
అలపద్మినీ పతి ఆస్యపద్మమ్ములో
వలరాజు ములుకు లయి
చెలువారు కులుకులయి
తళుకులయి బెళుకులయి
ఎలదేటిపలుకులయి
అలరు క్రొందమ్ముల యందాల రేకులై
చలియించె నాకనుల్—.........

౫

చలము నెల్ల యడంచి జలములో నిలముంచి
సలిల పూరమ్ము దోసిళులలోపల నించి
అలుకుచును
పలుకుచును
అంజలుల జిలుకుచును
అలరారె—నామనసు హర్ష గద్గద మగుచు,
అలివేలుకీలి పరాసక్త మయ్యెనో ?
అలివేలువలె చంచలాత్మకం బయ్యెనో ?
పలవరించెను మనసు............
పరితపించెను మనసు............

# రత్నావళి (కథ)—పరీక్ష

౧

శ్రీ నే. రామదాసు

(౧) వసుభూతితో రత్నావళి :—ఎక్కడ కౌశాంబి! సముద్రముచేతను ఎడసినా, ఎక్కడ సింహళము! వత్సకంచుకి, జరాశిథిలసర్వాంగుఁడు తాను మాత్రము వచ్చి, పలుమారు ఇయ్యవలెనన్న వానిచే పిల్లను అడుగుటయు! మంత్రిమాత్రసహాయముగా సింహళుఁడు పిల్లను పెండ్లికి పంపుటయు! ఏమియిది! ఏభవోత్తరముగా ఇకనెవ్వఁడో యథావిధిగా పెండ్లి జరుగునపుడు తల్లిదండ్రులు (తక్కినబంధువులు) వత్తురు, అంతవఱకు అమ్మాయి ఊరక అక్కడ నుండునుగాక యని పంపుటయా? అటు మేనల్లుఁడు, కాదా, ఇటు దగ్ధవాసవదత్తసంబంధముచే తొంటియల్లుఁడు, పలుతెఱంగులం బలిమిగలఁడు ఉదయనుఁడు; అతనికడకు అమ్మాయిని ఇట్లే ఈపాటిగానే పంపవచ్చునందురా? దగ్ధవాసవదత్తస్థానమునకు పంపఁబడు నీపిల్ల, వాసవదత్తకు 'భగినియే' యనుటచే, కథమైనను ఇది దుఃఖమిశ్రితమని, వారు ఇఁదు ఇంతకన్న సరంజామును సన్నాహమును ఓర్వరా? ప్రియదర్శికలోను మాళవికలోను ఆరణ్యకామాళవికలు అట్లు దిక్కుమాలిన వారగుటకు పుట్టింట దేశవిప్లవ యుద్ధపరాజయ బంధునాశాది సంగతి కలదు, ఇందు అట్టిదియేది? (యానభంగము తరువాత, దైవాగతము!) సుదూరమగు కౌశాంబికి ఇట్లే ఇట్టి పరిమిత ప్రధానజనమును పంపఁ దగునుగాని, స్వయముగా రాజు చిరదూర ప్రవాసము సేయుట నీతిగాదనియా? పరాక్రమముచేతను పన్నకముచేతను 'అవిధిగా' కొనివచ్చిన వాసవదత్తకు 'యథావిధి' పెండ్లి నిర్వర్తింప అన్న కుమారగోపాలుఁడు పంపఁబడినట్లు ఇపుడు ఇట మంత్రి వసుభూతి పంపఁబడినాఁడు, చాలును; అట్టిది ఆదేశకాల ల యాచారము అని యరసికొనందగునా?

(౨) వసుభూతి-కోసలము:—సరి, ఇది యుం గాక. వారు ఓడపయనము వచ్చుచున్నారు. హళము నేఁడు 'సిలాన్' అని వ్యవహ్రియమాణ 'రావణలంక'యె యగునేని, అటనుండి కౌశాంబిం టకు ఓడదారి ఏ దగును? రామేశ్వరముకడనే ఇ రేవగునేని, దూరము అలంతియ, ఇంతలో ఓడ పగ టయా? పసులక ఆరేవుం దాకినను తరువాత ఆ నుండి ఉత్తరముగా కౌశాంబికి నేలపై ఎ పయనములు! వసుభూతియు విపత్తిం బొందియు ఇ వెనుకకు సింహళమునకు చేరుపున నున్న దానికిం గ ముందు సుదూరంపుఁ గౌశాంబికిం బోవ నేలసముకట్టు ప్రియదర్శనవిపత్తింగన్న యంగరాజుకంచుకి అప్ప ఆపదం దప్పించుకొన్న అంగరాజుకడకే పోయె కాఁబట్టి అట్లుగాదు. తూర్పుతీరమునసే ఓడదిగి కౌశాంబికి చేరుపగుటకు సముద్రప్రయాణమే య యూహింపఁదగును. కౌశాంబికసిజుఁడు సింహళము రాకపోకలు కావించుటయు దీనినే సూచించును. ద దైవఘట్యముం బట్టి ఓడపగులం గారణము సుసం మగును. సాగరిక సులువుగా కౌశాంబిం జేరుటయు పడును. వసుభూతికిని మరల బాభ్రవ్యుం గలసికొ వానికి, రుమణ్వ దళస్కందిత వింధ్యదేశపరిసరమ అక్కడికి చేరను సులువగునట్లు, గట్టెక్కినవానికి,వా దత్తదాహము ప్రవాదమాత్రమే యని ఇపు డెఱిం వానికి కౌశాంబిప్రయాణము సుసంగతపడును.

(౩) మంత్రిమాత్రులదైవము:—"దైవ ద్వాంసః ప్రమాణయన్తి" అని అన్నాఁడట చా క్యుఁడు, మౌర్యరాజ్య ప్రతిష్ఠాపకుఁడు. మఱి యౌ కుం గుఱిలోనివాఁడు కానోపును. అమాత్యకులకు

ను ఈ యౌగంధరాయణుఁడు; ఈతఁడు దైవమును ప్రమాణీకరించు చున్నాఁడు, ఒండెడ ఏవఁడు

'శ్రీనాశ్రదైశ్చ యుద్ధైశ్చ శాస్త్రదృష్టైశ్చ మన్త్రిభిః
యత్నైః ఖలు వయం మజ్జమానాః సముద్ధృతాః'
(స్వప్న)

ప్రశంసఁబొందినాఁడో! 'కృత్యాది'లో కవి ఘటనకు దైవమును ఇంత ఆశ్రయించినాఁడు! ువను పెద్దలు అనుకూలదైవసహాకృతమైన యూతని త్సాహము, అదే పురుషకారము ఇట పొందుకొని న్న దన్నారు. పరే, మఱివాఁడో, సూత్రధారుఁడు, కు ఒక్కతే కూఁతురు. దాన్ని నీవు ఏలాగో దేశాంంలో ఇచ్చినావు. మఱి దూరదేశంలో వున్నవరు దానికి పెండ్లి ఏలాగవుతుందా అనే చింతచేత ు ఏమీ తోఁచడంలేదు'-అని నటి యనఁగా 'ఆర్య' ఁడు దూరస్థితుఁడని దిగులుపడకు ఇదె చూడు,

కడలినడుమనుండి, కడల కావలినుండి,
యొండుదీవిగడ్డనుండి తెచ్చి
నిమిషమాత్రలోన సమకూర్చుఁ బో విధి,
యభిముఖుండ యేని యభిమతమును.-

విధ్యాభిముఖ్యవిలాసముంగూర్చిన ఘాషుభాము నీ పాడనేల? వధూవరులు కుదురనపుడు ఎవనింర్చునో ఎవతెంగూర్చునో విధి యని విధిచేష్టం దడవుటను; నిశ్చితవరునికి, దూరదేశగతునికే యనుఁగాక, పిల్ల ు పెండ్లి నెఱవేర్చుటలో, ధనజనవస్త్వాదికముంర్పఁ బురుషకారము మిక్కిలి వలసినచోట, భిముఖ్యము అంతపరామృష్టవ్యమా? ఇది మఱియు త్యాద్యవస్థ'! ప్రస్తావనలోనే దీర్ఘోపక్షేపముతో త్రధార వాక్యముం గొని పాత్రము ప్రవేశించుట న్న కథోద్ఘాతమును! చమత్కార సంపాదన ద్విగుణిం! వరుఁడు కుదిరినను పెడిసిపోక, రాకపోకలు ఆదే లములలో అంత సులువుకానివి జరిగి, ధనము అంది, ్యంతరములు విఘ్నములు కలఁతలు లేకుండ, కడవెళ్ల ఖపేఅవలదా? దానికి దైవము అభిముఖము కానేదా? పెండ్లి చేసిమాఁడు- అనుపానైతలో ఇదియు తభూతము కాదా. సూత్రికిని మంత్రికిని అనుసంత పని ఇంకను కావలసియున్నది. అని, యొకతెఱంగు తెలివిడి ఇటం దాత్పర్యమా?

(౮.) పెట్టి, రత్నమాల—రత్నమాల చిహ్నముచే కౌశాంబివణిజుఁడు సాగరికను ఆనవాలుపట్టుట యెట్లు? ఆమాల అమ్మాయిని తరలించునపుడు నాయన ఆమెకు ఒసంగినాఁడట. దీనికి సదుపాయము ఎంత వెదకినను కవి దొరకనీయఁడు. ఒకవేళ ఇట్లు కానోపును. వణిజుఁడనుటచేతను, సింహళమునకుం బోయి వచ్చువాఁ డనుటచేతను ఈమాల అతనికడనే విక్రమబాహువు అమ్మాయికోసము కొన్నదగునా? అనుకేని ఈయభిజ్ఞానాదికము సుగము మనువని యెంచఁదగును. కాకున్న మఱెట్లును ఆయానవాలుపట్టుట పసిపడదు.

(౯.) రత్నావళి వాసవదత్త కడ సాగరిక యగుట :— ఆనవాలుపట్టిన పెట్టి 'అమ్మాయీ, నీవు సింహళరాజు కూఁతురు రత్నావళివి కావా' అని పరామర్శించి యుండును; ఆమాటనే చెప్పి యౌగంధరాయణునికి అప్పగించి యుండును. కాకున్న, సాగరిక రత్నావళి యని యాతఁ డెట్లెఱిఁగి సంతోషించును? ఇఁక యౌగంధరాయణుఁడు వసుభూతి బాభ్రవ్యుల నెదురు చూచుచు దేవికి రహస్యముం జెప్పక ఆ బాలను 'సగౌరవముగా' మాత్రము చేతనుంచు టేల? నిజము చెప్పిన నేమి? అది యెట్లు కథకు భంజకమగును? అంతట నాటకము ఆఁగిపోవును కాఁబోలు లే! వసుభూతిచే ప్రత్యభిజ్ఞాతకాకున్న 'భగినికను' దేవి సవతాలుగా స్వీకరింపదా? ప్రియదర్శిక దేశవిప్లవ యుద్ధసంరంభాదికముచే తలిదండ్రులను గోలుపోయి, వింధ్యకేతుకుమారీభ్రాంతిచే విజయసేనునిచేత ఆనీతయయి దేవికి అప్పగింపఁబడినది; తానై తన యభిజనాదికమును ఆటం జెప్పనొల్లదుగాక. మాళవికయు అట్లే సకల బంధువియుక్తయయి మంత్రిసుమత్యుపనీత యయి, సుమతింజంపిన చెంచుదండుపాలై, ఆ వీరసేననాయనికి పట్టువడి, ఆతని యక్కయగు వన్నిమిత్రురాణికి ఉపాయనీకరింపఁబడినది; తానై తన యభిజనాదికమును ఆటం జెప్పనొల్లదుగాక. ఎఱిఁగిన కౌశికియు (సాంకృత్యాయని ?) తాను, ఒకానొక కాపావసానమును అపేక్షించి ఎఱుకపఱుపనైతి ననునే. ఇట

కట్లుగాక, కౌశాంబిసెట్టియు యౌగంధరాయణుఁడును ఎఱుంగుదురు. వారు తన్నెఱుంగుదు రని రత్నావళి తా నెఱుంగును. ఆరత్నమాలయు విశేషాధాయకము, సందేహజనకము నిర్వహణమునం బ్రయోజకము, మెడలో నుండలేదా? లేక దానిం దాఁచుకొన్నదా? ఎటువలె? మఱి తానై తన్ను రాణికి, తన భగినికి, తెలుపుకొన్న దేమి? తెలుపుకొనమి యేల? మంత్రి ఏమేని వలదనెనా? సాగరిక మంత్రితో మరికా? అట్లు గాదు. ఇన్ని యేల? ఏభగిని దగ్ధయనితాను రాణిగాఁ బ్రేషితరై, సముద్రమగ్నోత్థితయు, పునర్జాతప్రాయయునై ఇట్లు చేరినదో, ఆ మెకడనే ఆత్మ కొలువుచే నొగులవలసెనే, దుఃఖాదృతకాని ఈదైవమాయనుండి ఎట్లు మేల్కొనును, తాను ఏమి చెప్పఁగల్గును? వాసవదత్త అదగ్ధయై ఇట్లు విభవమున నుంసెంజూచి తా నెంతో యబ్బురంపోయి నోట మాటరాక యున్నదా? అట్లుకాక, 'ఇప్పుడు ఈ మాట అమ్మాయికి తెలియనీయ కూడదు' అని బాహ్యప్రవాద సాగరికకుం జెలియకుండ నాయనచే రక్షితమాయెనా? మాలాభిజ్ఞాతరై, వణిగానీతరై మంత్రిసమర్పితరై దేవీన్యస్తరై సాగరిక తాను, మజ్జన మరణములు తప్పి బ్రదుకంగంటినను తప్ప, ఎక్కడికి కొనిరాఁబడినదో, ఎటునుంపఁబడినదో, కౌశాంబి, మంత్రి, రాణి, భగిని, ఈవివరము ఏదియు ఎఱుంగక యుండునా, ఒకవేళ? కోసలుని వింధ్యనుగణము కౌశాంబికి 'కొలఁది దినముల' (రత్న-iv) పయనములోనిదే. అందు యుద్ధము ఒక్కదినమే, కాదా ఒకపూఁటయే. అప్పటికే రుమణ్వదాదులను కలసికొన్నారఁట బాభ్రవ్యవసుభూతులు. ఇఁక ఎంత'మెల్లనిపయనముల' (రత్న iv) వచ్చినను వారముదినముల కెక్కువపట్టదు. ప్రియదర్శికలో వింధ్యకేతుని ఇల్లే వింధ్యప్రాంతమునమన్న దొరను సమయింపం బోవను మూఁడుదినాలు పట్టును. మరలుటకును అంతే. మఱి అన్నాళ్లకా ఈదాఁపఱికము? సాగరిక యౌగంధరునిచేతికి వచ్చుటయు వసుభూతిబాభ్రవ్యులు రుమణ్వంతుం గలసికొనుటయు ఇంచుమించుగా సమకాలమువనే యగును; రెంటికి ఒక్కటనే మంత్రి సమాశ్వాసము పొందుమన్నాఁడు. మఱి దేవిచేతం బెట్టిన ప్రయోజనమును (వసంతకవాక్యముగా - పు. ౬౦)

యౌగంధరాయణుఁడు ఇట్లు అంగీకరించును—'అం
పురంలో ఉండేది అంతఃపురంలో ఉండేవాడికి సు
వుగా కంటబడుతుంది' అని. సాగరికరూపముచూ
మాత్రం గలిగిన యీవార్యకే దేవి సాగరికను రాజు
టంబడనీకుండ మెలఁకువ వహించునుగదా? అట్లు
'రూపేర్ష్య' వహించునని మంత్రి శంకింపఁడా? మ
యీయలంతికాలములో వారికి దర్శనావకాశము
అభిలాషాంకురోద్భేదమువఱకుం జాలినని, దేవిని ఏమ
చునని, ఎట్టిని ఏపాటిని కలుగునని తలంచెనో! మ
వికప్రియదర్శికలలో ఇంచుమించుగా సంవత్సరకా
మున్నది, దాఁపఱికమునకు, చాలినకారణ మున్న
కనిపన్నాగము పనిపడును. ఇటనో? ఇట్లు సమాధ
మనుచా? 'ఏల, అంతఃపుర ప్రవిష్ట—అనాలసుగో
వడిమిడి— ఎన్ని యడ్డంకులున్నను ఎంతలోనైనను రా
కంటంబడవచ్చును' అని. కాదా, ఇట్లుసుం గావచ్చు
రాజునకు దేవికి తెలియనీకుండ బాహ్యప్రవ
పఱపి, బాభ్రవ్యసందేశ మంపి 'స్వచ్ఛందచారి
తాను ఈపని చేసినాఁడు. అప్పుడే తటాలున దేవి
నైనను చెప్పను జంకెను. అలంతికాలమైనను వ
భూతాన్యదులు వచ్చునప్పటికి ఎట్లు ఏయంకురము పొ
మరించునో; సాగరిక తానై తన్ను ప్రకటించుకొను
దేవికి; శాలీనత మనస్విత కులజత దుర్దైవపరిభవాక్రాం
ఇట్టిది యడ్డంకి యగునా; రాజు తనులునా
లఁడా; తగిలి తానై కన్నెపై మనసుపడునేని తరా
తనకుఅంతయు నిర్ణయము సులువు.— అన్నింటిని క
పెట్టెదనని తలంచెంగావలయు.

(౬) ప్రవాసము, దేవి,'నావచనంబునకు':—యౌ
గంధరాయణుఁడు పఱపిన బాహ్యప్రవాదము రాజు ఎఱు
గఁడు; దేవియు ఎఱుఁగదు. మఱి యెందు ఎట్లు పఱ
వాఁడో! ప్రవాద తనంతట సింహళమున విక్రమబా
చెవిం బడవలదా? అక్కైనంగదా లెస్సగా విశ్వసనీ
మగును? బాభ్రవ్యునిచే తోలిరెుచ్చరికయగునేని,
దేవింగూర్చి తననోటనే అమంగళము పలుకుటయగు
యటుండె, దేవిసొంతకంచుకిమాటయే యగును, దా
ప్రవాద యనఁజనదు. రాజకును దేవికిని తెలియ
సరే; కౌశాంబిలో వ్యాపించినదా, వత్సదేశమున

దినదా? ఉజ్జయినిలోనో, అది దేవిపుట్టినిల్లే? లావా
గత దేవీదాహమున కథాసరిత్సాగరమునను, దానిం
న్న స్వప్నవాసవదత్త తాపసవత్సరాజములయందును
ప్రాయ మేమనఁగా లావాణకము వత్సమగధ
ల యెల్లలోని దేశము, వత్సాంతర్భూతము. అక్కడి
డి దాహప్రవాదమును ఇష్టముచొప్పున పద్మావతీ-
ధమునకై ఎందు పర్వింపవలయునో ఆమగధమున
పాయములచేఁ బర్వింపను, ఎందు పర్వింపరాదో
త్సదేశమున ఉపాయములచే మాన్పను శక్యమగుచు-
దా, వానియందు మంత్రిపన్నాగమున దేవి 'మరీకు'
ము నిజముగానే మాఱువేసమున అపనీతయగును గావు
, రాజును వియోగదుఃఖమున అల్లాడుమగావునను
నిని వత్సదేశమున వారింప నక్కఱలేదు. ఇందు
హాశమునకుం బర్వవలయు దేవీమరణప్రవాదమును
వాణకదాహజనితముంగా నిబంధింప నేల? దానికి
న సింహళవ్యాప్తియా నేష్టసిద్ధి యెట్లు? ఇందలిపన్నా
ముబడి ఉదయనవాసవదత్తలకు లావాణకదాహవ్యాజ
న అన్యోన్యవియోగము ఆవశ్యకమని తోఁపదు. వియో
ముకలిగియేయున్న, అది యెట్లు తీఱె ఇందు ఈ
లుగంకములందును సంయోగకథ సాగినది? స్వప్న
పసములందు ఆవియోగమే ప్రధానకథావస్తువు.
ందు అట్లు గాదు. మఱి.

'వాకచనంబునన్ హృదయ
నాయకుఁ బాసెను దేవి యత్తఱిన్'

నికి మూలపాఠము.

' దేవ్యా మద్వచనా త్తదా(థా)భ్యుపగతః
త్యు ర్వియోగో మహాన్'.

నావచనంబునన్' - అనఁగా దేవికి యౌగంధరుఁడు
మి చెప్పినాఁడు? ఎంత చెప్పినాఁడు? ఇందును పన్నక
మున దేవి 'మరికే' యను నేని ఎంతవట్టు? ఆపక్షమున
గరికంగూర్చి దేవికడ మంత్రికి దాఁపఱిక మేల?

రాజు:—(అపవారించి) దేవి, ఏమి యిది, నీ
హామంత్రి యిప్పుడు అనృతము పలుకు
చున్నాఁడు!

వాస:—(విమర్శించి) ఆర్యపుత్రా, ఇందు ఎవరు అనృతము పలుకుచున్నారో నే నెఱుఁగను. (రత్నా. iv)

ఈ యపవారితకమున మిశ్రపరామర్శలో దాహప్రవాదాజ్ఞానమే, 'మరీకు'మంగామిరే ఆ పతివ్రతయైన, ఆ 'మహానుభావురాలి'యైన తోఁచును. సర్వమును యౌగంధరుని స్వచ్ఛందచారితయే. కాఁగా మూలపాఠాంతరము,

'దేవ్యా మద్వచనాత్ ప్రథా మభ్యుపగతః
పత్యుర్వియోగ స్తదా(థా)'

అనునది శ్రేయస్తరమగును. ఆప్రథ ఇప్పుడు వసుభూతిభాషితములవలననే; కాదా, తన గారడి వానిమాటలవలననే; కాదా, అవిలంబితముగా ఇఁక తాన చెప్పవలయుమాటవలననే; దేవిచిత్తమునం గ్రుచ్చుకొనఁ బోలును. కావున అది యిప్పుడే సపత్నీసంఘటనతోబాటు తనకు ప్రపఱుపులం గొలుపును. ఎన్నడో పుట్టించి యుణంచినదియు నసుకేని ఆప్రవాదప్రేరణకు ఇప్పుడేల ప్రసాది? ఇపుడు సపత్నీసంఘటనకు మాత్రమే ప్రసాదితగును. అట్లుగాక ఉక్తవసుభూతివచనముచేతను నిజప్రేరితైంద్రజాలికవాక్కుచేతను వక్ష్యమాణనిజవచనము చేతను ఇపుడే దాహప్రవాద దేవి తెలింబడుటయు, సపత్నీఘటనతో ప్రపకును వెఱపునకును కారణపౌష్కల్యముం గూర్చుటయు. (రత్నా. iv. 86) ఇట్టువలెనా, లావాణకదాహాపవాదమును సిద్ధాదిష్ట సార్వభౌమ తాపాదక నాయికాసంయోజనము ఉపజీవించుట! ఎక్కడ 'స్వప్న' కవి యల్లిక! అదెక్కడ 'తాపస'కవి యల్లిక! ఇదెక్కడ ఈరత్న కవియల్లిక?

(౩.) కౌశాంబి సింహళములు:—ప్రసంగవశమున ఇది యొకటి. మగధమన్నను మాళవమన్ననుఁ అంగమన్నను కళింగమన్నను, ఉత్తరకోసలమన్నను, దక్షిణకోసలమన్నను, విదేహమన్నను విదర్భమన్నను, కాంభోజమన్నను గాంధారమన్నను, ఉత్తరాపథమున మఱి యేమన్ననుంగూడ రత్నావళీకథకు ఇంతకన్నను తగి యుండఁబోలును. అట్లుగాక, ఉదయనచరితమున నంతగాచొరని దక్షిణాపథమేనియుం గాక (దిగ్విజయ

మున తరువాత వరుసలో గోదావరి దాఁటి చోళముం బాఁకి మరలినాఁడులే. క. స. సా. 3-౨౫) సుదూరముగా గాలమును విసరి ఈ సింహళమును, సముద్రయానక్లేశాదిక మపేక్షించుదానిని కథలోనికి ఆకర్షింప నేల? అలీకతామతి పొడముసట్లు అందు అవంతిసుతా బంధువులను, మామనో పిన్నినో భగినినో ఇట్టివారిం బుట్టింప నేల? కాళిదాసుమాళవికనుండి నిపుణమతులు చరిత్రం ద్రవ్వుచున్నారు. మఱి ఇందు ఇట్లున్నది; కౌశాంబి లోకాంతరమునఁ జెల్లు సింహళముతో వియ్యమందుచున్నది! సప్రయోజనముగా ఔచిత్యకముగా నూపపన్నముగా చరిత్రలో కల్పన చమత్కారకారి యగును; అన్యము అన్యమే యగును ఇట్టిదే ఉత్ప్రేక్షిత (Original) కథాశరీరమునకు విధి యని ధ్వనికారుఁడు. (iii-౧౦)'సాతవాహనాదిషుతు రాజసు యావదపదానం శ్రూయతే, తేషు తవన్మాత్రమనుగమ్యమాన మనుగుణత్వేన ప్రతిభాసతే; వ్యతిరిక్తంతు తేషామేవ ఉపనిబధ్యమాన మనుచితమ్..............వృత్తాదపిచ కథాశరీరాత్ ఉత్ప్రేక్షితే విశేషతః ప్రయత్నవతా భవితవ్యమ్. తత్రహి అనవధానాత్ స్ఖలతః కవే రవ్యుత్పత్తి సంభావనా మహతీ భవతి..............కథా మార్గే న చాతిక్రమః......' 'సాతవాహనాదులవిషయమున ఎంతచరిత్రాద్భుతము వినంబడుచున్నదో అంతమాత్రమే అనుసరించిన అనుగుణముగా తోఁచును; అంతకు వ్యతిరిక్తమైన అనుచిత మగును....... జరిగినకథకంటె కల్పితకథయందు కవి మఱియు మెలఁకువ కలిగియుండఁదగును ఏలన, అక్కడి పొరపాటు కవి తెలివితక్కువను మఱింత బయటవేయును..........ప్రసిద్ధకథామార్గమందు అతిక్రమము కూడదు..............' లోచనాచార్యుఁడును కథాశరీరమున 'అలీకతాబుద్ధిని' సప్రయత్నముగా వారింపు మన్నాఁడు. అసంభావనాస్పద మేదో అది మానవలసినది అని యన్నాఁడు హైమాచార్యుఁడు. వత్సనాథుఁడైన యుదయనునికి ఉజ్జయినీనాథుఁడు ఇంత ప్రబలుఁడు ఇటు పార్ష్ణిగ్రాహకుఁడు, వియ్యమై అనుకూలుఁ డాయెను; అట్లే మగధనాథుఁడు అంత ప్రబలుఁడు అటు పార్ష్ణిగ్రాహకుఁడు; అతఁడును వియ్యమునవో మఱియొట్లో అనుకూలుఁడాయెనా, అంతట నిరాఘాటముగా దిగ్విజయసిద్ధి

యగును; సార్వభౌమత్వము కలుగును. మగధక
గూర్చిన సిద్ధాదేశాదృష్టమున ఈ పురుషకార
రము మగధపరిసర లావాణక దాహముం దొడంగి,
తా మతికారి దాఁగుడుమూఁత లాడుచున్నది. సిం
కన్యం గూర్చిన ప్రకృతమునందు అట్టిది అపాతవ
తోఁపదు.

అయినను ఇట్లు సమాధానము కాఁబోలును.–
దేశము కేవలదైవయోగమున అమానుష ఘటనచే
రిక్తముగానే ఎక్కెట్లు కేనిం గూర్పరాదు - అని.
ల్లికి ముంగు పేదయు, పెండ్లికిఁబిదప, ఆయోగమ
యన, శ్రీరుఁడును (అట్లే విలద్విపరీతమును) అతి
సంగతిగా నగునద్భుతము లోకచరితమునం గలి
కావున సిద్ధాదిష్టసార్వభౌమతకు దారులు ఎ
కలుగరాదు! 'అథవా భవితవ్యానాం ద్వా
భవన్తి సర్వత్ర.' మఱియు ప్రవహణభంగముం కె
చేతను కట్టిప్రస్తావముచేతను, వాఁడు కౌశాంబి సిం
ములకు సముద్రమార్గమున-నేలమీఁదం గాదు - ధ
ముగా రాకపోకలు, వ్యాపారమును జరుగుచుండెనని
ప్రవాద నోటినుండి నోటికిని ఊరినుండి యూరికిని
పై అల్లుకొనక తగినజనుని (జనుల) నుండ సము
మీఁదుగా సింహళమునకు అంది విశ్వసింపఁబడెన
సముద్రమార్గము క్షేమమైనందునసే దూరము నె
సాహస మనక, రత్నావళి ప్రవహణమునం దర
బడినదనియు ఇట్లు సర్వమును ఉపపన్నమే, అ
తమే. కౌశాంబిసింహళములు ఒకడ నొకడ నుం
ములు, నానాధనసులభాంతఃపాతిసముద్రములు,
వియ్యముచే సంబద్ధములు కాఁగా తన్నిస్సగతి సర
మ్యాక్రమణము సార్వభౌమతయు సంభావనాస
యగును.

(౮) కోసలయుద్ధము:—యౌగంధరాయ
రాజుంగూర్చి 'విక్రాంతవిగ్రహుండు' అనును. రా
తానై అనును - 'సమయం జేసితి వైరులకా' అని.
శము (=పట్టుకాలు)ంబో లె నమరు నీరెండు మా
నడుమ అసదృశమును విపరీతమును ఈకోసలయుద్ధ
మేమి? ఇంచుకయు పొసఁగకున్నది. ఇపుడు వ
త్సవము ప్రక్రాంతమగుచున్నది. ఇంతలో

విర్భావము గాఁబోవుచున్నది, అయోగాభిలాషం
ంగి నాయకమారార్చ నాయికామణుమార్గల పర్యం
, అనవరతము వలఁపకుండ సుకుమారముగా అలం
దములు కలుగునట్లుగా ఆఘ్రాతాస్వాదితమగు
పుష్పచందమున, యథాసందర్భముగా పెంపొంది
గ్రహాసంభోగమునం బర్యవసించుచు శృంగారము
ంగంకముల నాస్వాదింపఁ బడఁగలదు. ఆప్రపానక
ఈ 'పుడుక' రేల? విజయవర్మ వృత్తాంతము
యుద్ధమువర్ణనమే అట్లు 'పుడుక' యయ్యె గొంతు
గాని రసమున 'అకాండచ్ఛేద' దోషమును
ుంగదా? మఱి కోసలుని ఈ విక్రాంత
కాలఁడు ఏల సమయింపవలయునో, ఇపుడు
ణము చెప్పఁడు. అతఁడు అసదృశం గాఁడు.
ుని మహాపరాక్రమమును, అతఁడు వత్సేశుని
బలములను సయితము చదుపుటయు వర్ణింపఁ
ు. కోసలుని పురుషకారము ప్రశంసింపఁబడును.
అచ్చటను ఏలాకో యుద్ధము, అట్టివానిఁ జంపు
ాకో, కారణము సూచితముగాదు. కట్టకడపటను
' కోసలః' అనుమాట కలదు. అది యూరక
ంగినదానిని యథాచారముగా ముగించుటే కాని
ము కాదు. తెనుఁగున శాస్త్రిలవారు కోసలులను
లని' విశేషించినారు. అదెంత సమాధాయకము?
సట్లు ఏమనఁగా— నిర్వహణమునకు వసుభూతి
లెను. అప్పటికి ఒదవునట్లుగా ఇప్పటికి ఆతని
గంకాలయొడమున నుంపవలయును. అందులకు
ు విలంబమును సాధించుటకు కోసలవిప్రకర్ష మున
నూతిరుమణ్వదాది మేళనము ఇట్లు యద్భవిష్య
• కవిచే సమకూర్పఁబడినది. మాళవికలో నైదర్భ
క్షము, కంటకోత్పాటనమాత్ర మనఁబడుటయు కాక
లి యుపపన్నముగా నిబంధింపఁబడినది.

(౯) 'సగౌరవముగా'—యౌగంధరాయణుఁడు
రికను తనచేత 'సగౌరవముగా' పెట్టెనే; ప్రియద
ం గూర్చిన 'భగినీబుద్ధ్యా' అనునది ఇందులకు టీక
కోలు నే; కాఁబట్టియే ఆనవాలు - రత్నమాలయు
ష్యమాణమయి గౌరవముసే తోఁచించుచుండెనే(?);
జేవిచే అగౌరవము ప్రదర్శిత మగుచున్నదా?
రూపేషర్య మాత్రము ప్రకటితమగుచున్నది గాని.
సాగరిక తన యాత్మ పరప్రేషణకళితము అనును.
ఆశ్లేగదా, పూజాద్రవ్యములు కొనివచ్చుట యుండినీ
అది దేవతాకార్యమునకు—గోరవంకం జూచుకొనుట
తప్పక యాడిగమే యగును. అట్లుగాక ఈ గోరవము
దేవియందలిది అందుకేని ఇట నిప్పుడు దానిం దడవ
నేల? అది యుండుఁగాక.

(౧౦) శారిక, పంజరము, సాగరిక—ఏటికి
ఈ గోరవంకం జూచుకొనుట? సకలపరిజనులు సయి
తము మైమఱచు వత్సవమునను సాగరికయో, సుసంగ
తయో ఈ గోరవంకను కాచుకొని యుండుటేమి?
రాజమందిరమున మఱి గోరవంకలు లేవా? చిలుకలు
లేవా? ఒక్కొక్కదానిని ఒక్కొక్కరి వసమందు
ఉంచియున్నదా? కాక, ఇది 'మేధావిని' అని దీని
యందు ఎక్కువ పక్షపాతమా? వానివానిచోట పం
జరాలలో గోరవంకలు క్షేమముగా నుండవా? సమ
యాన పరిజనము చూచుకొనదా? వానిం గాచుకొనుచు
ఎవరైనను ఉత్సవసమ్మర్దమును కొఱఁతపఱచుకొననేల?

'యత్ర పుష్పశర శాస్త్రకారికా సారి కాధ్యుషిత
నాగదన్తికా
భీమజా నిషధసార్వభౌమయోః ప్రత్యపైక్షత రతే
కృతే కృతే.'

అన్నట్లు (నైషధ-౧౮-౧౫) పడుకటింటి నాగ
దంతాన పదిలముగా తగిలింపరాదా? సాగరిక గ్రహ
చారముచే సారికను మోయుచుగాక, సారిక కేమి,
క్రొత్తగా క్రీతమా, ఎందుండియైనం బ్రేషితమా? శాఁబుని
మాదిగపిల్ల అప్పైశంపాయనపంజరమును శూద్రకునికిం
గొంపోవుటకై మోయును. సాగరికను రాజుకంటం బడనీ
కుండుటకు ఇదియా యుపాయము? దానిని సుసంగత
చేతి కిచ్చి తాను ఎందెందేని పోవుచుసేయున్నదిగదా.
కవికి తోఁపకున్నను ఇంతకన్న నుపాయము వాసవదత్త
కు దోఁపలేదా? ఇట్లు ప్రతిక్షణ పరిరక్ష్యమాణమే అది
తరువాత అతనికి కావలసినపుడు సాగరిక విస్రంభాలాప
ములను గ్రమ్మింగి అతనికి కావలసినచోట రాజు చెవిలో
గ్రక్కి మఱి సాగరికకుగాని సుసంగతకుగాని రాజుకే
గాని వాసవదత్తకుగాని దొరకకుండ మాయమగును. అం

తట సాగరికకు గౌరవంకం జూచుకొనుపీడ యూడును. మాళవికలో పాముముద్రయుంగరము శాకుంతలములో అముద్రటుంగరము ఆ వనజ్యోత్స్న అహరిణము అదుకు గాక హస్తన్యస్తము గాక అకాండతిరస్కారము పొందక తీఁగలో చిగురుగా మొగ్గగా పొడమును మదురును వికసింపను రాలియుంబోవును, సర్వము చిత్తహరమే యగును.

(౧౧) వైతాళికగీతము–'ఉదయన' సాగరిక:— ఈవైతాళికగీతమును విక్కలి ప్రాధాన్యగర్భముగా ఆచార్యులు ధనిక విశ్వనాథాదులు గ్రహించినారు; ఇందు అక్కడికి తెగి అంతమొందుచున్న కథకు ఉదయననామగ్రహణముచే మైలంకె, అదే 'బిందువు' కుదిరినది, అని. అది యట్లే. దానికే కదా కవి లంకె చేసికొన్నాఁడు. అది యుండనీ. మఱి యాదఁగురుము (i) వైతాళికుఁడు భృత్యవిశేషము ప్రభువునామగ్రహణము 'ఉదయనస్య' 'ఉదయనా' అని చేయుట మందము. దొర భృత్యునికి సాక్షాన్నామగ్రాహ్యుఁడు– 'దేవేతి నృపతి ర్వాచ్యో భృత్యైః ప్రకృతిభి స్తథా' అని సింగమన్న నిజ్ఞాపిక. మఱి యిట నది లేకున్న వైకథ్య సాఁగదు కదా! (ii)సాగరిక కౌశాంబిని దేవియాశ్రయమును చేరి కొలఁదిదినములు(౪,౫) అయి యుండఁబోలును. తాను ఉదయనుని యంతఃపురమునను తన యత్తమఁడుకడను ఉండుట యెఱుఁగదా? అట్లు ఇయ్యఁబడినదానికి అట్లు పంపఁబడినదానికి ఇట్లు చేరినదానికి ఇట నిట్లున్నదానికి, ఇన్నాళ్లు ఆయనంగూర్చి చిత్త మెట్లుండెనో. ఇది నాటుకొన్న వలపు మొలమొలలాడుటయా, ఇది నాటుకొనుటయా? శ్రవణముచే పొడమి యూనథంగాది దుర్దైవహతిచే అడఁగిన యభిలాష ఇపుడిట్లు దర్శనమున చిగిరించుచున్నది కావలయు. (iii)మఱియొకటి. వైతాళికగీతికి అవ్యవహితముగా ఈసాగరిక భాషితము 'ఉదయనుఁడా ఈయన!' అని యుండరాదెమో. అందలి 'యుదయనా' నిర్దేశము ఈపూజ్యమానునికిం జెందునదియు, అతఁడు మూర్తిగొన్న కాముఁడు గాఁడు; అతనిం డిందుపఱుచు నాయుదయనుఁడు అని సాగరిక యెట్లెఱుంగును? ఆగీతికను రాజు అందుకొన్న సవ్వడి, మాటయో చేష్టయో, స్పష్టముగా నుండవలదా? ఇదెల్ల రాజు చంద్రోదయపద్యమునకుం దరువాత నుండుట

సాధీయముగు నేమో! మఱి యాచార్యులెల్లరు ఈయు
హితపాఠమునే గ్రహించినట్లున్నది. ఎటువలె
ధానము? సాగరిక సింహళరాజుకూఁతురు వైతా
గీతులను ఎఱుంగును. ఇందును కొన్నాళ్లుగా వినుచు
బోలును. అది రాజుకు కాలసూచకాచారమని ఎ
గును. రాజునకు దేవీపూజకై పిలుపు కలదని వినియు
దేమో. 'ఏమీ ఎంత ప్రమాదము పరిజనులకు' అను
మాటలో ఇది యిమిడియున్నదేమో. గీతి వినఁ
ఇక్కడనున్న రాజు స్మరితుఁడారయం గావలయు.
అపత్తమున 'ఉదయనా' అని పేరు చెప్పుచున్నను
ఇంతే కాదా? చెప్పిన విశేష మేమి? అట్లు కా
తొలినుండి మదనపూజ చిత్రమును ఆక్రమించియు
దున తొలుత కాముఁడని భ్రమగొనెను. వైతాళి
వినఁగానే భ్రాంతి తొలఁగి రాజు, ఉదయనుఁడని జ్ఞ
మైనది. అంతట అట్లు తానై నిశ్చయించుకొన్న
'ఈయన ఉదయనుఁ'డని; అభిలాషం జెందినది.
ఈసంజప్రొద్దున చంద్రోదయ సమయమున సర
లపు రాజు కొలువీయవలయుట, ఇదేమి? ప్రతిది
ఈవేళకు అట్టికొలువు గలదా? పున్నమనాఁడు కలుగు
నాఁడు చిత్రాపూర్ణిమ మదనోత్సవమని ఆవేళయ
దర్శనము కోరుటయా? ఉత్సవవేషుని రాజును ఉ
ప్రత్యగతుని అభినందింప వచ్చుటయా? ఇదేది
గాక, సంధ్యాకాల నివేదనమాత్ర ప్రయోజన పరము,
'వట్టి' యుపచారమా? కవి ఏమియు సూచనచేయ

(౧౨) 'క్షణాత్' 'సముదవాం' 'కంతు
తోలు:— ఇది యేదినము? ఇపుడు ఏవేళ? అపు
నాఁటి సాయంకాలము చంద్రుఁడు దయి
వేళలో సాగరిక ఉదయనుం జూచినది. చిత్త
చిత్తజవికారము పుట్టినది. ఆరాత్రి యెట్లు
నదో. మఱుసటిదినము పూర్వాహ్ణమున ఇట్లు ఒంట
అరఁటియింటం జొచ్చి చిత్రలేఖనవినోదముం బొ
జూచినది. తొలిసాయంకాలము మదనపూజకు
దారిలో కూడ నవమాలికను చూచినారు, దేవీకా
మాలలు. అప్పటికింకను దానికి పూఁతపట్టింప దొర
ప్రతిదినశ్రమపడుచున్నారనుకొన్నారు. సాగరిక
సటి పూర్వాహ్ణమునకంటె ఎక్కువకాలము, క
దినాలపాటిగా, చిత్రలేఖన వినోదమేని పొందక గ

లేదు. ఉచితముం గాదు. గ్రామాంతరదూరమునం
ఆబంగళాలోనే రైవండున, తిహతిసా. ఆదినమే
గా ఆకృష్ణ ప్రథమనాఁడే శ్రీపర్వత శ్రీఖండ
డుఁడు వచ్చినాఁడు. అతనియొద్ద జేరుఁగొన్న
హదము ప్రయుక్తమైనది నవమాలికకు. మాళవిక
తాఁపుదోహదము తపనీయాశోకమును కుసుమిత
చేయుటకు పంచరాత్రావధి కలదు. శ్రీఖండుని
హదమా, ప్రయోగించినమాత్రాన నవమాలికను మొగ్గ
జేగించును. అట్టి వసంతకుఁడు. 'బళిరా! శ్రీఖండ
సుఁడా బళీ! నీదోహదాన్ని ఉపయోగించినమాత్రాన
మాలిక తులాటిదైనది....' అని సాధువాదము పలు
. రాజును లత 'క్షణాత్' ఉద్గామోత్కలికయు
రబ్ధజృంభయు అయినదని సంతోషించును.

[ఇటం బ్రసంగవశమున నొక విచారము:—
ణాత్' శ్లోకమున ఉన్నది. 'పాండువును సోత్క
అను మొదలను ననువాదమున లేదు. కనుఁడు.

'పాండువును సోత్కలిక దీనిఁ బ్రాప్తజృంభ
నవిరళ శ్వసనోద్గ మాయాసితాత్మఁ
గంటుయూత లాఁతిసకిఁ బోలెఁ గనుచు లతను
బోనరి జెద దేవిముఖమునఁ గినుక కెంపు.'

మాలము:

"ఉద్గామోత్కలికాం విపాండురరుచిం
ప్రారబ్ధజృమ్భాం క్షణాత్
ఆయాసం శ్వసనోద్గమై రవిరలై
రాతన్వతీ మాత్మనః,
అద్యోద్యానలతా మిమాం సమదనాం
నారీ మివాన్యాం ధ్రువం
పశ్యన్ కోపవిపాటలద్యుతి ముఖం
దేవ్యాః కరిష్య మ్యహమ్."

నది సాహిత్యప్రపంచమున నతిప్రసిద్ధశ్లోకము.
నినిఖిలరు లెల్లరు ఉదాహరించట ఒకయెత్తు. ధ్వని
రుఁడు ఉదాహరించుట, అది యొకయెత్తు. 'రస
నకు అంగికి అలంకారము అంగముగానే ఉండుట
స్తము; అదియు సమీక్షచే అవసరముననే గ్రహింపఁ
వలయును, అని యుపదేశించునెడ ఇది యుదాహ్రు

తము. దానికి 'లోచనమున' 'సమదనాం' అనుదానికి
సయితము 'మదన మనువృక్షవిశేషమున అల్లుకొన్నది'
అని నిరుపఘ్నముగా చెప్పిన యావిరజాజికి 'మధుసంబు
వోవని యీమదనమును బ్రాఁకు నాటి శ్లేషను నిర్వ
హించినవారే ఆచార్యాభినవగుప్తులవారు 'క్షణాత్'ను
అంతగా వలఁపలేదు. 'క్షణాత్ తస్మిన్నే వావసరే
ప్రారబ్ధా జృంభా వికాసో యయా; జృంభా చ మన్మ
థకృతో ఒఙ్గమర్దః' అని లోచనము. హేమాచార్యు
లును తన యలంకార వివేకమందు లోచనపంక్తినే
తనదిగా ఉదాహరించుకొన్నాఁడు. మఱి లతాపక్ష
మున 'క్షణాత్తు'కు జృంభతో మాత్రము గాక 'ఉద్గా
మోత్కలికాద' యన్నింటితో నన్వయము సరియగు
టయు, పెఱనాయికపక్షమున అట్టిది అంతసమంజసము
కాకపోవుటయు, అట్లు సర్వసామాన్యముగాను నేకవిశే
షముగాను ఉభయప్రయోజకముగా కూర్పు అలరిగా
మియు, 'క్షణాత్'ను శ్లోకమునం జేసుపుట కవియ
సమీక్ష్యకారిత యని తలంచుటయు, కథాకాలగతిసూచ
నమో యనిన అందులకు 'బళిరా! శ్రీఖండదాసుడా
నీదోహదాన్ని ప్రయోగించినమాత్రాన' అనిన 'మా
త్రాన' యోగముతోడి సాధువాదము చాలు ననియెం
చుటయు, ఆకవిపండిత సమ్రాడయ చక్రవర్తి శాస్త్రి
మహాత్తరుల యాశయము కానోపును. 'చూతం చ
నవమల్లికా' అన్నట్లు చూతాదుల వసంతపుఁ బూఁత
తీఁజే యాములుకులు మొక్కవోవుచున్న యీసమయ
మున 'తాగ్రైవిమ్మ మయ్యెను' చైత్రుని సరకుగొనకయు,
మంత్రౌషధుల మహిమచేఁ గావలయు, తనకు పంచా
ధ్యధికములను నా మొగ్గములుకులు ఒక్కపొదిలోనం
బోలె ఆ నవమాలికయందు మొల్లముకొఁగా దానిసజ్జన
ఉన్నాఁడు మదనుఁడు అని లతపక్షమున 'సమదనకు
వారి శ్లేషనిర్వాహము. కావుననే 'లతయు కంటుయూత.'

ఒక చిగురాకుఁగొమ్మఁ దిక,
మొక్క ప్రసూనలతాగ్రకీమఁ దేం
ట్లాకఫలశాఖ రాచిలుక
యుక్, రొదసేయఁగ గాఢ్పుపొందు నా
యక, పయిదెన్నెలల్ వోలయ నా
మని పొంపులనింపు జొంపమా

నొక రేలుమావి క్రింద మఱి
నోయనఁగా వరుఁ డుండె నయ్యెడన్;
(విజయవిలాస ౧-౨౧౨).

ఇట్లు సెలమావి క్రింద నుత్ప్రేక్షితుఁడైన మరునితో ఉపమితుఁడు నవమాలికపజ్జన ఈ మదనుఁడును. శ్రీశాస్త్రిలవారి కర్తృప్రశస్తిలో శాకుంతలమున 'గృహీతపాథేయో భవ' యనువాద మెట్టిదో రత్నావళిలో ఈ 'క్షణాత్' లేని 'కంఠయుక్త' యు అట్టిది. మఱియు కవియవ్యవారికిని అక్కడ అయిన నాయకస్నేహముం గూర్చినారు, శాస్త్రులవారు 'లాఁతిసకి' యని. అనువాదంపుగాలితోఁపలో వాణికి మూలమునను నలఁగుపడుట దానికి విప్రలంభవిహారముగదా! అది యుండుఁగాక.]

మఱునటిదినమే, కృష్ణప్రథమరే, కాకున్న మరల నిట్లు శారికను సుసంగతచేత పెట్టి అట్లు పోఁగలుగుటయు సంభవింపదు. నిన్నసాయంకాలము తనచేత పెట్టినది తోఁటలో ఉత్సవము చూడం బోవునపుడు. తరువాత మరలం గైకొన్నది (?); దానికాపు తనపని గావున. ఇపుడు మరల సుసంగతచేత నుంచినది; దానిం జూచుకొను నోపికయు తనకు లేక, చిత్తము ఇతర కారణమున శూన్యమగుచున్నందున. కొన్నాళ్లు, ప్రతి పూఁట, తాను శూన్యహృదయయై తనపని తాను చెప్పినను సుసంగత చేయునా, తనకే విసుగుగాని ఇతరుల నిరోధముగాని లేకుండ? కాఁబట్టి ఇది కృష్ణప్రథమరే.

ఇది పూర్వాహ్ణమా అపరాహ్ణమా యనిన— 'క్షణాత్' పూఁతపట్టించునది, రాత్రివిలంబము నపేక్షింపనిది, ఈకోహాదము ప్రాతఃప్రాంత కాలమునే సూచించును. కోఁతిగొరవంకలు ఇరువంకల నాక్షేపించును. మఱి యీతామరపెజ్జచే స్మారితమైన శకుంతలతామరపెజ్జయు, ఈసంవిధానముచే స్మారితమైన మాళవికఘట్టములోని 'దివసశేష' ప్రస్తావమును అపరాహ్ణమును తెలుపును. అపరాహ్ణమే ప్రియదర్శికలోను. విక్రమోర్వశిలో నన్నో ఉదయము ౯ గంటలకును మట్టమధ్యాహ్నమునకును మధ్యకాలము పూర్వాహ్ణభాగమే. నిశ్చయమెట్లో ఇట కవి సూచింపఁడా? ఏల, సూచింపనే సూచించినాఁడు. ఇది పూర్వాహ్ణము కానోపును. ఎట్లన, సారికాచిత్రఫ
తోడి యరఁటియింటికథ యేనాఁడు జరి
ఆనాఁటిసాయంకాలమునకే 'నేఁటి సాయంకా
అనుచు సుసంగత 'మాధవీలతామంటపసంకేత
నేర్పఱచి విదూషకునికిం జెప్పను. అంతలో
ఆయపరాహ్ణముననే అరఁటియింటిసందర్భ ము
కాలము చాలదు. రాణి [illegible] ప్రకృతించ
టకును రాజు అస్వాస్థ్యము పెంచకొనను
గంటలకాలమైనను అవసరము. నాఁడే యగునేని
దానికి పూర్వాహ్ణమునుండి నాలు ప్రొద్దువఱకు
అవకాశము చాలునా, కదళీగృహమాధవీమంట
లకు, ఇవి వేఱువేఱుదినములుగా నుండవలదా,
యనుకొనఁదగును. ఏల? అంతయు నొక్కరో
లోపలికథయే, గ్రామాంతరమునది విప్రకృష్టాంత
కాదు. 'నేఁడు' అని కంఠోక్తమే. సాగరి కా
తలు రాణికంటంబడక తప్పించుకొన్నారుగావున
యముగా సుసంగత సంకేతమునకై పనిపడును; స
కును ఆయాలింగనము అంతలో బిగియఁబోయి అ
పడిలి దూసిపోయెనే యని యాతహాతహ దిన
పహము కాకుండును. రాజనకును అట్లే. మఱి
దీంద్రముననుకును, రాణి ప్రకృతిపొంది తాను అస
వ్యాజము స్వీకరింపఁగలుగుటచే; కాలాంతర
అనఁగా దినాంతరవిలంబమును ఓర్వఁడు.

మఱియు నిది యొక్క గమకము, సహృద
అవలంబింపఁదగినది. అరఁటియింటికథకై సాగరిక
చుండఁగల భయమును, ప్రత్యక్షమునో అప్ర
మునో గుఱించి, అపరాహ్ణమున రాజు తలపో
చుండు తెఱంగు—

'ఎఱుఁగుదు రెల్లరుం దనదు
వృత్తము నంచు శిరంబు వాంచు, ని
ద్దఱు తమలోనఁ బల్కికొనఁ
దన్నుగుఱించియె యంచు నులుకుచున్
పెంకెతలన్ సఖు ల్నగినఁ
జెల్లఁగఁ బూనుచిలకను భావమున్
మఱిఁగడు నిట్లు ప్రాణసఖి
మానసనిష్ఠ భయంబు పెంపునన్'

...యిది సమయోచితము 'అదినమే అనతివ్యవహిత ... అది జరిగియుండవలెను; ఇంతకయు ప్రాంతపడి ...రదు.' అని తత్పూర్వార్ధముచే సూచించును. ఒక ...వు ఎక్కువ గడచినను ఎఱుఁగనే ఎఱుఁగుదురఁట ...కాదా—ఎఱుఁగనే ఎఱుఁగరఁట) ఇఁక తల్లివాల్ప ... పలుకరించుట మానదురఁట, ఇఁక మల్కనేల? ...దురఁట- ఇఁక నిపుడును, ఇందులకను నవమైలక్ష్య ... కాఁగా ఆ మనసులోని భయముకీతియా ... 'ఇదిగో, ఇందాఁకటిదే ఆకథ'యని స్పష్టముగా ...ంచును.

౧౩. అరఁటియిల్లు:—ఇది యరఁటియింటి కథ'
...అరఁటియిల్లు ఉత్తరచరితమందలి
"...ఇదం తదేవ కదళీవన మధ్యవర్తి
...కాంతాసఖస్య శయనీయశిలాతలం తే"
...కాంతతోడి సీకు కమనీయశయన మా
...నితర్ది యిది యరంటివనిని."

...దానిని స్మృతికి ఎలయించుచున్నది. ఆకాళి... ...వమంగుశిష్యుఁడు దీనినే కాక, వాసంతి యేమఁగు ...శాలకదంబము దానిమీఁది సెమలిదోర జానకి...తో మేపిన లేళ్లు మెందలగువానితోడి గోదాతీర...న్ని శేళము చేతను తీఁగయిండ్లతోడి మాలినీతీరము ...కణ్వాశ్రమములోని యనసూయాది సహిత ...లచరితమును వనజ్యోత్స్న శాలసహకార...శాది పరామర్శ సహితమును సర్వమును స్వీక... ప్రత్యగ్ర సౌభాగ్యము ఎక్కించి ఆయనకు దక్షిణ ...కీర్తి లోకమును తీర్చరాకుండ అప్పవలెచివాఁడు. ...యారత్నావళికవియు అట్టిదానిని ఈకాంతాంబి ...తోఁటలోనికి ఎంత దింపవచ్చునో అంత దింపం ...వాఁడు. కాఁగాక, ఎట్టిది యీయరఁటియిల్లు? ...తోఁటలో ఒక్కెడ చుట్టురానాటినచెట్లచూకులు ...యావరించిన ప్రదేశము నిధస్తలము కాఁబోలును. ...లో రాజు విశ్రమించుటకు రాతితిన్నె, ఆరాముని ...మముంబోనిది ఇఁక మీఁద అగపడును; మఱి అంత ...సాగరిక సుసంగతలు కూర్చుండుటకు ఏముండి... పరుండుటకు ఏముండినదో, సెలకట్టో ఇసు... , ఆతామరాకులపఱుపును ఎందో ఎట్లో ఏమియు సూచింపఁడు కవి. అయినను సర్వము పట్టినేలమీఁదనే, అరఁటిచెట్లకుందగినదానియందు అని యూహింపఁదగును. ఏలన, ఇందు సుసంగత చేటియే కదా, ఆమెకు అంతకన్న నెక్కువ ఆసనాదిపరికరము అక్కఱలేదు. సాగరికయు తక్కువ్వదే. నేలమీఁదనే మోకరించును, కూర్చుండును; అట్లే వ్రాయును, అటునే లేచును, మరల సుసంగతం గలవుకొని కూర్చుండును; మదనబాధ పడును; నేలమీఁదనే తామరాకుల పడుకయు; అందే సాగరిక పొరలాడుటయు; కోఁతిభయమువలన అందుండియే సుసంగత సాగరికను లేపుట, అవలీకిం బోయి యేకాంతమున నిలుచుటయు. రాతితిన్నె యున్నను సాగరిక దానిపై కూర్చుండదు; సుసంగత తామరపడుక నైనను దానిమీఁద నమర్పదు. ఇదెల్ల చేటీసమ్రాజ్ఞికైన వినీతికి నిర్వాహము.

౧౪. శారిక భాషితము:-శారిక 'మేధావిని'యఁట; కావున శ్రుతధరమై అసల్లాపమును సశ్లోకమును శ్రుతమును అట్లే ధరించి పలుకును గావలయు! దానిని వినుట యందు రాజు నాగరకుఁడు, వ్యుత్పన్నతరుఁడు వసంతకునికన్నను ఎక్కువ యక్కఱ వహింపఁదగును. అతనిని విని చెప్ప మనుట సరిగాదు. 'దాసిమాఫు' అను దానిం బోని రాచఠీకపుటాచారోక్తికి ఇది చోటు గాదు. అతనిం ద్రోసి తాను ముందు నిలువఁదగును. అది అవినయమా? కాదు. దానిం గమ్మకొనుటకు శారికపలుకు లనువదృత్తము సంవరణ మగును. ఆదిలోనే ఆమాటల ధోరణిని గ్రహింపఁడా? కుతూహలితుఁడు గాఁడా? కాఁగా వసంతకుని యనువాదమును వ్యాఖ్యానమును నడుమనడుమ అనుమతింపఁదగినవి కావు. ఆసందున ఎంతయో చెవరి తప్పిపోవును. విదూషకుఁడు ఏమేని చెప్పుటకు 'వయస్యుఁడా' అని తొడంగఁగానే 'చాలింపు; వింతము తుదముట్ట' అని యనందగును. ఈసమయాన రాజుకు పరధ్యానమును సులభము గాదు, మర్షణీయముం గాదు. కుతూహలితుఁడు ఏకధ్యానముగా నుండవలదా? అదికాదా మనస్సుకు సరియైనదారి? కాక, అంతలోనే ఎవతె యగునా ఆచెలువ, ఎవఁడగునా (నేను కానా?) ఆచెలువుఁడు అని తడవుకొనుచు పరధ్యానమా? ప్రకృతి

చేతను మనస్సు చపలము. సరే. అదియే తత్ప్రయోజనముగా కవిచే ఉద్దిష్టమును. శారిక సాగరికమాటలం బోలె సుసంగతమాటలను అనువదింపదా ! సాగరికాసుసంగతల సర్వభాషితమును వినిపింపక, రాజవిదూషకాదుల వ్యాఖ్యానాంశములం జొనిపి, కావలసినమాటలను మాత్రమే వినిచినాఁడు కవి. ఇది నైపుణిగా అధ్యవసితము కాఁబోలు! అనుఁగాక. ఇందు రాజవిదూషకుల మిశ్రభాషణమున ఆనుషంగికముగా ఇంచుక సరస హాస్యము కలదు.

౧౫. మాధవీ నవమాలికలు:— విదూషకుఁడు అరఁటియింటిచెంత దేవింగూర్చి యనును- 'అట్లైతే జయము మాదేగదా!' అని. దీనిచేత నవమాలిక వికాసముంగూర్చి రాజరాణులకు పందెము ఉండెనని యూహింపఁదగును. (ఎ) తోఁటలో మాధవిని రాణి పెంచుకొన్నదఁట. నవమాలికను రాజు పెంచుకొన్నాఁడఁట. ఇట్లు రాణితో పందెములు వేసికొని తీఁగలం బెంచి పూఁతఁగొల్పుట ధీరలలితునికి సదృశవ్యాపారము కాఁబోలును. శకుంతలయు సఖులును పెంపుడుచెట్ల నీటిపోఁతలకు పందెము వేసికొనఁగా శకుంతల ప్రియంవదకు రెండు వృక్షసేచనములు బాకీపడును. అగ్నిమిత్రధారిణులు నాట్యాచార్యులయెడ, వారి శిష్యులయెడ, శిష్యుల ప్రయోగములయెడ అన్నింటను పోటివేసికొన్నవారే; రాజు నాచార్య శిష్యయను నిరావతిని రాణియాచార్య శిష్యయను మాళవిక మించును. అట్లే ఇట నుదయన వాసవదత్తలకు నవమాలికామాధవుల పూఁతలో పోటి! (బి)ఇపుడు మధుమాసము రాఁగానే మాధవి తనంతట పూచినది. నవమాలికకు ఇది ఋతువు గాదు. నవమాలిక విరజాజి; ఇదియు జాజిభేదమై వానకారునం బూచునదియు, వసంతశరోధియు అగునా? కాదు. 'వికాసకారీ నవమల్లికానాం దలచ్ఛిరీష ప్రసవాభిరామః- గ్రీష్మోయం...' అని హైమవివేకము. అట్లే కాళిదాసు గ్రీష్మమున శకుంతల పెంపుడు చెల్లెలయిన 'వనజ్యోత్స్నను', నవమాలికనే, చూచి 'నవకుసుమయౌవన' యన్నాఁడు. ఆగ్రీష్మముననే 'ఇట సెవరు విరజాజిని వేన్నీళ్ల దడుపుదురు' అని శకుంతలకు సఖులు అప్రియము జేయమికి దృష్టాంతముం బలికించినాఁడు. కావున

కాళిదాసుకు నవమలికపూఁత గ్రీష్మముననే ... మాయెను. ఎట్లైనను, ఉదయనునినవమాలికపు... ఇది ప్రాప్తకాలము కాదు! వాసవదత్తమాధవిపు... ఇది ప్రాప్తకాలము. మఱి ఆరెంటికిని పందెము... మము కాదా? రాజుకును రాణికిని వేర్వేఱు వస... లనే పెట్టి వానిపూఁతపౌర్వాపర్యమున పందెము... ధించియున్న సరియగును. (c)ఆకాలమున పూఁ... పను రాణితో ఈ పందె మేమి, రాజుకు? రాణి... త్రౌషధములయందు నమ్మకము లేదా? ఉంద... అట్లు శ్రీపర్వత శ్రీఖండదాసుఁడు వచ్చి మంత్రి... షధినో ప్రయోగింపఁగా, దాన నవమాలిక పూ... యున్న అందు రాజునకు జయ మేమి? రాణికి అ... మేమి? మణిమంత్రౌషధుల ప్రభావము అచింత్య... ఒక్కటే. అంతే. ఇఁక రాజుకు రాణికి ఎల్ల... ఆశ్చర్య సంతోషములమాత్రమే. ఇందు రాణి ఉ... రాలు, మహానుభావురాలు ఈసుపూని పెనుమరల... నంత యేమున్నది? ఎట్టిది యీమల్లిక? ఎట్టిది... శరీరమున ఈయువయవము? (డి)ఎట్టిదో ఒకం... యనుఁగాక. మఱి మొదటియంకాన ఏలినవారు ... పట్టింపను ప్రతిదినశ్రమపడుచున్నా రని ఉప... మైనది. తరువాతి ప్రవేశకమున శ్రీఖండుని దోహ... సూచింపఁబడినది. రెండవయంకమున అపూఁ... మాచుటకు వసంతకునితో రాజు బయలుదేరినా... దారిలో శారికసాగరికలు తగిలినారు. వారియోగ... నవమాలికదిదృక్ష కొంత అంతరించినది. తరువాత... వచ్చినది; అది స్మారితమైనది. ఈసుచే నామె, ... చూచినది చాలనులే, దానిపూఁత తెలియుచు... దానిని వేఱుగా మాచుట యెందులకు? అనుచు ఉ... రాలు అనుదారముగా పలికి వెనుకకు మరలినది. అ... చిత్రఫలకపాత్రప్రకటనములు, విచారణ, సేవితో... పీనితో కథ ముగిసినది. ఆమెను దేర్ప రాజు లో... బోవును. ఇఁక నవమాలికప్రస్తావను లేదు. రాజుకు... ప్రతిదినశ్రమ యొర్వఁదగినంత గారాబుది; అచిం... షధిప్రయోగప్రభావమున 'క్షణాత్' పూచినది; ... కనుబంపి దేవి విచారించినది; రాజవిదూషకులు చూ... బయలుదేరినది, రాణియు అట్లే బయలుదేరినది, ...

మటె యట్లు ఈనాటకమున ఎవరిచేతం జాడ్
ం అకాండ తిరస్కారము పొందినది. మాళవికలో
నాట్యము కథలో కంటికి అక్కఱలేని దసు
విలోనైనం బడియేతీతినది! ఇటనో ఇట్లు!

ఆహాహా, శారికగతి, రత్నమాలగతి, ఈనవమాలిక
త్తరచరిత్రమున రాముఁ డొకతెఱంగున నలవోక
ుగా చెప్పిన యామాటలు — భాగీరథిం
ది-

'సా త్వమంబ...స్నుషాయా మరున్ధ తీవ సీతా
శివానుధ్యానపరా భవ.' (అతల్లీ, నీవు కోడలు
ందు అరుంధతియుం బోలె శివమును అనుధ్యానిం
ౕక. (భూతధాత్రిం గూర్చినది— 'భగవతి వసు
్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీం' (భగవతి
రా, శ్లాఘ్యమ నీకూఁతును కాపాడుము జాన
అనునది అట్లు సత్యములై నిర్వ్యాఘములై ఇతి
మన కెక్కి నెగ్గినది! ఆ దేవతలనుం బనిగొన్న
డు ఇక్కడికి దిగినయాదిదేవుఁ డని జ్ఞాపకము
ుడినది. మాళవికలో దోహదమునకై ప్రస్తావింప
, దోహదముం బొందినది, 'తపనీయాశోకము'
మాళవిక రాజుల పెండ్లికి నాయికానాయకుల
ంగమునకు అద్భుతసంకేతగృహ మైనది.

కి- (సస్మితమ్) అజ్జఉత్త ఏసో దే అహేత్మహిం
అణసహాఅస్స అహోఓ సంకేతఘరఅం సంకప్పిదో'.

(చెలునవ్వుతో) ఆర్యపుత్రా, ఈయశోక
వృక్షాన్ని తరుణీజనసహాయునికి నీకు సంకేతగృహం
చేశినాము.)

శాకుంతలమున శకుంతలతోఁగ చెల్లెలు వనజ్యోత్స్న
తోలితూంకమున మతి కడవెఁడు నీళ్లతో సంభావి
తయగుటయు కాక, రమణీయసహాకారయోగము చే
శకుంతల పెండ్లితలంపును లేపుటయ కాక, కపట
నాలవయంకమున,—

యాతేవ సంశ్రితవతీ వనమాలి కేయం
అస్యామహం త్వయి చ సంప్రతి వీతచిన్తః.
సంకీర్త్యన్ సహకారఁగూడి కన సాన్నిధ్యం బీ
వనజ్యోత్స్నయున్;
శ్రంకక దానిని నిమ్నసం సుతేచి నాకుం జింత యి
ప్డొక్కటన్.

అని కాళ్యపులవారికి ఓంతం కోలుటయ కాక,
సాఁగిన కొమ్మచేతులతో శకుంతలక్కకు 'హస్తిని'కు
తరలుచున్నదానికి ఆలింగనామంత్రణములు సమకూర్చి
అంతట కణ్వునుంచి కాళ్యపాశ్రమమే నివర్తిల్లఁగా తానును
నివర్తిల్లినది. ప్రతిభకు విస్మృతి లేదు, వ్యాహతి లేదు.
నిద్ర బోధ అని—'off' 'on'— అని రెండు లేవు. అంత
టను బోధ — 'on'- ఒక్కటే. 'రసవన్తిహి వస్తూని
......ఏకేనైవ ప్రయత్నేన నిర్వర్త్యన్తే మహాకవేః';
'అవ్యాహతజ్యోతిః ...ప్రాతిభం చక్షుః.'



# లేఖిని

శ్రీ జంగా హనుమయ్య చౌదరి

సంపూర్ణపూర్ణిమాచంద్రచంచత్సుధాపాతంబులకు నిట్టె మూతిఁ ద్రిప్పి
అంగనాగీతానుషంగకోకిలకుహూకారంబులకుఁ దప్పఁదారిఁ బట్టి
రాజరాజసభావిరాజమానవినోదకల్పనావళి నెల్ల కాలఁ దన్ని
శశికాంతసోపానసరసీనసంతోపవనవిహారములకు స్వస్తిఁ జెప్పి

అమల భారతి గర్భరత్నాకరమున
నుదయమై మాతృదాస్యంబు నుజ్జగించు
నేర్పరుల వ్రాయుఁ గవిలేఖినీవధూటి
ఘర్మసంసిక్త కస్తూరికాద్రవమున.

తలఁదిమ్ముఁ బట్టె పుష్పలతానికుంజ సంపదల సత్రాడు తుమ్మెదల రొదల
నోకిరింతలు పుట్టె నురుతరారామపుంస్కోకిలానీక కుహూకృతముల
వినివి వేసారె సంభృత రాజ్య గర్వాంధ బంధుర దాంభిక ప్రస్తుతులను
చిట్టు బట్టినసాగెఁ జిన్ననాఁటి పురాణకావ్య నాటక కథాకల్ప మనిన

దేశమాతృకదాస్యంబుఁ దీర్పదీక్షఁ
గంకణముఁ గట్టి నిష్కామ కర్మయోగి
శ్రమజలమ్మున వీరరక్తమును గల్పి
నాయకుల గీతికలు వ్రాయు నాకలమ్ము.

వినుతింపనొల్లదు విశ్వవిఖ్యాతులౌ సంస్కృతాంధ్రాంగ్లేయ సత్కవులను
గణుతింప దర్థికిఁ దృణసమానమ్ముగా ధనము, ప్రాణము నిచ్చు దాతృమణుల
చూపుపెట్టదు సమర్థోపాయ దక్షులౌ సన్మంత్రివరుల రాజన్యఘనుల
లెక్కసేయదు మహావిక్రమంబున శత్రుకోటి నుగ్గాడిన మేటిదొరల

సర్వసంపత్సమేతయౌ జననిక్లిష్ట
దాస్యబంధము నూడ్చఁగాఁ దనువు, ధనముఁ,
ప్రాణమును బాటిసేయక పాటుపడెడు
నాయకస్తోత్ర మాశించు నాకలమ్ము.

ఉన్మత్తుఁడై కాంత నురుతరాటవి వీఁడి లంకఁ గాల్చినవాని పొంక మెంత
గురుబాంధవశ్రేణిఁ గుటిలత్వమునఁ గూల్చి పెక్కులాడినవారి బింక మెంత
జారచోరత్వాతిశాయినై కల్లబొల్లుల కిక్క యగువాని కులమ దెంత
పరమతస్థుల నెల్ల బాధించి లోకవిద్వేషులౌ ప్రవక్తల విషయ మెంత

ఒరుల బాధింప రనృతంపు సరణి లేదు
బహువిశాలాశయులు మతసమానమూర్తు
లాత్మదేశస్వరాజ్య ప్రయత్నపరులు
వీరి నుతిలేని కల మది వీతఫలము.

వైస్రాయికిని బీదవానికి సమముగాఁ, జిఱునవ్వు మధురోక్తిఁ జిలుకు నొకఁడు
సర్వస్వ మర్పించి ఋణమైనఁ బోసిక దేశదాస్యము దీర్పఁ దిరుగు నొకఁడు
హృద్రోగ బాధ సహించి కాంగ్రెసుకు వెన్నెముకయై నిల్చు నుత్తముఁ డొకండు
బీహారుభూకంపబీభత్సమున కేమిభయము లే దని కీడుఁ బాపు నొకఁడు

రైతులోకంబు సవ్యమార్గమున నడిపి
ప్రభుత నెదిరించి విజయమ్ము బడయు నొకఁడు
మన జమీందార్ల పొగరెల్ల మట్టు నొకఁడు
ఇట్టివారల నుతి వ్రాయ కేమి కలము ?



# "మరతుమన్న మరుపురారు......"

అంకితం :
దోషాలను దాచుకొనే రహస్యజీవులకు.

రచయిత :
'బుచ్చిబాబు'

"ప్రతియోగిపుంగవునికీ భూతకాలం వున్నట్లే
ప్రతిపాపికీ వొకభవిష్యత్తుకూడా వుంటుంది" —ఆస్కార్ వైల్డు.

౧

సాహిత్యప్రియులు వొక ఉత్కృష్ట గ్రంథాన్ని చెరిచి జాగ్రత్తగా పరిశీలించి వొకగ్రంథకర్తని తెలుసుకుంటామని చదవడం ప్రారంభిస్తారు. తీరా చివ్వర దాకా చదివితే, వారికి కనిపించేది సాధారణ మానవమాత్రుడే. సాధారణ మానవుడు జరిగిపోయిన విషాదకరమైన అనుభవాలను మరిచిపోయి సహజమైన నిర్దుష్ట వ్యక్తిత్వాన్ని చంపుకుని సంఘం యేర్పరిచిన నైతిక ఆదర్శంలో తనవర్తమానాన్ని యిముడ్చుకుంటాడు. ఎవరైనా జరిగిపోయిన సంగతులను జ్ఞప్తికితెస్తే మరిచిపోయినట్లు నటిస్తాడు. ఈ జరిగిపోయిన విషయాలతోనే కళానుభవజ్ఞుడైన గ్రంథకర్త వొకవుత్కృష్ట గ్రంథం తయారుచేస్తాడు. సాధారణ మానవుని శరీరంలోంచి బైటికి చిందిన ప్రతి రక్తపు చుక్కను, జీవిత రహస్యం తెలుసుకున్న వ్యక్తి వెయ్యికన్నీటి బిందువులుగా మార్చగలడు. తను మనసారా ఛేదించి మరిచిపోయి కప్పిపుచ్చవలసిన సంగతులు లేవని తెలుసుకోడంలోనే జీవితరహస్యం దాగివుంది. కొండమీదికి వెళ్లిం తర్వాత తను యెక్కివొచ్చిన మెట్లన్ని మరిచిపోయినప్పుడు మళ్లా క్రిందికి దిగడానికి మార్గంలేక మృత్యువుని ధిక్కరించి క్రిందకి దూకుతాడు. అందుకు ధైర్యం లేకపోతే, "మీరెవ్వరూ యిక్కడికి రాలేరోయ్" అని చప్పట్లు కొడతాడు. మొత్తంమీద రెండువిధాలా ప్రపంచానికి దూరుడవుతాడు. అల్లా దూరుడుకాకుండా వున్న ప్రతివ్యక్తిలోనూ వొకగ్రంథకర్త జన్మించితీరతాడు. వీరికి విషయాలూ వ్యక్తులూ మరిచిపోదామన్నా మరుపురావు. కాని వీరిజీవిత గ్రంథ… లోని మొదటి అధ్యాయాలను వ్రాసుకుని పదిమంది… తెలిసేటట్లు ప్రకటించలేరు. కొందరు సాహసించి వారి… నటించిన నాటకాన్ని వారికైనా తెలిసేటట్లు ఊహాలో… రచించగలరు. ఇల్లాంటికొందరిలో వొకవ్యక్తి తనజీవిత… గ్రంథాన్ని తిరగవేశాడు.

"అధ్యాయం మొదటిది: సాయంకాలం అనం… దులోంచి వెడుతుంటే, పొరింటిముందు మట్టిఅరుగు… మీద చిన్నపిల్లాడితో ఆడుకుంటూన్న పన్నెండు… వత్సరాలపిల్లను చూశాను. దుమ్ములో మాసిపోయి… చిరిగిన పరికిణీ కట్టుకుంది. పైభాగం అంతా చిరిగిపో… యిన చొక్కాలోంచి కనిపిస్తూనేవుంది. జుట్టంతా… అట్టకట్టి చచ్చిన నల్లత్రాచు పిల్లలలాగా అల్లుకుపో… యింది. మధ్యగా నాసిక అడ్డం తగిలిందికాని లేకపోతే… రెండు నేత్రాలూ వొకేకన్నులాగా కనిపించేంతటి… విశాలంగా వున్నాయి. మురికితో చారలుపడ్డ అము… ఖంలోని తెల్లటికళ్లు ఆతెలుపు మధ్యలో నలుదిక్కులా… నాట్యమాడే నల్లటిపాపలూ, బొగ్గుల బుట్టలో పాల… చెంబు దాచిన ఉపమానాన్ని స్ఫురింపజేసినవి. క్రిందికి… వాలిన కళ్లమీద కనురెప్పల నీడ బుగ్గలపైన పొడుగాటి… గీతలు గీసింది. ఆగీతల మధ్యనే రెండుగులాబీ మొగ్గలు… వికసిస్తున్నాయి. నే నల్లా వెళ్లిన నాలుగైదు రోజులు… అక్కడే అల్లాగే ఆడుకునేది. ఆరోజున నేను కొంచెం… నవ్వి చూశాను. దానికి జవాబుగా నాకడుపు నిండే… లాగా ఓపిగలేని లేతపెదవులను కదల్చింది. అల్లాగే… పదిహేను దినాలు......"

"అధ్యాయం రెండు : నన్ను పక్క సందులోంచి తిరిగి, లోపలికి రమ్మంది. గదిలో నవారుమంచంమీద కూర్చున్నాను; గోడని అద్దం, అద్దంముందు బల్ల, బల్ల మీద కీళ్లు రెండూ గాడిగావున్న పాత హార్మని పెట్టె వున్నాయి. గోడలమీద తగిల్చివున్న పటాలు రెండయినా, బొమ్మలూ, క్యాలెండర్లూ చాలావున్నాయి. కూర్చుని, ఒకటిరెండునిమిషాలూ మాట్లాడలేక పిల్లని పరకాయించి చూడగలిగాను.

'ఏమండి మీరు మా పిల్లని పెండ్లిచేసుకుంటారని పుకారు బయలుదేరింది. మీరు యిష్టపడితే, మీ వాళ్లు ఏమీ అనరుట, నిజమేనాండి ?'

నాదగ్గనుంచి సమాధానం లేదు. మళ్లా ఆరం భించి 'మా పిల్ల రోజూ మిమ్మల్నిగురించే చెప్తుంది. నిద్దట్లోకూడా అదే పలవరింత. పిచ్చిముండా! ఆయన ఎవకులంవాళ్లని ఎక్కడ చేసుకుంటారే అంటే, ఏందండి. మీరు అదంటే, చాలా యిష్టమనీ, మీరు పెండ్లి చేసుకోకపోతే ఆఖరికి మీ యింట్లో, పూరికే కాలిపనేనా చేసి వుంటాననీ, యిదే కబుర్లండి అస్తమానూ...ఏమండి, నిజంగ చేసుకుంటారు...?'

'అబ్బే పెండ్లిచేసుకుంటానని ఎవరన్నారు? మావాళ్ల కీమాట తెలిస్తే అమ్మో! యింకేమన్నా వుందీ! అది కాకపోయినా, నా కప్పుడే పెండ్లేమిటి ఎవరేనా నవ్వుతారు' అన్నాను.

'మరవులే, ఎందుకు రోజూ మీరు అల్లా మా పిల్లకేసి చూసి నవ్వడం ?'

'అబ్బే ఊరికేనే. దోవలో పోతుంటే మనం అందర్నీ చూడమూ ? ఏదో మీ పిల్ల నా కండ్లకు బాగుంది.?

'అందుకనే పెండ్లి చేసుకోరాదు ?'

'అబ్బే — బాగుంటే, చూడడానికి బాగుం దన్న మాట. పైగా మేం బ్రాహ్మలం : మానాన్న పెద్ద ఛాందసి; నా కేమీ యీ విషయాలలో స్వతంత్రం కూడా లేదు. మా వాళ్లలో నా కిష్టమన్న పిల్లలాగా వుంటుంది మీ అమ్మాయి. ఇప్పుడా పిల్లకి పెండ్లయి పోయింది. ఆ పిల్ల జ్ఞాపకంరావడంవల్ల అల్లా చూస్తాను. అంతేకాని, యీ సంగతులు మళ్లా మావాళ్లతో చెప్పా అనేవుగనక.'

మేం మాట్లాడేటప్పుడు, పువ్వు ఆ గదిలో లేదు.

* * *

"అధ్యాయం మూడు : నూతిలోనుంచి నీళ్లబిందె భుజాన్ని పెట్టుకుని, నా యెదురుగా వొస్తోంది. పరికిణీ, జాకెట్టు, పైన ఓణీ పూర్వంలా కాకుండా, శుభ్రంగా వున్నాయి. శరీరంలోకి రావలసిన స్థూలత, పొడుగు వొచ్చాయి. అప్పుడు నాలోకి చూసిన చూపు నన్ను, అప్పుడే జన్మించిన పసిపాపలా మార్చింది. బిందెలోని నీళ్లు వొలికి శరీరంమీద పడి, బట్టలను తడిపివాయి. ఓణీ క్రిందికి జారుతుంది. దాన్ని సర్దేందుకు, బిందెమీద నుంచి, చేతిని కిందకి లాగు తుంది. బిందె కిందకు పడిపోయింది.

నేను యెదురుగా నిలబడ్డాను. సిగ్గుతో తల వొంచుకుని, పమిటకూడా సర్దుకోదు. తడిసిపోయిన తెల్ల రవికలోంచి చూశాను—తెల్లగులాబిలతాడు చిక్కు పడిపోయింది. రెప్పలు పైకెత్తి, నన్ను భయంతో చూసి, రెప్పలు దించి, బిందె తీసుకుని, తనంతటతానే 'నిన్న రాలేదే?' అని, నలుపైపులా చూసింది. అప్పుడే నల్లటి చీకటి వ్యాపిస్తోంది. చెలువుగట్టున, వొకరిద్దరు తప్ప, యెవ్వరూ లేరు. నేను, వొణికి పోతున్న అర చేతిని, ఆమె చల్లటి బుజంమీద ఆనించాను. మళ్లా నేత్రాలు నాచేతివెంపు త్రిప్పి, రహస్యంగా, నిశ్శ బ్దంగా నవ్వింది. పూర్తిగా వికసించిన గులాబీ పువ్వు, ఎందుకో ముడుచుకుపోయి, మళ్లా చిన్న మొగ్గకింద మారిపోయినట్లుగా, నా చేతికింద తనచేతిని దాచింది."

* * *

"అధ్యాయం నాలుగు : ఆ సందులోంచే, ఆ యింట్లోకే వెళ్లి ఆ గదిలోనే కూర్చున్నాను. పువ్వు అక్కడ లేదు. దాని తల్లి యిదివరలాగానే, గదిలోకి వొచ్చి తలుపుదగ్గఱ నిలబడి మాట్లాడింది.

'మళ్లా యిన్నిదినాలకు మామీద దయ కలిగిందా?'

'అల్లాగంటావేం, రోజూ నేను మీ యింటి ముందునుంచే వెడుతున్నాగా?'

ఈ సారి ధైర్యంగా మాట్లాడకలుగుతున్నా.

'అవులే, పెండ్లిమాట నిశ్చయంచేశారా? పువ్వ చంపుకు తింటోంది అడగమని. దానికి తగనిసిగ్గు. అది, అసలు నాకు పుట్టవలసింది కాదు. రోజూ రాత్రిపూట రాగాలూ; అన్నం తినదు, యింట్లో పనీ చెయ్యదు...,

'పెండ్లెప్పటి యెవరేనా నవ్వుతారు. నే వింకా బోలెడు చదువుకోవాలి. పైగా మీకులం మాట అల్లా వుంచి, మీ వ్యవహారాలూ, మీరు వుండే విధానం మా వాళ్లకి తెలిస్తే...'

అని, యింకా బోలెడు చెప్పబోతున్నా.

'చాల్లెండి. అల్లాంటి మా ట్లనకండి. మాకులం తక్కువదే; భగవంతుడు మా కిల్లా రాసిపెట్టాడు. అంతమాత్రంచేత, మేం బజారు ముండల మనీ, నీతీ జాతీ లేనివాళ్ల మనీ అనడం మీకు తగదు. మీకు కోపంవస్తుందని భయపడుతున్నా కాని, మీకులం వాళ్లే యీమధ్య అన్ని విధాలా చెడిపోతున్నారు. కాని మీ మగవారు, పాపం అమాయకులు. అన్నీ కప్పేసుకుని, యేదో చాటుచాటుగా కాలం వెళ్లబుచ్చుతున్నారు. ఎటొచ్చీ, మా కులంవల్లా, బీదతనంవల్లా మేం అందరి నోళ్లల్లోనూ పడుతున్నాము. మీ రేమో గోప్యంగా వున్నారు. అంతే భేదం. నిజంగా చూస్తే మా పిల్లలాంటి పిల్ల మీ కుటుంబాలలో వుండనే వుండదు. నే నొక టడుగుతా చెప్పండి. మీలో ఆడపిల్లలు "అమ్మా, నే నా అబ్బాయిని ప్రేమించానే, మాకు పెండ్లి చెయ్యండే" అని అడుగుతారు? అందాకా యెందుకు, పెండ్లయిం తర్వాతేనా, మొగుడితో మనసిచ్చి మాట్లాడతారు? అత్తలమీద కోపాల్లు, యిద్దరి మధ్యనా మొగుళ్లు పడి, కుమ్ములాడడం తప్ప మీలో యేముందో చెప్పండి. శరీరాలని వొకళ్లకి మనస్సుని వేరొకళ్లకి నప్పచెప్పి, నిక్షేపంలాంటి సంసారాలని వల్లకాటిక్రింద మార్చేవారు మీలో ఎందరు లేరు?..."

ఈ వుపన్యాసం నాకు చాలా కష్టం కలిగించింది. నీచకులంలోని పిల్లని ప్రేమించి, దానికోసం సందుల్లో దూరి, యిల్లా వెధవ తాత్కాలికసౌఖ్యంకోసం, కుటుంబాన్ని, నాకులాన్ని దూషించినా విని [illegible] కోడం అమానుషమైన పంగతని తెలుసుకుని, అ[illegible] బాధిస్తోన్న విషయం బైటికి వెళ్లగక్కాను.

"మీఅమ్మాయికీ, యీసందులో గోవింద[illegible] సహవాసంట, నిజమేనా? అతను మీపిల్లకి సంగీతం [illegible] తాడుట. నే పెండ్లి చేసుకుంటానన్న ఆశవల్ల అ[illegible] మీయింటికి యీమధ్య రాకుండాచేస్తున్నారుటగా.[illegible]

"ఎవ తె, యిది మీతో అన్నది..." అని [illegible] బోయింది. ఇంతలో యెట్లా వొచ్చిందో, పువ్వ [illegible] లోపల కొచ్చి, వాళ్లమ్మని బైటకి నెట్టి, తలుపు లో[illegible] గొళ్లెం తగిలించి, చరచరా వొచ్చి, నానడుం[illegible] వాలిపోయింది. తనచేతులను నామెడచుట్టూ వేసి [illegible] వొంచుతూ, యేడవడం మొదలెట్టింది. మధ్యలో యే[illegible] ఆపుచేసుకుని, నాకేసి ప్రణయవిషాదంతో చూసి[illegible] కంఠంలోనించి వొచ్చే వోపికలేని యేడ్పు, యే[illegible] మధ్యలో తెగబడే మృదువైన స్వరాలు, కండ్లలో[illegible] కాలవలగా కారే ఆవెచ్చని కన్నీరూ, నామనసు[illegible] లోపలనుంచి యివతలకి లాగి, మూగవానిగా మ[illegible] శాయి. ఆయాసంవల్ల వొచ్చే వేడినిట్టూర్పు, [illegible] స్థలంలోపలి భాగంనుండి మెల్లగా ప్రసరించే శరీ[illegible] వింతసువాసనా, నన్ను బాహ్యప్రపంచాన్నుంచి [illegible] కృష్ణి చేశాయి. అది మాట్లాడినదానిలో నేను చా[illegible] భాగం వినిపించుకోనేలేదు.

"మీరు పెండ్లిచేసుకుంటే చేసుకోండి, [illegible] పోతే లేదుకాని, యిల్లాంటి మాటలు అనకండి. గో[illegible] దం యెవడు వెధవ — అన్నీ వొట్టిమాటలు. [illegible] కోడం యిష్టంలేక, యేదో తప్పించుకోడానికి యిట్లా[illegible] వన్నీ కల్పిస్తారా? అవును ఆమధ్య రెండురోజు లా[illegible] సంగీతం చెప్పిపోయాడు. మాఅమ్మ వాడిని యేమన[illegible] ఆశపెట్టిందేమో,— వాడిపెండ్లాం ప్రసవించినప్పు[illegible] బలవంతంగావాకోసం చంపేశాడని చెప్పుకుంటారు.[illegible]

"అల్లా రా దోవలోకి, యేదో వుంది కథ[illegible] వూరికే యెందుకు పుడుతుంది పుకారు?"

"అల్లాగంటే చూడండి మరేంచేస్తానో" [illegible] జడతో నాకంఠంపైన కొడుతుంది. "ఒకరో[illegible]

అమ్మ లేనప్పుడు నన్ను భలే అల్లరి చేశాడు. అనుట్టున
, మిరపకాయలకారం చేతులకు రాసుకుని కళ్లల్లో
 పొరిపోయాను. మళ్లా ఏపుదేడు... మీరు
..." అని మళ్లా ఏడుపు ప్రారంభించి, అట్లా
రం నాకంఠంపైన ఆనించి యెంతసేపు యేడ్చిందో
లేను..."

* * *

"అధ్యాయం అయిదు: రాత్రి పదకొండు దాటింది
మాయింటి పేధిగదిలో కూర్చుని చదువుకుంటున్నా
పైట ఆకాశం విరిగి మీదపడేటట్లు పిడుగుల
డు; హోరున వర్షం. కిటికీతలుపు వేసినా, దీపం
పోతానని ప్రతినిమిషం బెదిరిస్తూవుంది. కాని నేను
ృతిలో జరుగుతున్న కల్లోలం గమనించలేక
ున్నాను. దానికి నే చదువుతున్న గ్రంథమే కార
ఆకథలో నేను వినుస్నడను అనటమేకాకుండా న
దినాల్లో యెదురుకున్న సమస్యకి గ్రంథాలలో
ధానం దొరుకుతుందాన్న ప్రత్యేకాభిలాషతో
ా చదువుతున్నా. "దయ్యాలు... దయ్యాలు...
గత్తె.. తలుపులు వేసివున్నా, లోపలికి ప్రవేశించ
వు.... అందులో సుందరమైన దయ్యాలు మరీ
ాదకరమైనవి...వాటిసౌందర్యం నీముందు బహి
పరిచి, నీలోపలకి ప్రవేశించి, నిన్ను పీల్చిపిప్పి..."
న్న, హెన్రిక్ ఇబ్సెన్ రచించిన
య్యాలు" అన్న నాటకంలోని వాక్యాలు చదువు
ంటె తలుపు బిగ్గఅగా తట్టుతున్నశబ్దం వినిపించిది.
ంగా దయ్యాలేమోనని ఖంగారుపడి, లోపల నవ్వు
మళ్లా చదువుతుండగానే, తలుపుపెద్దగా సుద్దినట్లు
ంచింది. లేచి వెళ్లి తలుపుతీశాను. ఏదో నల్లగా
ంచగానే నాలుగడుగులు వెనక్కి నడిచాను. తడిసి
ిన నల్లటిచీర, తెల్లటిరవిక, గదంతా నీళ్లు
ంత్రరా, సుమ్ముంలో, నుంచుంది పుష్ప. మనిషంతా
, ముద్దయిపోయింది. లోపలికి రమ్మని తలుపు
చి, పైనున్న తువ్వాలు తలతుడుచుకోమని, చేతి
ను. నిజంగా కన్నీరో, వర్షపునీరో తెలియదు
, ముఖంలో కళ్లలోని తెలుపు, నలుపుని యేకం
ంతటి విచారంతో నిండివున్నాయి. గోడవెంపు
తిరిగి, వెంట్రుకలు తుడుచుకుంటోంది. ఏదో మాట్లాడ బోతుంది. నే దగ్గఱగా వెళ్లి చెవులో మెల్లిగా అన్నా 'గట్టిగా మాట్లాడకు, యింట్లోవాళ్లు లేస్తారు....ఉండు నే లోపలికెళ్లి, మాఅత్తయ్య చీరయేదేనా వుందేమో చూస్తాను, అని, మెల్లిగా లోపలికెళ్లి ఆరడానికి కట్టిన చీర విప్పి వొచ్చి మెల్లగా గొళ్లెం తగిలించి, వెనక్కి తిరిగేప్పటికి, పుష్ప వివస్త్రఅయి, వొణికిపోతో, గోడ వైపు తిరిగి నిలబడివుంది. దీపం తగ్గించి, నే కళ్లుమూసు కుని, చీర అందజేశాను.

చీర ధరించి, తడిసినవాటిని పిండి కుర్చీమీద పెట్టి, రవికబదులు నాతువాలు పైన కప్పుకుని, తన చేతులు నాబుజాలమీద వేసి దీనంగా చూసింది.

"ఇట్లా అర్ధరాత్రి వొంటరిగా మాయింటికి రా వొచ్చునా? ఎవళ్లకేనా తెలిస్తే యెంత తప్పు. ఈ చీకట్లో, యీవర్షంలో, నాకు వొంట్రిగా కూర్చో డానికే భయంగా వుందే.... పైగా, నే నిక్కడ కూర్చున్నాను కాబట్టి సరిపోయింది. లేకపోతే, తలుపు తట్టి అందర్ని, లేపి అల్లరిచేసేదానివేనా... అదిగాక పోయినా, యెందుకు యింకా నాదగ్గఱకి రావడం?

"మిమ్మల్ని చూసి మూడునెల్లు పైగా అయింది. మీకు కోపంవొచ్చి రావడం మానేసినా, నేనుమిమ్మల్ని చూడకుండా వుండగలనా. ఇంట్లోవాళ్లని లేపి అల్లరి చేసేదాన్నా? ఎప్పుడేనా అల్లాచేశానూ? మీరు మొదలు నాకు ప్రేమించడం నేర్పి, పెండ్లిచేసుగోడానికి యిష్ట పడక, యేవో లేనిపోని అనుమానాలు పెట్టుకుని, నాకు ఆఖరికి కనిపించడంకూడా మానేస్తారా? నామనస్సుని, విచారాన్ని కొంచమైనా మీరు గమనించకూడదు?"...

"ఎవళ్లు గమనించాలో వాళ్లే గమనిస్తారు. ఈ మధ్య ఎవరితోనో లేచిపోయావుటగా..." అని నా ముఖంమీద పడ్డ చీరకొంగును అవతలకి తొలగించాను.

'రామ, రామ... మాఅమ్మ నన్ను మాయచేసి తీసికెళ్లింది దాని కెంతసేపూ, డబ్బుగోల—అవులే నే వొప్పుకున్నానా? ఆరాత్రి వాళ్లందరితో నాకూ మీకూ వున్న స్నేహం చెప్పేసి, నగలు తీసుకొని, నేను అమ్మ

చక్కావొచ్చాం... నేను యింత అర్ధరాత్రిరావడానికి కారణం వుంది, వినరూ?..."

తరవాత మాట్లాడడం మానేసింది. అమాయకపు కన్నీటి చుక్కలు కండ్లలో మెరుస్తున్నాయి. నేను పైనున్న తువ్వాలుతో తుడుస్తున్నాను.

"నాలుగు నెలలక్రితం మీకు జ్ఞాపకం వుందా మాయింట్లో, యిప్పుడొచ్చినట్లుగానే వర్షం రావడం; మీరు మళ్లా యెల్లా యింటికి వెళ్లనా అనిభయపడటం; నేను వెళ్లనీయకుండా తెల్లవార్లు ఆపుకెయ్యటం..."

నేను అవి స్మరిస్తూ 'ఊ' అనడంకూడా మానేశాను. తటాలున లేచి కూర్చుంది.

'నిశ్చయం చేసుకున్నానండి, రేపు మీనాయన గారి పాదాలమీద పడి అడుగుతాను — ఒప్పుకోక పోతే మీకు చాలా యిష్టమన్నారే—ఆ కాశ్మీరదేశం పోదాం. మీరు వర్ణించిన ఆసరస్సులూ, ఆ పడవలూ, నీటిలోని చంద్రబింబం, అనిర్వచనీయమైన ముద్దు..." అని నా అధరాలను తాకింది. 'పోదాం, మనం కాశ్మీరం పోదాం నాదగ్గఉన్న నగ లమ్మితే, నాలుగువందలేనా వస్తాయి. ఈమధ్య మా అమ్మ నాకు వీణకూడా నేర్పిస్తోంది ... పాటలు పాడుకుందాం. తరవాత దేముడే..."

"అయ్యబాబో మావాళ్లతో చెప్పడమే ... మనం కాశ్మీరం పోయినా, నువ్వు సరిగ్గా వుంటావా - మీఅమ్మ వుండనిస్తుందా ?"

"అల్లా అనకండి. అన్నీ పిచ్చి అనుమానాలు మీవి. నాకు మీరు తప్ప యేం కావాలి? అదేనా, నన్ను మీరే కోరుకున్నారు. మా అమ్మ అడ్డంవొస్తే చంపిపారెయ్యను! నేను మీకోసం యింత చేస్తున్నప్పుడు మీరు పురుషులయివుండీ, యేమీ చెయ్యలేక పోతున్నారే..." మళ్లా నాశిరస్సుని తనచీరకొంగులో కప్పేసుకుంది."

*  *  *

తరువాతి అధ్యాయాలన్నీ చాలా పెద్దవి. పైగా అవి పైవాటంతటి విశదంగాలేవు. అందులో నమ్మరానివి, రహస్యమైనవి ఆత్మవంచనతో కూడుకున్నవీ అవడంవల్ల, ఆ నాయకుడి ఊహాలోనైనా విస్ఫుటం విహరించడంలేదు. వాటిట్లో కొన్నిమాత్రం, సత్య[...] ఆకారం కలిగివున్నాయి.

"అధ్యాయం ఆరులో : నేను పెండ్లిపూ[...] మెడలో పుస్తె కట్టబోయేముందు, అందరివం[...] వొక్కసారి పరకాయించి చూశాను. నాలోపల[...] ఆవేశాన్ని యెవ్వరూ అర్థంచేసుకుని, నాకు ఊ[...] హంచూపిస్తూ తెలపంకించినవారు లేరు. పదిపే[...] గజాలదూరంలో, స్తంభంవెనకాల నిలబడిన ప[...] నవ్వుతూ, 'కానీ' అన్నట్లుగా చేతులతో సంజ్ఞ[...] యీ సముద్రంలో యీదులాడేందుకు తగినంత స్థైర[...] బలంకూడా సమర్పించి, తను వొడ్డునే నిలబడి చప్[...] కొట్టింది. బ్రాహ్మలు మంత్రాలు చదివారు; సన్నా[...] మోగింది. నాకర్థంకాని యీ దేదీప్యమానమైన చీకటి[...] నాకు పువ్వునవ్వువొక్కటే కనిపించింది..."

*  *  *

"అధ్యాయం ఏడు : "ఏమండోయ్[...] మ్మాయి భారసాలకి, మామావయ్య లగ్నంకు[...] పెట్టాడు. మీరు యెవరెవరికి రాసుకోవాలో, [...] వాళ్లకి రాసుకోండి..."

*  *  *

అధ్యాయం ఎనిమిది : "ఏమండోయ్, "మనూ" స్కూల్ ఫైనల్ పరీక్ష ప్యాసయిందిట. హెడ్‌మాస్టర్‌దగ్గరనుండి టెలెగ్రామ్ వొచ్చి[...] టీపార్టీకి సన్నాహం కానీయండి..."

*  *  *

అధ్యాయం పది:... "Complication [...] వుంది. చెప్పలేం, రిసల్టు. ఎందుకేనా సంబంధ[...] వాళ్లకు, intimation యివ్వండి" అన్నాడు [...] గుండె పగిలేటట్టు, డాక్టర్ కామత్. మంచంప్ర[...] 'స్టవ్' ముట్టించి, ఓవల్టీన్ తయారుచేస్తోంది [...] నేను పడకకుర్చీలో చేర్లబడివున్నాను. ద[...] వొచ్చింది పువ్వు.

"ఎట్లాగా యిప్పుడు పాపం, ఆపిల్ల[...] దగ్గరలేదే. మీరు విచారించకండి. మనం చేతనయి[...] వరకూ ప్రయత్నిద్దాం—తరవాత 'దేముడిమీద

అదిగో, ఆరేడుషే వొద్దన్నాను. పాపం, ఆయిల్లా మెంత దిగులుపడుతుంది" అని పువ్వు రువ్వాలుతో కన్నీటిని తుడిచి నన్ను వోదార్చింది...

౨

తనజీవిత గ్రంథంలోని యీ జరిగిపోయిన అధ్యా లను యెన్నిమార్లు తిరగవేసినా, ప్రస్తుతం నిర్ధారణకు లేకపోతున్నాడు జగన్నాథస్వామి. కవరు చించి రం తీసేటప్పటికి, అందులోంచి వాడిపోయిన బిపువ్వు రేకలు క్రిందికి పడ్డాయి. ఆలేఖను చివర చదవడానికి సాహసించలేకపోతున్నాడు. పాత గా చదువుకుంటే తనకి సంతోషం కలిగించే యాలు చాలా వుంటాయి, అందులో. కాని తను పోదలచుకున్న సంగతులుకూడా వున్నాయి. లో కొన్ని భాగాలు—

"పైన మిమ్మల్ని డార్లింగ్ అని సంబోధించాను. నేము డార్లింగులం కాము. అప్పుడే మీకు ముప్ఫయి ండ్లు పూర్తయ్యాయను కుంటాను. అట్లా వ్రాయ కారణం, చిన్నతనంలో మీరు నేర్పిన యింగ్లీషు లను, మళ్లా సాధించి యిప్పటికి ఉత్తరానికి ంత పాండిత్యం సంపాదించాను... ఎప్పుడూ ంగురులను గులాబీపుష్పాలతో పోల్చేవారు మీరు; అం , ఆరేకలుకూడా, యిందులో పెట్టి పంపు న్నాను... నన్ను స్వీకరించమని కోరడానికి కారణం డబ్బులేకా, తిండిలేకా కాదు. ఏదో వలుసరైదు ల్లలకు వీణ నేర్పుతూ, రోజులు వెళ్లబుచ్చగలుగు న్నాను. నిజమైన విషయం యేమిటంటే, యిప్పుడు పుతున్న జీవితం నాకు నచ్చలేదు. నాకు భర్తతో, హంలో కాపురముండి, అందరిలాగా నిశ్చింతగా ని కోరెక్కగావుంది. రోడ్లమీద నడిచే భర్తల జంటలను చూస్తుంటే నాకు చాలా ఫాన యీర్ష్యగాను వుంది. సంసారంలోని స్త్రీకి, , స్వేచ్ఛ, ఆదరణ, గౌరవం వున్నాయి. నా వీటిని నాకుకూడా, యెందుకు అర్పించకూడదు! కులగోత్రాలు లేవనీ, లేచొచ్చినదాని కూతు అనేకపేర్లు పెట్టి, నన్ను అందరికీ దూరం చేశారు. నాకు నీతి లేదంటారు. పైటికి కనిపించేమంచి విషయాలు లేకపోవొచ్చు కాని నాలో, వీసావాసం వల్ల అబ్బిన కొంత నిజమైన మంచి వున్నది. చూడండి, మీరు భార్యతో కాపరంచేస్తున్న రోజులలో, మిమ్మల్ని బాధించి, పాపం, ఆవిడకు యెప్పుడైనా, అనూయ కలిగేటట్లు చేశానా? మీకు నిజంగా నన్ను స్వీకరించాలని వుందని నాకు తెలుసు. కాని పదిమందీ యేమను కుంటారోనని భయపడుతున్నారు..."

మళ్లా చదవడం మాని ఆలోచించడం మొదలెట్టాడు, జగన్నాథం. భార్యపోయిన నాటి నుంచీ, వొంట్రిగా వుండి బెంగడిపోతున్నాడు. అసలతనిది బెంగపడి, ప్రతిదానికి యెడతెగని ఆలోచనచేసే స్వభావం. అతన్ని ప్రతినిముషం, యెవరో ఆదరించి, ధైర్యంచెప్పేవారు లేకపోతే, దిగులుతో క్రుంగి పోతాడు. అతనికున్న ముప్పయిఐదు సంవత్సరాలలో, బాల్యంలోని పదేండ్లు తీసేసినా, మిగిలిన పాతికేండ్ల అనుభవం, విజ్ఞానం వున్నా కర్తవ్యానికి దిగలేకపోతు న్నాడు. పువ్వు మారిపోయి తనకి పిచ్చెత్తించేటంతటి సుందరాంగనగా తయారయింది. ఆమె వ్రాసిన లేఖనుబట్టి చూస్తే ఆమె కున్నది వొక్క సౌందర్యమే కాకుండా ఉన్నతాశయాలు, తన యెదురుగావున్న వొక్కడైవాన్నే ఆరాధించే అంతరాత్మకూడా వున్నాయి. భగవంతుడు, ఆమెను సృష్టించడంలో, భారం తలిదండ్రులమీద పూర్తిగా వెయ్యకుండా ప్రత్యేకంగా శ్రద్ధతీసుకుని అతీతమైన శిల్పచాతుర్యం చాటుకున్నాడు. అన్నివిధాలా ఆమె తనకు కావల సిందే. కాని ఆమె వెనుకటి చరిత్ర నీతిదాయకమైంది కాదు. ఆ సంగతులు యెల్లానూ మరిచిపోయి, పెండ్లి చేసుకొనో, లేకపోతే, వూరికే తనయింట్లో వుంచుకుని భార్యగా చూసుకొంటోనో వుందామన్నా సంఘం అతని చర్యను విమర్శిస్తుంది. పూర్తిగా దుర్నీతిపరు డనకపోయినా, నీచమైన ఆదర్శాలు కలవాడని నింది స్తుంది. తన స్వంతసమస్యని, జగన్నాథం, ప్రపంచ సమస్యలోకి నెట్టి, అనేక ఆచారాలలో మరుగుపడిన పాత సమస్యలని లేవగొట్టాడు. పువ్వులా కులం, జాతీ లేని స్త్రీలు యెంతమంది వున్నారో హిందూ సంఘంలో.

మంచిగా వుండి, అన్నివిధాలా నిక్షేపంలా వున్న వాళ్లని,యింకా మంచిగా ఉండమనీ, యింకా అభివృద్ధి చెందమనీ శాసిస్తుందికాని సంఘం, మంచిగా వుండేందుకు అభిలాష వున్నా అవకాశాలులేని అసహాయులకు అవకాశాలు కల్పించదే! ధనం, అవకాశం, కొంత లోకజ్ఞానం వున్న వుత్తమ కుటుంబాలలోని యేపదిమంది కోసమో సంఘం నైతిక దేవాలయాన్ని నిర్మించి, అందులో కెళ్లి ప్రార్థించ మంటుంది. కొందరు పువ్వులాంటి స్త్రీలు, స్వహస్తాలతో తయారుచేసుకున్న మట్టివిగ్రహాన్ని తనలాంటి విశాలహృదయుడు దేవాలయంలో ప్రతిష్ఠించడానికి ప్రయత్నించినప్పుడు సంఘం అతన్ని అస్పృశ్యునికింద చూసి అతని వునికిని బహిష్కరిస్తుందే! ఈనీతి, దేవాలయాలలోనే కాక మానవుల జీవితాలలో ప్రతినిత్యము గంటుతెయ్యాలన్న సంగతి గమనించదే. ఏచింతాలేకుండా, సంతుష్టి చెంది హాయిగావున్న ప్రతివ్యక్తీ సంఘానికి శత్రువే అంటాడు హెన్రిక్ ఇబ్సెన్. సంఘం నిర్మించిన ఆదర్శాన్ని తనదిగా భావించుకుని దానికి అనుగుణ్యంగా ప్రవర్తించడంవల్లే, లోకంలో యిన్ని భగ్నజీవితాలు మృతకళేబరాలు నిప్పులలో నాట్యమాడుతున్నాయన్న ఇబ్సెన్‌గోలవి లోకం పిచ్చివాని వున్మాదంగా పరిగణిస్తుందే. హిందూసంఘానికి మూలాలైన, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభజన ప్రస్తుత పరిస్థితులలో యెంతవరకూ అర్హమైనదో అన్నది పెద్ద సమస్య. ఈనైతికసంఘ పరిపాలకులను,యీవిషయాన్ని గురించి ప్రశ్నిస్తే, వారిలో పూర్వాచార పరాయణులిచ్చే సమాధానం "అంతా దైవవిధి- వారివారికర్మ" అని; వారిలో కొంచెం నవీనభావా లున్నవారు చెప్పేది "ఆసమస్య మాది కాదు. అది ఆర్థికసమస్య. దేశానికి స్వతంత్రం లభిస్తేనేకాని, పరిష్కారం కాదు. సోషలిష్టులను కనుక్కోండి..." అని. దీనిమాట యిల్లా వున్నా, తనబోటివాడు సంఘనీతికి అర్థంకాని, దానిని అతీతమైన మార్గాన్ని అనుసరించి ప్రవర్తిస్తే, లోకం చూసి ఓర్వలేక, నిరసిస్తుంది. "ఇతరు లందరికంటె కూడా, యెక్కువ 'మంచి'గా వుండడానికి ప్రయత్నించినవ్యక్తి, అవినీతికరమైన గుమ్మంలో అడుగు

పెట్టాడన్నమాటే"అని, తన జీవితంఅంతా ధారబో
చెప్పగలిగాడు పాశ్చాత్య సంఘసంస్కర్త బ్రా
తనకర్తవ్యం వివాదాలు పెంచడం కాదు; తను ఆ
వంచన లేకుండా, స్వవిషయాన్ని సాధించాలి; పువ్వు
తనతో వుండమనదలుచుకున్నాడు ఆఖరికి జగన్నాథ
మళ్లా ఉత్తరం చదవడం ప్రారంభిస్తాడు.

"... మీరు నన్ను మీగృహిణిగా అంగీకరిం
ముందు,మనం ముఖాముఖీన మాట్లాడుకోలేని సంగతు
గమనించాలి. మీరు నన్ను వీధులో వొదిలేసి గృహస్థు
నప్పటినుంచి, నాజీవితంలో శాంతిలేదు. స్వార్థపరుల
మీవుత్తమకుటుంబీకులూ, నన్ను వారి ఆనందానికి ఆధా
రంగా చేసుకుని, నాపనచూసి మళ్లా గిరవాటేశారు.
నేమి చెయ్యలేను. దానికి కారణం చెప్పలేను. విచి
వ్యక్తులు వారి అధరాలికి పట్టినబూజును, తుప్పునూ నా
శరీరానికి రాశారు. నే నవన్నీ అసహ్యించుకుని, ఆశ
రాన్ని వొదిలేసి, కొత్తరూపం దాల్చదలుచుకున్నాను
మీరూ యివన్నీ అర్థంచేసుకుని, మరిచిపోయి, క్రొ
జన్మ దాల్చి నన్ను మీపాదాలముందు కూర్చుని, వి
జోళ్లకి పాలిష్ చెయ్యనివ్వాలి. మీకు సర్వచాకి
చేస్తాను. మీపిల్లని,తల్లిని మించిన ప్రేమతో పోషిస్తాను
నన్ను తల్లిగా వుండనీయండి. ఆపవిత్రత, ఆ శాం
నాకూ కావాలి. నాశరీరాన్ని చంపారు; నామనస్సు
నైనా వికసించనీయండి. నాకు స్థానం, ఆకాశంకిం
కాకుండా మీనీడలో యివ్వండి. నేడే వొచ్చి మీ
యింటిదీపం వెలిగిస్తా......"

జగన్నాథంలో, విషాదం ఆవేశం చెలరేగాయి
ప్రతివాక్యంలోను, తనఅనుభవంలో వినలేకపోయిన
సందేశాన్ని వినగలిగాడు. మహాకవులూ, వేదాం
తులూ చెప్పగలిగిన సందేశమే యీ లేఖలో,
వొకనీచకుటుంబంలోని స్త్రీ, ప్రేమతో ముచ్చ
టించకలిగింది. మనుష్య మంచిలోవున్న తమాషా
పొందాలంటే, అప్పుడప్పుడు చెడుగా ప్రవర్తించా
లంటాడు బ్రౌనింగ్. వెలిగిన జ్యోతిని, చేతులారా
ఆర్పుకోవాలంటాడు. సంఘానికి నీతినిగురించిన భావాలు
తప్ప నీతి లేదు. పురుషులకు ప్రేమనిగురించిన
భావాలుతప్ప నిజమైన ప్రేమ లేదు. ఆ ప్రేమని నిరా
కరించి, అనేక మాయకారణాలతో సమర్థించుకుంటారు.

వ్వును తనింటికి రప్పించుకోడానికి ధైర్యం లేకపోడా
కారణం, పదిమందీ యేమనుకుంటారో అన్నది
దు; దానికి కారణం అతని మనస్సే; అన్యులతో
యిన స్త్రీని, తను యెల్లా అంగీకరించగలడు? "విచిత్ర
క్తులు వారి అధరాలికి పట్టిన బూజును వాళ్ళరిరానికి
రారు. . "అని రాసి, దానికింద యెఱ్ఱసిరాతో గీత
డా గీసింది. ఆవాక్యమే అతనికి బాధ కలగజేసింది.
ర్యతో కలిసివున్నప్పుడు, చైట యెల్లాంటి రహస్య
వర్తనాలూ చెయ్యడానికి పురుషుడు వెరవడు. ఆ
దర్భంలో మనస్సులో, యేలోటూ, యే sentimen-
l scruple కనిపించదు. భార్యను వొదిలి దూరంగా
న్నప్పుడూ, లేక అసలు భార్యే లేనప్పుడు, పురుషుడు
డుగా ప్రవర్తించడానికి జంకుతాడు. కారణం?
ర్య వుందికదాఅని సంతుష్టిచెంది, సంఘనీతి అతని
ప్రవర్తనలని మన్నిస్తుంది. పురుషుడు తను స్త్రీలో
లే మానసిక స్వచ్ఛత, తనూ యెందుకు అలవరుచు
డు? చాలా irrational being. పువ్వు అన్నివిధాలా
కి కావాలి; సంఘాన్నికూడా పాటించదు! మల్లా
వ్వుపూర్వగాథ అంగీకారప్రైనది కాదు, irrational
eing...

జగన్నాథం యింతవరకు ప్రేమిస్తోన్నది
ప్రేమ' అనే ఆకారంలేని వొకభూతాన్ని. దాన్ని
రించి వాదవివాదాలు పెంచుకుంటున్నాడు. తన
హృదయంలో మూసుకున్న కన్ను తెరిచి యదార్థం పరి
లించాడు. అన్యులు చెప్పిన సందేశాలు, తర్కంలోకి
ప్ప ప్రత్యేక వ్యక్తులకు అన్వయించవు. తనకు తాను
ప్ప, యీలోకంలో యెవ్వరూ సహాయం చెయ్యరు.
ంప్సన్ సతిని వివాహమాడతానన్న ఎడ్వర్డుకి బ్రిటిష్
ంత్రాంగం ఏంసహాయం చేయకలిగింది? సింప్సన్‌కి
ార్యభర్త వున్నాడని రాజుకు తెలియదూ?
తను అమాయకుడా? అతను ఆమె పూర్వగాథ
రచి, మన్నించి, స్వీకరించలేదూ? ప్రేమకోసం పెద్ద
ద్ద సామ్రాజ్యాన్ని త్యాగంచేసినప్పుడు, తను, వొక
న్ని అర్థంలేని Sentimental scruple ని త్యాగం
య్యలేడూ? సింప్సన్‌లో బ్రిటిష్‌సామ్రాజ్య త్యాగా
కి సమానమైన నీతి ఎడ్వర్డ్‌కి కనిపించలేదూ? ఐదు

ఖండాలవారూ, టోపీలు దించి ఆ చర్యని ఆమోదించి చప్పట్లు కొట్టలేదూ?

వెంటనే, తక్షణం బయలుదేరి రావలసిందని కోరుతూ ఉత్తరం వ్రాశాడు జగన్నాథం. అందులో చివ్వరి వాక్యాలు: "నేను నీ పూర్వపు విషయాలు మన్నించి, మరచిపొయ్యాను. మనం, అనోన్యంగా..." ఎందుకో అగ్గిపుల్ల ముట్టించి, యీలేఖని, అంటించి వేశాడు. మరోలేఖ వ్రాశాడు. అందులో... "...నాకు యే ఆటంకమూ లేదు. అవన్నీ మరిచిపోతాను. నిన్ను యింకనుంచి సంశయించను. నా కూతురు విషయం మొదట్లో అనుమానించాను. ఇప్పుడది, పూనాలో చదువుతున్న విషయం మొన్న చెప్పాగా నీకు. దాని కిది బోధపడుతుంది. నీమనిషికి యేఅడ్డూ అది చెప్పదని నా నమ్మకం. నా కింక అన్యులనుగురించి ఆలోచించవలసిన అవసరం లేదు. ప్రస్తుతం, నాకు నువ్వు తప్ప వేరే అన్యులు లేరు. అదీ గాక, నా 'మనూ'లో పూర్తిగా నీపోలిక నాకు కనిపిస్తుంది. అది చాలు నానిమనస్సుని స్థాయిపరిచేందుకు ...... ఏదీ ఆనలాటిపువ్వు కేకలతో నామీద నృత్యం సాగించు... " ఇది కవర్లో పెట్టి అతి కించాడు. కాలి పోయిన ఉత్తరాలనుసి గాలిలో పడి. పీధులోకి ముక్కలు ముక్కలుగా యెగిరిపోయింది.

## 3

పోస్టుబంట్రోతు అందజేసిన ఉత్తరం తీసుకుని, హాలులో కుర్చీమీద కూర్చుంటుంది పువ్వు. గదిచాలా అలంకారంగా వుంది. గోడమీద జగన్నాథం తన భార్యతో తీసుకున్న "ఫోటోలూ, మనోరమది పెద్ద Enlargement, కొన్ని రవివర్మబొమ్మలూవున్నాయి, తను కుడుతోన్న చిరుసులాల్చీ బల్లమీద పెట్టి, 'నాన్' అని కేక పెట్టింది పువ్వు. నాన్ యీలవేసుకుంటూ, హాలులోకి ప్రవేశించి ఉయ్యాలబల్లమీద కూర్చుంటాడు.

"మనమనోరమ పూనానుండి ఉత్తరం రాసింది, నేను చదవనా?" అంది.

"ఏదీ యిల్లా యియ్యి. ఇంగ్లీషులో వ్రాసింది, నీ కేంతెలుస్తుంది?

"ఓ యబ్బ - చూడండి 'డియర్ ఫాదర్ యువర్ కైండ్ లెట్టర్ టు హేండ్ ప్లీస్...'-ఉండండి, చదవనియ్యండి"- ఇంతలో, అతను లేచి, ఉత్తరాన్ని, లాక్కొని చదువుకుంటాడు. పుష్ప అతనివెనకాల కూర్చొని, తొంగిచూస్తుంది. జగన్నాథం ఆవుత్తరం చదువుకుని మెల్లిగా నవ్వుతాడు.

"ఏమండీ, ఏమని రాసిందో చెప్పరూ? ఎందుకూ నవ్వుతున్నారు?"

"ఏమీ లేదు ఊరికే నే.."

"అంతా చిత్రమండీ మీది.. చెప్పరూ.."

"దానికి రూ. ౩౦ మనియార్డర్ పంపమం టుంది".

"అంతేనా మూడు పేజీల వుత్తరమూను ?"

"ఈ సెలవలకి, యిక్కడకు రాదుట...."

పుష్ప బిక్కమొహం వేసింది.

"వాళ్ల స్నేహితురాలితో గడుపుతుందిట, యీ సెలరోజులూ."

"తరవాత, నా విషయం యేమని రాసింది?"

జగన్నాథం నవ్వుతాడు- "నువ్వు చాలా మంచి దానవని రాసింది."

"ఊః వెడుదురూ మీవన్నీ మాయమాటలు. నే వున్నానని యిక్కడికి రావడం మానెయ్యలేదుకద" అని పుష్ప చీరకొంగు తనబొటనవ్రేలుకి చుట్టుకుంటుం ది. నాథ్ వుయ్యాలా దిగి, ఆమెబుజాలపై చేతు లానించి, ముందుకు తోస్తాడు.

"మీ హాస్యాలకేంగాని యేం వ్రాశిందో చెప్పండి."

"చెప్పాగా. నువ్వు నమ్మకపోతే యేంచెయ్యను? నువ్వు చాలా మంచిదానవనీ, నాకు చాలా సహాయ కారిగా వుంటావనీ, తనకి అందువల్ల చాలా సంతోషంగా వుందనీ, నిన్ను చూడాలని, నీచేతిఅన్నం తినాలని మరీమరీ వుందనీ—వొక టేమిటి, యీవుత్తరం అంతా నిన్నుగురించి స్తోత్రమే..."

అతన్నికూడా ఉయ్యాలాపైకి లాగింది.

౪

అవి వేసంగిశెలవలు. ఆ రోజుమధ్యాహ్న
మూడుగంటలబండిలో, తనస్నేహితుడుతో కలి
పూనానుంచి వస్తున్నానని మనోరమ ఉత్తర
వ్రాసింది. గోడలకి వెల్లవేసి, ఇల్లంతా అలంకరిం
డంలో మూడురోజులు జరిగిపోయాయి. ఆ ఉదయ
తలకి స్నానంచేసి కొత్తదుస్తులు ధరించుకుని, గో
నున్న తనఫోటోముందు నిలబడి, కేలండర్లో పా
పడ్డదివాల కాగితాలు చింపుతోంది పుష్ప. ఆ రోజ
అలంకారం మార్చింది. మధ్యపాపిడి తీసి కళ్లమీ
పొడిగా పడుతున్న ముంగురులూ, అలంకారా
తీసేసిన చెవులు, పెద్దకుంకుమబొట్టు, నాలుగంగుళా
వెడల్పుగల నల్లంచు సాదాఖద్దరుచీర, అదేరంగు
గళ్లజాకెట్టు, వొంకరగా మెలితిప్పి కట్టిన సిగమీ
అప్పుడే తామరపద్మంలో మొలుచుకొచ్చిన మ
బ్రహ్మలా అమర్చబడ్డ రెండు చామంతిపువ్వుల మ
నున్న గులాబిపువ్వుం — మొత్తంమీద, సివిలైజ్
శకుంతలలాగ వుంది.

జగన్నాథం వెనకాలె వెళ్లి, పుష్పనేత్రాలు
చేతులతో మూశాడు. "ఎవరు చెప్పుకో ?"

"కాబోయే అత్తగారిప్రియుడు, లేక డార్లిం
అని చేతులు తొలగించి, వెనక్కి తిరిగి, చెక్కి
అతనిపెదవులకు తగిల్చింది.

"చాలా అర్థంతీశావే ?" అన్నాడు.

"మీరే చెప్పారుగా, మనోరమ వొక ఫ్రెండ్
తీసుకొస్తోందని. ఫ్రెండు, మీ రంగీకరిస్తే రా
నేపులో లవర్ గా అవడు ? అల్లాంటప్పుడు
అత్తగార్ని కాను... ?"

నాథ్, యీచమత్కారానికి నవ్వుకున్నా

"ఇవాళ చాలాయింపుగా వున్నావు"

"కాదు, మీమనస్సు యింపుగా మారింది. వ
రోజురోజు, యీప్రపంచం, వింతగాను, సుందరంగా
కనిపించడంలేదూ? కన్నీటిసముద్రం యీది, యిద్ద
వొడ్డుకి చేరుకున్నాం. మనగృహంలోకి, యి

ద్దులుపసిపాపలు ప్రవేశించి, ప్రేమరాజ్యం యేలుతో తున్నారు. నేను తల్లిగా వుండదలచుకున్న కోరిక ఫల్యం కాబోతోంది. అత్తనికూడా కాబోతున్నాను. జీవితం సఫలం కాబోతోంది. దైవానికీ మీకూ నానమ స్కారాలు. నా కింక మృత్యువంటే భయంలేదు..." కిటికీలోంచి చూస్తూ మాట్లాడింది పుష్ప. నాథ్ క్కాల నిలబడి ముంగురులను సవిరిస్తున్నాడు.

"ఏం పుష్పా, యివాళ వేదాంతంలో పడ్డావ్ మహా ఇరవైమంది పిల్లలుగల వృద్ధురాలుగా మాట్లా తున్నావే..."

"కాకమనం చిన్నవాళ్లంటండీ. నిన్న లెక్క ట్టాను. నాతలలో అప్పుడే ఇరవై నాలుగు నెరిసిన ంద్రుకలు కనిపించాయి. నవ్వినప్పుడు కళ్లకింద గీతలు కున్నాయి. కాని అన్యోన్యంతో నిండిన మన హృదయాలింకా లేతవే..."అని, 'కాదు?' అన్నట్లుగా హం చిట్లిస్తుంది. అత నేదో చెయ్యబోతాడు.

"అబ్బ వుండండి — చూడండి నాగుండెలు తోషంతో యిల్లా గొడవగా కొట్టుకుంటు న్నాయో?"

"దీనికేంగాని, యివాళ వేదాంతంలో పడ్డావే."

"ఏమో కింకా తెలీదుకాబోలు. ఈమధ్య రోజూ రు అవతలికి వెళ్లగానే, భగవద్గీత చదవడం మొద ట్టాను. ఆపుస్తకం యెవరు వ్రాశారోగాని, భలేగా రారండి. అన్నీ నే అనుకున్న సంగతులే. అది రాసి యనికి, మనం చేతులు జోడించొచ్చు..."

"అది శ్రీకృష్ణపరమాత్మ రాశాడు..."

ఆ, వొట్టిది. అన్నీ దొంగమాటలు. దేముడు కోసం, చదువుకోండి నాయనా అని పుస్తకం స్తాడా! అనేకకష్టాలు పడి, మంచి పేర్చుకున్న వాళ్లు , యెప్పుడూ మంచిగావున్న దేముడు రాస్తాడా, నమ్మను.మీరిన్ని చెత్తపుస్తకాలుచదువుతారుకాని, దెప్పుడేనా చదివారు? దానికిమాత్రం, 'వేదాంతం' పేరుపెట్టారు. వేదాంతం గాలిలో వుంటుందా? మనుష్యులకు అర్థంకాని ప్రతిదానికి 'వేదాంతం'అని పేరుపెడతారా? అది పెద్దపెద్ద పండితులు కొట్లాడుకో డానికితప్ప మనబోటివాండ్లకు అర్థం యెందుకు కాదు..." ఇంకా యేదో చెప్పబోతుంటే, గోడనున్న పుష్పఫోటో క్రిందపడి, అద్దం పగిలి పెద్దచప్పుడవు తుంది.

"వెనకవెలిక దారాన్ని కొరికేసింది" అనుకుని పగిలిన గాజుముక్కలని అవతల పారేసి, వొట్టిపటాన్ని అలమార్లో దాస్తుంది పుష్ప. జగన్నాథానికి యిది జరగడం, అశుభంగా తోచి, విచారం కలుగుతుంది.

"పడకపడక నీఫోటోయే పడాలి — చూడు నా గుండెలు ఆగిపోయాయి" అన్నాడు.

"పోనిద్దురు, వెనకపటం, శరీరాలే శాశ్వతంకావు ప్పుడు. దీనికోసం, మనం దైవాన్ని దూషించకూడదు. వాది అసలు 'నాస్ లై సెన్స్ క్రీడ్' అంటే గాంధీ గారి తత్వమన్నమాట..." అంది పుష్ప అద్దంలో చూచుకుంటూ.

"నాస్ లై సెన్స్ కాదు. నాన్ వైలెన్స్ క్రీడ్."

"ఏదో వొకటి - అబ్బ వొదలండి కొంను, యింట్లో కల్లి పూరీలు వొత్తాలి..." అని లోపలికి నిష్క్రమించింది.

* * *

మూడుగంటల బండిలో, మనోరమ, స్నేహితుడు దిగుతారు. జట్కాదగ్గరకు వెళ్లి నిలబడ్డాడు నాథ్ ఆహ్వానించే నిమిత్తం. పుష్ప వీధిగుమ్మంలో నిలబడింది. సామాన్లన్నీ హాల్లోకి చేరేశారు. అంతా తలోకుర్చీలోను కూర్చున్నారు. పుష్ప గదిగుమ్మంలో తలుపువెనకాల నిలబడింది.

మనోరమలో కొంత పుష్పపోలిక వుండడం నిజమే. కళ్లల్లో నాథ్ తాలూకు లేలతనం కూడా వుంది. బుగ్గవున్న చిన్నమచ్చతప్ప విశేషించి చెప్పదగ్గదేమీ లేదు.

"నాన్నగారు! ఇతనే నాక్లాస్‌మేట్, యెండ్, ఫ్రెండ్, రంగనాథ్. వీరి తండ్రిగారు పార్వతీపురంలో హెడ్‌మాస్టర్. మొన్న క్రిస్టమస్‌లో, వీళ్లవూళ్లో వారంరోజులు గడిపాను."

"నాకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు జగన్నాథం. ఇంతలో పళ్ళెంలో పూరీలు ప్లేట్లలో అమర్చి, బల్లమీద పెట్టింది పుష్ప.

"మన పుష్పమ్మ వొంట్లో ఖులాసాగా వుంటోందా?" అంది మనోరమ పుష్పకేసి చూస్తూ.

"ఆ. మే మిద్దరం, చాలా సుఖంగానే వుంటున్నాం. క్రిస్టమస్‌కి నువ్వు రాలేదని చెప్పి, వారు చాలా యిదయ్యారు. వీలుపడలేదు కాని, మే మిద్దరం నీదగ్గఱకే వొద్దామని బయలుదేరాం కూడాను" అంటూ రంగనాథుని పరకాయించి చూస్తుంది పుష్ప.

కాసేపు ముచ్చటు, కాలేజీవిషయాలు, రాజకీయాలు ప్రసంగించి, కాఫీ తాగి కిళ్లీలు బిగించారు. రంగనాథ్ ముఖవర్చస్సు సాధారణమైనదైనా, సూటుబూటు చాలా హడావుడిగా వుంటాడు. ఇరవై రెండేండ్లే నంటాడుకాని, పాతికపైమాటేనని చెప్పాలి. మొత్తంమీద బాగా రాపిడి తగిలిన శరీరంలాగే కనిపిస్తుంది. మొదట్లో కొంచెం ఖులాసాగా మాట్లాడ కలిగినా, చివ్వరికి మౌనం దాల్చి, యేదో తెంగ పక్షవానివలె, పరాకుగా మాట్లాడ్డం మొదలెట్టాడు.

స్నానాలు చేసి, కొత్తబట్టలు ధరించి, మనోరమ, తన స్నేహితుడితో, తోటలోకి షికారుకని వెళ్లింది. పుష్ప తలకాయ నొప్పిగా వుందన్న నెపంమీద జగన్నాథాన్ని కూడ, వెళ్లకుండా యింట్లోనే ఆపుచేసింది. వాళ్లు అవతలి కెళ్లింతర్వాత, వీధితలుపు ఘడియేసి నాథ్ దగ్గరగా కుర్చీ లాక్కుని కూచుంది.

"ఏమండీ, యితనేనా, మనోరమ ప్రియుడు?" అంది అతిమెల్లగా.

"ఇతనే - బాగానే ఉన్నాడు కాదు? తెలివైనవాడిలాగే కనిపిస్తుంది..."

"ఇతని పేరు?"

"విన్నావుగా, 'రంగనాథ్‌ట'; బహుశా యే రంగనాథరావో అయివుంటాడు."

"ఏమో వాడితలకాయ నాథ్—నా కేమీ నచ్చలేదు, వాడివరస. కళ్లల్లో కపటం, మాయా, కనిపించాయి. పైగా మన 'మను' చాలా తెలివి, సుకు —యీదౌర్భాగ్యుడికి కివ్వడం రేమిటి — వీడి చూస్తే, తోగంకొంపల్లో తిరిగేవాడులా వున్నాడు.

"ఏం అతనిమీద పట్టించావ్, నాక్లోచ్చి, ఘ కాలేదు."

పుష్ప అతనివెంపు కింకా దగ్గఱగా జరిగి, హస్తాన్ని తనఅరచేతులో వుంచుకుని

"మీరు నన్ను విశ్వసిస్తారుకాదు?"

"అందుకు సాక్షి" అని, ఆమెను ముద్దెట్ బోతాడు.

"అబ్బ, వుండండి... అవుతే, నే చెప్పి చేస్తారు..."

"మంచిదని తోస్తే అల్లాగే."

"అల్లాగైతే, మన 'మను'ని యితని సంపర్ నుండి తొలిగించాలి..."

"కారణం" అంటాడు, ఆశ్చర్యంతో.

"చాలా వుంది. నాచేత చెప్పించకండి; అ జరిగిపోయిన విషయాలు; మనం యింతవరకూ మరిచి గలిగిన, చెడుసంభవాలు... నానోటంట, ఆపా రానియ్యకండి— నే వుత్తరంలో రాసి కింద గీత బూజుపట్టిన అధరాలూ, విచిత్రవ్యక్తులూ జ్ఞా వున్నాయా... అంతే..."

ఈసంగతి విని, జగన్నాథం నేత్రాలు మూ గుని, వెనక్కి వొరిగిపోయాడు. అతనిముఖాన్ని చేతులలో తీసుకుని, సమదాయించడం మొదలెట్ పుష్ప. కొంతసేపటికి కండ్లు తెరిచాడు.

"నీతో... అతను..."

"అవును; వొద్దు, పూర్తిగా అనకండి. నే మీరుకూడా మర్చిపోయ్యాం. మనమనుని, దుర్మార్గుడికి దూరంచేసి తొలిగించాలి... మీరు, తక్కరంగా చెప్పండి."

* * *

రాత్రి తొమ్మిదింటికి అంతా భోజనాలు చేశా కాసేపు కబుర్లు, గ్రామఫోన్ సంగీతం, అయింతరా

...లో అమర్చబడ్డ, మంచంమీదికి నడుస్తాడు రంగ... పుష్ప వంటింట్లో వుంటుంది. జగన్నాథం ...ర్ని, తనపడకగదిలోకి తీసికెళ్లి, రహస్యంగా ...డుతాడు. మొదట, తనకి రంగనాథ్ వ్యవహారం ...లేదనీ, అతనికీ ఆమెకీ యీడూ జోడూ కాదనీ, ...ంగా, ఆతనిపైఖరి పుష్పకికూడా నచ్చలేదనీ ...డు.

"నాన్నగారు! మీరు ఆవిడమాటలు పట్టుకుని, ...ి అల్లా దూషించడం భావ్యంకాదు. ఒకవేళ, ...వర్ణించినట్టుగానే, రంగనాథ్ వెధవైనా, మీ రిం... ఆటంకపెట్టడంలో న్యాయంలేదు. మాయిరువురి ...నిగురించి మీకు యిదివరకే ఉత్తరంలో రాశాను. ...చించండి. పదిమందితోనూ తిరిగిన, ఒక నీచ ...లో దానిమాట లట్టుకుని, మాపవిత్రప్రేమని నిందిం..." మనోరమ, కళ్లు కోపంతో ఎఱ్ఱపడతాయి.

"అది కాదు 'మనూ' నీకు చిన్నతనం. పుష్ప ...ందితో తిరిగినా, యిప్పటికైనా, జ్ఞానం సంపా..., సరిగ్గా వుండగలిగింది. దానిహృదయం, యెంత ...దరమైనదో నువ్వెరగవు. మీరంగనాథ్ విషయం ...కి తెలియకపోలేదు. అది నీమంచికోరే ...ంది సలహా— దాన్నల్లా అన్నానని తెలిస్తే అది ...హత్య చేసుకుంటుంది. అది పిల్లలు లేకపోయినా, ...గా ప్రేమించకలిగిన వైరాగ్యం పొందింది..."

"చాల్లెండి నాన్నా! అన్నీ జరిగింతర్వాత, ఉప...పాలంతో యిస్తారు. ఆ దిట్టా యితనిమీద నేరాలు ..., మమ్మల్ని విడగొట్టాలన్న ప్రయత్నంలో మీ ...మైండెడ్ నెస్, దాని నీచమైన యీర్ష్యాభావం ...స్తున్నాయి. 'శునకమును కనకపుసింహాసనము' అన్న ...ం మీకు జ్ఞాపకం వుందా...... నాకు బడలికగా ...ది. నే పడతాను. ఇల్లాంటి యీవిల్ థాట్సు, ...లో ప్రవేశపెట్టకండి..." అని హాలులో ఉయ్యా...ద అమర్చబడ్డ పక్కమీద పడుండి దీపంతగ్గించింది.

* * *

వంటిల్లు సర్దుకుని పుష్ప పడకగదిలోకి వొచ్చే...డికి పడకొండు కొట్టింది. తలుపువేసి, దీపం తగ్గించి పక్కమీదికి చేరింది. ఇద్దరు అతిరహస్యంగా మాట్లాడారు.

"ఏమండీ, యేమంటి ?"

"చాలా చెప్పాను, లాభం లేకపోయింది. మన మేం చేస్తాం దానికర్మ దాంది: నువ్వంతగా విచారించకు."

"కర్మ గిర్మ అనకండి. మనం కళ్లారా చూస్తూ, మన 'మనూ' పవిత్రతకి భంగంకలుగుతుంటే వూరుకుంటామా? ఆవెధవ మీరు నేను ప్రేమతో కట్టుకున్న యింట్లో, ఇల్లరికం వుంటోంటే చూసి నేను సహించగలనా? వాడితలంపే, నామనస్సులో ఉప్పెన లేవదీసిందే. అల్లాంటిది, పండంటి 'మను'ని నే సహించలేను.... దానివల్ల మీ కెంత బాధ కలుగుతుందో నే ఊహించలేను. మన ప్రేమమధ్య వాడి బింబంపడి మననీ ప్రేమనీ, లోకాన్నీ అపవిత్రంగా చేస్తుంది... నే భరించ లేను..." అని మెల్లగా యేడ్పు మొదలిడుతుంది. చేతనైనంతవరకు, పాపం, జగన్నాథం ఓదారుస్తాడు. నిజానికి పుష్పకంటె, అతనికే యీ విషయం విషాదకరమైంది. కాని యిప్పుడతడు ప్రేమకీ, నీతికీ కూడా అతీతు డయ్యాడు. శరీరంలో జనించిన ప్రేమ విశ్వరూపం దాల్చింది. అల్లాగే ఆమెచేతిని తన గుండెలమీద అదుముకుని విచారంలోంచి, అతను తన జీవితదృష్టిని వెలుగులోకి నడిపించి, కండ్లు మూసి, నిద్రలోకి జారిపోయాడు.

* * *

రాత్రి రెండు గంటలు దాటింది. పుష్ప లేచి మెల్లగా తన హస్తాన్ని అతని శరీరంమీదనుంచి తొలగించి, నుదురుమీద విషాదంతో వొణుకుతున్న తన అధరాలను కొసేపు ఆనించి, పాదాలకి నమస్కారం చేసి, టేబిల్ దగ్గరకెళ్లి తొందరగా వుత్తరం రాసి, పక్కగదిలోకి వెళ్లింది. రంగనాథ్ లుంగీతో నిద్రపోతున్నాడు. దీపాన్ని కొంచెం పెద్దదిచేసి అతని భుజాలట్టుకుని కుంజింది. భంగారుపడి లేచాడు. దీపం పైకెత్తి చూపింది. అతనుకొయ్యబారిపొయ్యాడు.

"జ్ఞాపకంవున్నానా, నేను... మళ్లా యిక్కడ చేరావా? ఇప్పుడు మనోరమని మోసం చెయ్యడానికి

నాటు బూటు వేసుకుని, మాకొంపతియ్యడానికి చక్కావొచ్చావా ?" అంది పెదవులను కోపంతో ఆడిస్తూ.

"నోర్మూయ్యి తెగవేల్తున్నావు ... నువ్వు రా లేదు మళ్లా జగన్నాథం కొంప తియ్యడానికి? అల్లాగే- నేను. నువ్వు పదికొంపలు తీస్తే నే వొకదానితో నే సంతుష్టిపడతాను...ఇల్లా రొయింగుకొచ్చావ్ అర్థరాత్రి? పాతబాకీ యేమన్నా వుందా...వుంటే, ముద్దుకి వొక రూపాయిచొప్పు నిస్తాను" అని వెకిలిగా నవ్వుతాడు. పువ్వు కోపం పట్టలేక మొహంమ్మీద వుమ్మేస్తుంది. దానికి సమాధానంగా అతను ముద్దుకోసం మూతి పెట్టుకుని పెనగులాడుతాడు. బైట పెద్దగాలీవానవల్ల యీ గందరగోళం లోపలవాళ్లకి వినిపించడంలేదు. రెండు మూడు నిమిషాలు ఇద్దఱు పెనగులాడతారు. తన అధరాలనిమాత్రం పువ్వు అతనికి అందనియ్యడంలేదు. ఆమెను సాధించడానికతను తీవ్రంగా ప్రయత్నిస్తూనేవున్నాడు. వాళ్ల కాళ్లు తగిలి దీపంకూడా క్రిందపడి పగిలింది. ఆఖరికి, పువ్వు, తనపళ్లతో అతనిబుగ్గని గట్టిగా పట్టుకుని కొరికింది. నాలుగైదు నిమిషాలదాకా పట్టు విడవలేదు. రంగనాథ్ "అయ్యో, అయ్యో" అని కేకలు పెట్టాడు. వాల్లో లేచినట్లు చప్పుడయింది. పువ్వు పట్టు వొదిలి వీధిలోకి పరిగెత్తుకు పోయింది.

మనోరమ లేచి యేమిటో మాద్దామని గది ముందుకు వొచ్చి "నాథ్" అని పిలిచింది. 'నాథ్' మూలుగుతున్నాడు. దీపం తీసుకొచ్చి, అతనిముఖం మీదికి చూపించింది. కుడిబుగ్గ ఎఱ్ఱగా లోతైన పెద్దగాట్లతో నిండివుంది. రక్తం ధారకింద కారిపోతోంది.

ఇంతలో జగన్నాథంకూడా లేచాడు, బల్లమీద ఉత్తరం కనిపించింది.

"నే యెన్నడూ మర్చిపోని దైవం జగన్నాథం గారికి పువ్వు కడసారి సందేశం.

"నేను జరిగిపోయిన చెడ్డసంగతులన్నీ మరిచిపోదామని చాలా ప్రయత్నించాను. కాని ఫలం లేకపోయింది. పాడుపురుషులు మరిచిపోదామన్నా మరుపు
రారు. నాస్వర్గంలోకి వొక సజీవుడైన పాపి ప్రవే
చాడు. ఆస్వర్గాన్ని ఆపాపికే వొదిలి నే శెలవు తీ
కున్నాను. ఇంతవరకూ జీవితం, నాకు పెద్ద సమస్య
తోచింది. కాని, నే మరణించిన తర్వాతైనా, నే
జీవితానికి పెద్దసమస్యలా తోస్తానని నాఆశయం.
కేలాంటి విచారం లేదు. జీవితంలో అనేకమృత్యువు
అనుభవించాను. వాటికి నే విచారించను. నిజం
వాటిల్లో మరిచిపోదగ్గ ఘోరాలు యేమీ లేవు. ఏ
మందిమార్గంలో పడదామని ప్రతి అల్పప్రాణీ ప్ర
త్నం చేస్తూనేవుంటుంది. నాబోటి కొందరు గెలుస్తా
కొందరు అధైర్యపడతారు. మీరూ యేటెంగా పె
కోవొద్దు. జీవితాన్ని అన్నితప్పులతోనూ కష్టాలతోన
వున్నపాళంగా అంగీకరించాలి. మనం యీ ఆన
మయ ప్రపంచంలో జన్మించినందుకే దైవానికి కృత
లమై వుండాలి. దేటినీ దేన్నీ త్రృణీకరించి నిరసిం
కూడదు. అదే నాసందేశం. ప్రత్యేకంగా లోకా
నా దో చిన్న సందేశం వుంది. ఒకవ్యక్తిమానం, స్వచ్
సౌందర్యం దుర్నీతిపాలుకాకుండా కాపాడగలిగా

నా అనుభవం పూరికే పోలేదు. ఒక్క వ్యక్తి
కాపాడకలిగాను. నా స్త్రీజాతికి చెందిన వొక
కోసం, నే చేసినత్యాగం, అవినీతికరమైన అనుభవ
నుండి జనించిందైనా లోకం క్షేమింపదగిందే.
విశ్వ బ్రతికివున్నంతవరకూ, నాత్యాగం, వాడిబు
మీదే అందరికీ కనిపిస్తుంది."

* * * *

రంగనాథ్ ఆ మర్నాడు కట్లు కట్టుకుని,
వూళ్లోంచి వెళ్లి పోయాడు. సాయంకాలం "మన
తండ్రిదగ్గఱ కొచ్చింది.

"నాన్నా! నేను నిన్నన్న మాటలకి నన
క్షమించండి. పువ్వుహృదయం గొప్పది."

"దానిహృదయం కాదు; అది, నేను మరి
పోయిన అనుభవాలు, దాని హృదయానికి గొప్పత
కలిగించాయి" అన్నాడు జగన్నాథం.

అద్దం కట్టిన పువ్వుఫోటోని, "మను" గోడమీ
తగిల్చింది.

# అధునిక ఆర్థిక జీవనము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

పదునెనిమిదవ శతాబ్దమునుండి ఆర్థిక ...గా నౌన్నత్యస్థితి నందిన వివిధదేశ ...లలో ఇంగ్లాండుదేశము తలమానిక మని ...ఁపవచ్చును. దీనికిఁ గారణము ఆవిరియంత్ర ...ర్మాణము, తదుపయోగము నాదేశమునఁ ...నఁగొనఁబడుటయు, తద్ద్వారా అధునిక ...రిశ్రామికయుగ మవతరించి, యాదేశము ... జనజీవముల నొసఁగుటయును.

ఈవిధముగా, నాధునికార్థికౌన్నతి నం... దేశములలో నుత్తమశ్రేణికిఁ జెందిన ఇం...ండు దేశమును జర్మనీదేశ మనుకరింప ...డఁగినది. అమెరికాదేశముసైతము జర్మనీ ...ఁబాటు తన ఆర్థికజీవనమున బ్రిటను ...ార్గమునే యనుసరింపఁజొచ్చినది. నేఁడీ ...ాఁడు దేశములును ఆర్థికౌన్నత్యమున ...న్యత్తమశ్రేణి నలంకరించినవి. ఫ్రాన్సు ...శముకూడ పైమూఁడు దేశములను అనుక...చుచునేయున్నను, కొంచెము వెనుకఁబడి ...ాత్ర ముండెను. వీనితో సుమారు సమాన...నమైనను, చిన్నదేశము లగుటచే పైకి ...లేకపోయిన దేశములు స్విట్జర్లాండు, బెల్జి...మ్, నార్వే, స్వీడనులు. జపాను, రష్యా, ...లీదేశములు మధ్యమశ్రేణికిఁ జెందినవి. ...క్, బాల్కను, ఇండియా మొదలగు ...శములు నానాటికి దినదినాభివృద్ధి నందు...నేయున్నవి, కాని, ఒకనాఁడు ఆర్థికాభి...వృద్ధివిషయమున వెనుకబడిన దేశములు ...జేయొకనాఁడు ముందుముందుకు వచ్చుటయు, ఉన్నతస్థితిలో నున్న దేశములు వెనుకఁబడుచుండుటయుఁ జూడనగును. ౧౮౭౫-వ సంవత్సరములో ఇగ్లాండునకు తీసికట్టుగా నున్న జర్మనీదేశము ౧౯౧౪-వ వత్సరము నాఁటికి ఇంగ్లాండుతో సమానమై, దానిని త్రోసి రాజనఁజాలియున్నది. ఇదేవిధముగా, జపాను, రష్యా దేశములు మొదట వెనుకబడియున్నను క్రమక్రమముగా ఆర్థికోన్నతి నందగలిగియే యున్నవి.

అధునికార్థిక జీవనమునకును ప్రాచీనార్థిక జీవనమునకును, అనేకములగు వ్యత్యాసము లున్నవి. అధునికజీవనమునందలి ప్రధానధర్మములలో కొన్ని యాక్రింద పరిశీలింపబడును.

## ౧. ప్రకృతిశక్తుల యుపయోగము.

మానవశక్తిని సాధ్య మైనంతవఱకు తక్కువ ఉపయోగించి, దానికిబదులు ప్రకృతిశక్తుల నెక్కువగా నుపయోగించి, వస్తుసంపదఁ బెంచి, ప్రజాసామాన్యమునకు సులభముగా నందఁజేయుటే అధునికయుగము చేయు ప్రయత్నము. ఆవిరియంత్రమును గనుగొనుటతో నిది ప్రారంభమైనది. తదుపరి, క్రమక్రమముగా విద్యుచ్ఛక్తి, పెట్రోలు, మొదలగువాని యుపయోగములతో ఈ ప్రయత్నము సఫలము కాఁజొచ్చినది.

౨ చిన్న వస్తువులనుండి పెద్ద యుపయోగము నందుట.

మానవునకుఁగల వివిధములగు వాంఛలకు సంసిద్ధికలుగుటకై, ప్రకృతిని వశమొనర్చుకొని, దాని నొక సేవకునిరీతి నుపయోగించుకొనుచుండుటయే నేఁటిమానవులు ప్రకృతిపై సంపాదించిన యాధిక్యము. అందుచే ప్రకృతిశక్తులను అన్నిపనులందును ఉపయోగించుటయేగాక, మానవుఁడు, చిన్నచిన్న ముడిపదార్థములనుండి సాధ్యమైనంత యధికమగు నుపయోగమును పొందుచున్నాడు. ఆధునిక శాస్త్రజ్ఞుల ప్రజ్ఞావిశేషముచే, మన తాతముత్తాతలు తలఁచియెఱుఁగని వివిధ మార్గములలో వివిధవస్తువులను తయారు చేయుటకు ఎందునకు పనికిరాదని పారవేయు ముడిపదార్థములను ఉపయోగించుచున్నారు. బొగ్గునుండి పలురకముల రంగుపదార్థములను, కఱ్ఱగుజ్జునుండి సిల్కు మొదలగునవానిని తయారుచేయుచున్నారు. ఈవిధముగా, ఆధునిక పారిశ్రామికులకు, ఉపయోగింపని వస్తువుగాని, పారవేయఁదగు ముడిపదార్థముకాని లేదు.

౩. పోటీ (Competition)

ఆధునికపారిశ్రామిక జీవనమున పోటీ మంచిస్థాన మాక్రమించియున్నది. ప్రస్తుత ప్రపంచమున, బహుళములును, పలువిధములునగు పరిశ్రమలసంఖ్య యనల్పము. ఒక్కొక్కదేశమున, ఒక్కొక్కపరిశ్రమను వివిధములగు సంఘములు (Companies) నడపుచున్నవి. అందుచే ఈవివిధ సంఘములకు, అవి తయారుచేసినవస్తువిక్రయవిషయమున స్పర్థలు బయలుదేరుచుండును. ౧౯౧౪—౧౮ మహాయుద్ధానంతరము పారిశ్రామికముగా పెఱుగుచు, ఇదివఱల వెనుకఁబడియున్న దేశములమూలమున పోటీ అధికమగుచున్నది. కార్మికులలోన పెట్టుబడిదారులలోను, వివిధదేశములలో, కార్మికుల కొకవైపునను, పెట్టుబడిదారుల ఒకవైపునకూడ ఈపోటీ అత్యంతము పెరుగుచునేయున్నది.

౪. వివిధములగు సహకారములు:— అంతర్జాతీయ సహకారము

ఆధునిక ఆర్థికజీవనమున సహకారమ కధికస్థాన మున్నది. కార్మికు లెల్లరు కార్మి సంఘములుగా నేర్పడుచుండుట మన చూచుచున్న విషయమే. పెద్దపెద్ద శ్రమలు పోటీముఖమున నష్టముపొం నాశనమగుస్థితిలో నున్నపుడు, జాతీయస కారమేకాక, అంతర్జాతీయ సహకార కూడ ఏర్పరచుకొనుచుండును. వివిధముల దేశములు వివిధములగు నార్థికసమస్యా ష్కారములకై అంతర్జాతీయ సహకారము పొందుట నేఁడు మనము చూచుచు యున్నాము. నేఁడు మచ్చఁగన్న నానాజ సమితికూడ ఆర్థికసహకారము (Econom Co-operation)క్రిందనే వచ్చును. ౧౯౨౦, ౧౯౨౨, ౧౯౩౩ సంవత్సరములలో జరిగి అంతర్జాతీయ ధనవిషయ మహాసభ ౧౯౨౭ లో జరిగిన జనసంఖ్య కాంగ్రె మహాసభ (World Congress on Populatio మొదలైనవి అంతర్జాతీయసహకారములే.

౫. యంత్రముల అత్యంతోపయోగము

ఆధునికయుగ మొక యంత్రయుగమ నేఁటి యంత్రశాలలో, ప్రతివస్తువు యంత్రములమూలముననే తయార చున్నది. నేఁడు వెలువడు దినపత్రిక

సంత్రములచేతనే తయారై మనకు కొలది
ంటలలోననే వచ్చుచున్నవికదా! ఈ యం
త్రములు పనిచేయుతరి, మానవుఁడు చేతితో
చేయువలసినది ఒక యంత్రమునందు వస్తువు
ముడిపదార్థములనుంచి, తుది యంత్రము
నుండి తయారైనవస్తువును దీయుటే. నేఁడు
క్రమక్రమముగా విద్యుచ్ఛక్తి యంత్రములను
త్యంతోపయోగకరముగా నడుపుచున్నా
. ప్రాఁతయంత్రములశక్తిఁ గూడ నధికము
యుచున్నారు. ప్రతిపెద్ద దేశమునందును
యంత్రనిర్మాణ పరిశ్రమ మిక్కిలి పేరుకాంచి
చినది. జర్మనీదేశమునందలి యంత్రనిర్మాణ
పరిశ్రమ ప్రపంచపరిశ్రమలలో మూఁడవది.
ది ౧౬ లక్షల కార్మికుల నుపయోగించు
ందును. జాతీయరక్తమును పరిశుభ్రపరచు
కు యంత్రములే దివ్యౌషధములు. ఒక
శము ఉపయోగించు యంత్రబాహుళ్య
నుబట్టి, ఆ దేశముయొక్క శక్తి, ప్రాబల్య
ములను గ్రహింపవచ్చును.

౬. బహుళసంపద్వృద్ధి పరిశ్రమవిభాగము

పరిశ్రమవిభాగముచేతను, ఆదినుండి
దివఱకు యంత్రసహాయమున్ననూ అధిక
గు పెట్టుబడిచేతను వస్తుసంపద నత్యధి
ముచేయుచున్నారు. పోటీని చంపుటకును
స్తువిక్రయాధికారము నందుటకును వివిధ
ములగు కంపెనీలు వస్తువులను తయారు
యుటయందును, బజారులో ప్రవేశపెట్టుట
యందును, కలిసి పనిచేయుచు అత్యధిక
ముగా నుత్పత్తి చేసిన వస్తువులవలన లబ్ధిని
ందుచున్నవి. ఈపద్ధతినే 'ట్రస్టిఫికేషన్'
ందురు. ఈపద్ధతి యున్నతస్థితిలో నున్న
తి దేశమునందును గానవగును. వీని కుదా
రణముగా జర్మనీదేశమందలి 'పకర్టు
యూనియను'ను దీసికొనవచ్చును. అమెరికా
బ్రిటను మొదలగు దేశములనుండి యనే
కము లగు దృష్టాంతములఁ జూడవచ్చును.

ఈ ట్రస్టిఫికేషన్ వలన ధరలు తక్కు
వగుట, పారిశ్రామిక సంక్షోభమును చల్లా
ర్చుట మొదలగు నుపయోగము లున్నను
ఇవి ఆర్థికరాజ్యమును స్థాపించి ధర లధికము
చేయుట, కాలక్రమమున నిర్మాణశక్తుల
నుడుగఁజేయుట మొదలగు చెడుగులను
కూడ తెచ్చిపెట్టుచుండును. కాని క్రమక్రమ
ముగా నిందలి చెడుగులను పోగొట్టి ఉప
యోగముల నందుట కధిక ప్రయత్నములు
జరుగుచునే యున్నవి.

౭. ఆధునిక వస్తునిర్మాణపద్ధతులందలి
యన్యోన్య సంబంధములు

వివిధములగు సాధనముల సహాయమున
వస్తువృద్ధి కలుగుచున్నది. (౧) సాంకేతిక
ధర్మము: దీనివలన తయారుచేసినవస్తువులను
మఱియొక విధమగు వస్తువులుగా మార్చుచు
పనికిరాని ముడిపదార్థము లనునవి లేకుండ
జేయుట; (౨) వర్తకధర్మము: ఇందు అమ్మ
కము, కొనుబడి, వినిమయము మొదలగునవి
యుచితరీతిని జరుగును; (3) ఆర్థికధర్మము:
ఒకవిధమగు వస్తువులను దయారుచేయుటకు
ఎంతయో పెట్టుబడిధనము సంపాదించుటకు
గాను వివిధములగు నాకర్షణములు చూ
పుట మొదలగునవి ఇందు జరుగును; (౪)
భీమా: వస్తువులయొక్కయు,
మనుష్యులయొక్కయు జాగరూకత యావ
శ్యకము. రద్దు, నష్టము, నాశనము మొద
లగునవి జరుగకుండా వస్తువులను, కార్మికుల
జీతములను రక్షించుటకును, వారి వివిధము

లగు దుస్థితులను, (ప్రమాదము, వృద్ధాప్యము, మరణము) రూపుమాపుటకును భీమా యెంతయు నావశ్యకముగా నున్నది; (౫) జమాఖర్చులు: ఎప్పటి కప్పు డున్న కార్మికుల జీతములు, వస్తువుల ధరలు, వస్తువుల చేయుటకగు తక్కువ ఖర్చులు, మొదలగునవి పట్టీలలో నుండియుండవలయును; (౬) వివిధములగు నీ ధర్మములను సరిగా నడపుటకు ప్రభుత్వ మావశ్యకము. దీనికి న్యాయవంతులగు నుద్యోగులు నియామకము కావలెను. వారు తమతమ విధ్యుక్త ధర్మములను చక్కగా నెరవేర్చవలయును; (౭) రసాయన శాస్త్రమును నేర్చిన ఇంజినీరులు నేటి వస్తు నిర్మాణ పద్ధతులలో మిక్కిలి స్థాన మాక్రమించుచున్నారు; (౮) పారిశ్రామిక వస్తుపరిశీలనముకూడ నెంతయు నావశ్యకము. ఆధునిక వస్తునిర్మాణ పద్ధతు లీ విధమున నొకపద్ధతితో నొకటి అవినాభావ సంబంధము కలిగియున్నవి. ఇం దేది లోపించినను వస్తువులయుత్పత్తికి ఆటంకము కలుగును.

### ౮. ఆధునికకార్మికజాతివికాసము

నేడు కార్మికులలో కలిగిన మహాసంచలనము ఆర్థికజీవనమున సువర్ణాక్షరములతో లిఖింపదగును. వీరితాతముత్తాతలు నిద్రాముద్రితులై, వివేకహీనులై, వివిధపిశాచావృతులై యుండిరనుట నిక్కువమే. కాని, నేడు వారిలోనున్న ప్రచారపటుత్వము, శిక్షణానైపుణ్యము కొనియాడదగినవి. అనేకములగు యంత్రములలో పనిచేయుచు దేశమును వస్తుసంపత్సమృద్ధితో నింపుచు, వారివారి మనశ్శక్తులకు శిక్షణమొసంగి, సునిశిత మొనరించుట శ్లాఘనీయము. నేడు అనేకములగు కర్మాగారములలో కర్మాగారాధిపతులతో కూడ జర్మనీ, ఆస్ట్రియా, జెకోస్లావేకియాలలో కార్మికులు వస్తునిర్మాణమును జరుపు శక్తిని సంపాదించియున్నారు. న్యూజీలాండు దేశమున కార్మికులు పారిశ్రామికజీవనమున లభించిన లబ్ధిని పెట్టుబడిదారులతో సహ పంచుకొనుచున్నారు. ఇటలీదేశమునను బ్రిటనునందునుగూడ, ఇట్టి పరిస్థితులు సక్రమముగానే వచ్చియున్నవి.

### ౯. పట్టణముల యభివృద్ధి

ఆధునికపట్టణముల సంఖ్యయు, వైశాల్యమును అధికము చేయుటయు, పల్లెకేంద్రములను పురపాలకపట్టణములుగా మార్చుటయుకూడ ఆధునికార్థికజీవనమునందలి విశేషము. పట్టణము లన్నియు ఆధునిక పారిశ్రామికాభివృద్ధితో పాటు విజృంభించినవి. దీనికి కారణము ఆధునిక పారిశ్రామికాభివృద్ధియే యనుటకు దృష్టాంతము మాంచెస్టరు మొదలగుపట్టణముల మహాభివృద్ధియే. ఇదే రీతి ఒసాకాపట్టణము ఆశియామాంచెస్టరని పిలువబడుచున్నది.

నేడు పట్టణములసంఖ్య యధికమైనకొలందియు, ఎన్నియో ఆర్థిక, సాంఘిక, ఆరోగ్యవిషయకసమస్య లెదుర్కొనుచున్నను, వాని పరిష్కారము త్వరలో నే జరుగుచున్నది. అమెరికాదేశము నందలి నేటి గృహనిర్మాణచాతుర్యమును, పట్టణనిర్మాణకౌశలమును, పురపాలకసంఘము బుజముపైనిడుకొను వివిధములగు పనులను పరిశీలించినచో, ఎంతటి మహాప్రళయము సంభవించినను భయములేదని నొక్కివక్కాణింపనగును. ఉదాహరణకు మాంచెస్టరు పురపాలకసంఘము నడపు ట్రాముబండ్లు, గృహ

ర్మాణము, విద్యుచ్ఛక్తిసరఫరా, బాల బాలికా సంరక్షణము, ఆదర్శప్రాయములగు హోటళ్ల సంస్థాపన మొదలగునవి చూచిన చెఱువు పొడమును.

ఈరీతి, అధునికార్థిక ఉన్నతికి ప్రధాన కారణములు మూడుగా గ్రహింపవచ్చును. అవి, (౧) ప్రభుత్వముయొక్క మహోత్కృషి, (౨) బ్యాంకింగు కాంచిన మహాభివృద్ధి, (3) సాంకేతిక, వ్యావసాయిక, వర్తకవిద్యలు చక్కగా నభివృద్ధి నంది వివిధరీతుల వ్యాపించుటయును. ఇవి క్రమక్రమముగా ముందు విమర్శింపబడును.

---

# హిట్లరు; జర్మను వ్యవసాయము

శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణమూర్తి

౨

[నాజీప్రభుత్వములో, హిట్లరు పరిపాలనలో జర్మనీ ఎట్లా వృద్ధిపొందుతున్నదో జర్మనీ దేశపరిస్థితు లెట్లున్నవో శ్రీ సత్యనారాయణమూర్తిగారు అనేకవ్యాసాలలో వి రిస్తూవచ్చారు. వారివ్యాసాలు పాఠకలోకాన్ని బాగా ఆకర్షిస్తున్నాయి; పాఠకుల ప్రశంస పొందుతున్నాయి.

'హిట్లరు: జర్మనువ్యవసాయము' అనే కడచినసంచికలో పడినవ్యాసముతరువాతిభా మిది. దీనిలో వారు జర్మనురైతు నుద్ధరించడంకోసం నాజీప్రభుత్వం చేస్తున్నపనిని చక్కగ వివరించారు. దేశహితైషులైన ప్రతివారూ చదవవలసిన వ్యాస మిది.—భా. సం.]

## వారసత్వపు హక్కుల చట్టం

కుటుంబపొలాలు పాలుపంపకాలవల్లా, తణఖావగైరాలవల్లా చీలిపోకుండాను, అన్యాక్రాంతం కాకుండాను రైతు తన భూమిని విడిచి పట్నవాసమనే యెండమావులవెంట పరుగులెత్తకుండాను కాపాడడం ఈచట్టపు ఉద్దేశ్యం. దీనిప్రకారం ప్రతిరైతుకూ అతడి కుటుంబాన్ని పోషించగల పొలం కనీసం వక్కటైనా వుండాలి - అది ప్రత్యేకం రైతు యొక్క హక్కుభుక్తాలలో వుండాలిగాని ఏకారణాలవల్లా, ఏవిధంగాను అన్యాక్రాంతం కాగూడదు. అతడూ అతడికుటుంబమూ కలిసి దానిలో వ్యవసాయం చేసుకోవాలి. పొలంవిస్తీర్ణం కనీసం రైతుయొక్క కుటుంబాన్ని పోషింపజాలినదిగా వుండాలి. ఏవో కొన్ని సందర్భాలలోతప్ప ౩౦౯ ఎకరాలకు మించి యుండరాదు. అంతకంటె పెద్దఆస్తు లను ప్రభుత్వం తమ ఇష్టానుసారం వ్యక్తు స్వాధీనంలో వుంచవచ్చును; లేదా చిన్న చిన్నఖండాలుగా విభజించి బీదరైతుల కీయ వచ్చును. రైతు కొకపొలంచొప్పున వుండాలని నాజీల ఉద్దేశం. కాని చాలినంతమంది రైత లు దొరకనందువల్ల ఇప్పట్లో అంతకంటె హెచ్చుసంఖ్యగల పొలాలను రైతు ఆర్జించ కోవచ్చును.

ప్రతిజర్మనురైతూ, తనవంశం మూడు తరాలనుంచి, అనగా ౧ జనేవరి ౧౮౦౦ మొదలు నేటివరకు, "జ్యూ" మొదలైన అన్యజాతీయులతో రక్తసంబంధం లేకుండా పవిత్రంగా వుందని ప్రత్యేకకోర్టుమెదుట రుజువుచేసుకోవాలి. రైతు తనపొలాన్ని ఎప్పుడూ మంచిస్థితిలో వుంచాలి. సమర్థ తతో, సార్థకంగా, పొదుపుగా దానిలో వ్యవసాయంచెయ్యాలి. జర్మనుజాతికి అవసర

మైన పంటలను, అవసర మున్నంతమట్టుకు మాత్రమే, పండించాలి. పల్లెలకూ పట్నాలకూ మధ్య పరస్పరసంబంధాన్ని, సంఘము పట్ల తనపూచీలను గుర్తించాలి; తన స్వలాభంమాత్రము గమనించగూడదు. చిరకాలపు అప్పులలో పడిపోగూడదు. తన పొలంతనఖామీద అప్పులు ఏడాదికాలానికి మించ రాదు. అప్పుమొత్తం ఏయేటి కాయేడు పంటమొత్తంలోనుంచి తీర్చగలిగి వుండాలి గాని అంతకు మించరాదు. పొలం సత్తువను పంటలను శాశ్వతంగా అభివృద్ధి చేయగల నూయిత్రవ్వ, పంటకాలువలు ఏర్పాటుచెయ్యడం, మొదలైన శాశ్వత పనులకోసంమాత్రమే ఏడాదికాలమూ, ఏడాదిపంటలూ మించి అప్పులు చేయవచ్చును. అట్టి చిరకాలపు అప్పులను తీసుకోడానికి ముందు ప్రభుత్వాధికారుల వ్రాతపూర్వకమైన అనుమతి వుండాలి. 'ఎట్టిపనులకోసం రైతు దీర్ఘకాలపురుణాలు తీసుకోవచ్చును?' అన్నవిషయమై అధికారులలో అభిప్రాయభేదా లున్న ట్లగపడుతుంది. పొలంపనికి కావలసిన పరికరాలు,చిన్నచిన్న యంత్రాలు, పశువులశాలలు వగైరాల కయ్యే బాకీలను రైతు తన సాలుసరి ఆదాయంలోనుంచి తీర్చివెయ్యాలి. ఇదివరకున్న పాత బాకీల కోసం రైతుయొక్క భూమిని జప్తుచేసి వేలం వెయ్యగూడదు; అతణ్ని భూమిలోనుంచి లేవగొట్టగూడదు.

జర్మనువారసత్వపుహక్కుల చట్టంప్రకారం భూమికి వారసులు క్రమంగా యీ క్రిందివరుసలో నిర్ణయింపబడ్డారు: పొలం గామందుయొక్క (౧) కొడుకు; (౨) తండ్రి; (౩) సోదరుడు; (౪) కూతురు; (౫) అక్కచెల్లెళ్లు; (౬) ఆడుసంతతి; వారిసంతతి. దత్తపుత్రులను పుత్రికలను మొదటిపంక్తి వారసులుగా అంగీకరించరు. ఉంపుడుకత్తెల బిడ్డలు "అవమానకరమైన సంతానం" కాబట్టి వారికి వారసత్వపుహక్కులు లేవు. కాని బిడ్డ జన్మించినపిదప తండ్రి ఆస్త్రీని శాస్త్రీయంగా వివాహ మాడినయెడల ఆ బిడ్డకు వారసత్వపుహక్కు లేర్పడుతాయి.

వృత్తులూ ఆదాయమూ లేకుండా ఇబ్బందిపడుతూవున్న కష్టదినాలలో వ్యవసాయదారుని దగ్గరవారసులు, బిడ్డలు, పెద్దవారు, చనిపోయిన రైతుభార్య, మొదలైన సమీపబంధువులు కుటుంబవ్యవసాయంలో పనిచేసి పొట్టపోసుకోడానికి హక్కుగలదు. వ్యవసాయదారులు, అధికారులఅనుమతి లేకుండా, పైన చెప్పబడ్డ వారసులను తప్పించి తమభూములను ఇతరులకు విక్రయించ రాదు.

ఇది మిక్కిలి అమూల్యమైన నిబంధన. ఈవిధంగా అనేకవేల రైతుకుటుంబాలు చితికిపోకుండా, వారిఆస్తులు అన్యాక్రాంతం కాకుండా నిలుస్తున్నాయి.

ఈనిబంధన లన్నిటికి వ్యతిరేకంగా ప్రవర్తించిన రైతును "రైతుమర్యాద"ను అతిక్రమించినవాణ్ణిగా ఎంచి ఆతడిభూమినుంచి, దానిపైహక్కులనుంచి తొలిగిస్తారు;ఏమంటే మన దేశంలో గ్రామకరణీకం మొదలైన గవర్నమెంటు ఉద్యోగపదవుల మోస్తరుగానే నాజీజర్మనీలో రైతుపదవికూడా కుటుంబానికి చెందిన ఒకఉద్యోగపదవివంటిది. ఏకారణంవల్లనైనా ఆపదవికి అనర్హులని రుజువైన రైతులను ఆపదవిలోనుంచి డిస్మిసు, బర్తరఫు,

చేసి ఆఫలాన్ని లిస్టుప్రకారం తరువాతి వారసుడి కిస్తారు.

వారసత్వపుచట్టం అమలుజరిపే అధికారం గవర్నమెంటు "జాతీయఆహారసంస్థ" యొక్క కేంద్రపరిపాలనశాఖవారి చేతులలో వుంది.

వారసత్వపుచట్టానికి సంబంధించిన లిగాయిదాలను తీర్చడంకోసం భూవసతికి సంబంధించిన ప్రత్యేకకోర్టు లున్నాయి. వాటిలో ఒకజడ్జీ, ఇద్దరు వ్యవసాయదారుల ప్రతినిధులు వుంటారు.

ఆకోర్టుల ప్రధానకర్తవ్యాలలో భూవసతుల జాపితాలు తయారుచెయ్యడంవకటి. ప్రతిపొలాన్నిగురించిన సంగతి సందర్భాలన్నిటినీ అందులో నమోజుచేస్తారు. ఆ లెక్కలలో నమోజుచేయబడ్డ వ్యవసాయదారు లందరూ జర్మనుకర్షకతరగతికి ప్రత్యేకంగా నిర్ణీతమైన బిరుదునిశానీలను ధరింపవచ్చును. ఈవిషయమై చట్టంలో కిరివిరైన నిబంధన లున్నాయి.

ఆకోర్టువారే, పదేళ్లకొకసారి, భూవసతులనుగురించిన లెక్కలను సరిచేస్తూవుంటారు. ఆసందర్భంలోనే, ప్రతిరైతూ కడచిన పదేళ్లలో తనవ్యవసాయం ఏవిధంగా నిర్వహించాడో, పంటలు ఏవిధంగా పండించాడో పొలం ఏవిధంగా ఉంచుకున్నాడో పరీక్షచేసి రిపోర్టు వ్రాస్తారు. భూములను అశ్రద్ధచేయడం, వ్యవసాయం సరిగా చేయకపోవడం, మొదలైన నేరాలను విచారిస్తారు.

"జాతీయవ్యవసాయసంస్థ"ను జర్మను వ్యవసాయ పునరుద్ధరణకోసం ౧౯33 లో ఏర్పాటుచేశారు. జర్మను వ్యవసాయ వృత్తిలో పనిచేస్తూవున్న వ్యక్తులూ సంస్థలు యావత్తు అందులో సభ్యులుగా చేరాల నిర్బంధం కలదు. ఈసంస్థ జాతీయకర్ష నాయకుడి అధికారంకింద పనిచేస్తోంది. అతడు జర్మను ఛాన్సలరైన హిట్లరుచే స్వయంగా నియమింపబడి, స్వయంగా అత బాధ్యతకు లోబడి పనిచేస్తాడు. ఈవిధంగా జర్మను వ్యవసాయం యావత్తూ అందుల ప్రతి స్వల్పభాగమూకూడా, ప్రభుత్వా కారం కిందకు వచ్చింది.

వ్యవసాయశాఖకు సంబంధించిన ప పాలనా కార్యక్రమాన్ని మూడుభాగాలుగ విభజించారు:- (౧) 'మానవుడు'; (౨) 'భూవసతి'; (3) 'మార్కెట్టు'.

(౧) 'మానవుడు':— ఈ శాఖకు స బంధించినవిషయాలు: వ్యవసాయదారుడు భూస్వామి, పనివాడు మొదలైనవారి ప స్పరసంబంధం నిర్ణయించడం, రైతాంగాన్ని అభివృద్ధిచేసి పోషించవలసిన విధి, శరీరవ్యా యామము, తల్లుల మాతృత్వశిక్షణ, ప బిడ్డల సంరక్షణ, చంటిబిడ్డల వసతిగృహాల వగైరా.

(౨) భూవసతి:— పంటలను పండి చడం, వ్యవసాయశాస్త్రం, వృత్తివిద్య, వ్య సాయశాస్త్రకళాశాలలు, జర్మనీలో ఆహా పదార్థాలలోటు తీర్చడం, వగైరా విషయా లన్నీ ఈశాఖకిందకు వస్తాయి.

జర్మనీలో ఆహారపదార్థాల లోటు తీర్చ డంకోసం నాజీలు కొత్తగా వక ఉద్యమం ప్రారంభించారు. జర్మనీకి మనుష్యబలం భూవసతి అపారంగా వున్నప్పటికీ చాలినం

హారసామగ్రి దేశంలో ఉత్పత్తికావటం
దు. దానికోసం ఏటేటా విదేశాలమీద
ధారపడవలసివస్తోంది. అందులో వెన్న,
సువులమేత మొదలైనవి ముఖ్యమైనవి.
౧౯౩౮ లో జర్మనీకి కావలసిన ఆహారసామ
లో, ఐదోవంతు విదేశాలనుంచి దిగుమతి
యింది. అటుపిమ్మట జర్మనుపరిశ్రమలు
స్తారం అభివృద్ధిచెందుతున్నాయి. పనిపా
లు లేనివారిసంఖ్య తగ్గుతోంది. పనివాళ్ల
దాయమూ, తిండిసామగ్రికోసం వారు
సే ఖర్చూ అధిక మవుతున్నాయి. నాజీల
నికదళాలకు, లేబరుకాంపులకు తిండిసామగ్రి
స్తారం కావలసివుంది. పైగా యుద్ధకాలంలో
శంలో చాలినంత ఆహారసామగ్రి ఉత్పత్తి
యడం అవసరం.

కాని విదేశాలనుంచి రావలసినది ఆహా
సామగ్రిమాత్రమే కాదు. ఇంతకాలం మూ
బడియున్న ఫ్యాక్టరీలలో దుమ్ము దులిపి
నిచేయడం ప్రారంభించారు. వాటికోసం
ముడిపదార్థాలు విస్తారంగా విదేశాలనుంచి
రావలసివుంది.

వీటికన్నిటికీ చాలిన ధనంగాని పరపతి
గాని జర్మనీకి లేవు. ఇక చేయవలసిన పని
మి? తిండిగింజలనుమాత్రం దిగుమతిచేసి,
రిశ్రమలను మూలబెట్టి, నిరుద్యోగసమస్య
పూర్వంమోస్తరుగానే వుంచడమా?
క, తిండిసామగ్రిని దేశంలో పండించుకొని,
రిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలను
దేశాలనుంచి తెప్పించుకోవడమా?

నాజీలు మొదటిపద్ధతిని త్యజించి, రెండో
ద్ధతిని అవలంబించారు. కాని తిండిసామ
దిగుమతిని తగ్గించడం అంత సులభమైన
షయం కాదు. ౧౯౩౮, ౧౯౩౯ సం.

లలో పంటలు చెడిపోయి తిండిసామగ్రి ధరలు హెచ్చాయి. కొన్ని ప్రదేశాలలో చాలినంత మాంసము, కోడిగుడ్లు వగైరాలు దొరకలేదు. ఈ ఇబ్బందులను కొంతకాలం ఓర్పుతో సహించవలసినదనీ, జాతీయపునర్నిర్మాణంకోసం ఈ కష్టనష్టాలను భరించక తప్పదనీ, ఆహారసామగ్రి లోపించినంతమాత్రాన జర్మనీదేశం లొంగిపోరాదనీ నాజీనాయకులు ప్రజలను హెచ్చరించారు.

(3) "మార్కెటు" :— ఇది మిక్కిలి ముఖ్యమైన శాఖ. ఉత్పత్తి మొదలు విక్రయం వరకు, పంటసరకుల వ్యాపారం యావత్తు ఈశాఖకు సంబంధించినదే. వ్యవసాయపరపతిసంఘాలుకూడా ఈశాఖకిందకే వస్తాయి. వ్యవసాయదారు లందరూ తమ సమీపంలోవున్న పరపతిసంఘాలలోను వ్యవసాయసంస్థలలోను నిర్బంధంగా సభ్యులుగా చేరాలి. అంతేగాని మనదేశంలో మోస్తరుగా రైతుల ఇష్టాయిష్టాలమీద ఆధారపడియుండరాదు. పైగా ఈసంఘా లన్నింటిలోను సెక్రెటరీ, ప్రెసిడెంటు, మొదలైన ఉద్యోగులను మనదేశంలోమోస్తరుగా సభ్యుల వోట్లవల్ల ఎన్నుకోరు. పైయధికారులే వారిని నియమిస్తారు. దక్షతతో వ్యవహారాలను చక్కబెట్టవలసిన ఈయుద్యోగులు తమపదవులకోసం, సభ్యుల వోట్లపై ఆధారపడివుండడంవల్ల ఆ ఉద్యోగాలసమర్థత చచ్చిపోతుందని నాజీల నమ్మకం. పైనుంచి కింది వరకూ నాజీఉద్యోగులు తమపైయధికార్లకే గాని కిందివోటర్లకు బాధ్యులు కారు. సర్వాధికారియైన హిట్లరు- భగవంతుడికి, తనఅంతరాత్మకూ బాధ్యుడు. దేశసంరక్షణమే, ప్రజా

హీనమేగాని, మన దేశంలో అధికారుల మోస్తరుగా తమజీతాలు, లంచాలు, మోటారుబండ్లు, తమబంధువులకు ఉద్యోగాలు, భార్యాబిడ్డలకు నగలు, నాజీనాయకుల పరమోద్దేశాలు కావు. సర్వాధికారియైన హిట్లరుమొదలు కిందివరకూ నాజీలు తమ ఉద్యోగధర్మాలను అతికఠోరమైన మిలటరీ దీక్షతో నిర్వహిస్తున్నారు. అసమానమైన, అకుంఠితమైన ప్రజాహితచర్యయే వారిని ఆపదవులలో నిలబెడుతూవున్నది. అట్లు కాని నాడు నాజీప్రభుత్వం చీట్లపేకతో కట్టిన సౌధమువలె నేల కూలుతుంద.

నేటి ప్రజాప్రభుత్వాలలోవున్న గొప్ప లోపం మార్కెటుపరిస్థితులు. ఏయేటి కాయేడు ఏయేసరుకు లెంతమట్టుకు దేశంలో అవసరమో,ఎంతమట్టుకు విడుదల కాగలవో తెలిసేసాధనం లేనందువల్ల పాడిపంటలలో అతివృష్టి, అనావృష్టిలోపాలు సర్వసామాన్యమై, అనేకకుటుంబాలు కూలిపోతున్నాయి. ఒక రొకపంటను పండిస్తే మిగిలినవారందరూ ఆపంటనే పండించడం, మిగిలిన పంటలు అవసరమైనప్పటికీ చాలినంత పండించకపోవడం సంభవిస్తోంది. ఇది మన దేశంలో నిత్యానుభవం. ఎప్పటి కప్పుడు ఏపంటలెంత మట్టుకు పండించవచ్చునో రైతులకు తెలియజెప్పి, వా రానియమం అతిక్రమించకుండా చూసేనాథుడు లేకపోవడమే ఇందుకు కారణం. ఈవృత్తిలోకూడా అనేకమంది మధ్యవర్తులు బైలుదేరిధరలకూ పంటలకూ ఒకరీతి, నీతీ, నియమమూ, లేకుండా వర్తక స్వాతంత్రంపేర అతివిచ్చలవిడిగా వ్యాపారం నడుపుతున్నారు. అందుకు ముఖ్యకారకులు జ్యూజాతి వ్యాపారస్థులు. నాజీప్రభుత్వం ఈపద్ధతులను పూర్తిగా మార్చివేసింది. ఏయే
కాయేడుజర్మనువ్యవసాయదారులలో ఒక్కొ
క్కరు పండించవలసిన పంటలపేర్లు, వా
మొత్తం, వాటిని అమ్మవలసిన ధరలు, మధ
వర్తుల లాభాలు, ఈవిషయా లన్నిటినీ వి
లంగా నిర్ణయిస్తోంది.

మన ప్రజాప్రభుత్వాలలో, పంట న
ర్పమురోజులలో చవకధరలకు తిండిగింజలన
కొని, బీదసాదల కొకగింజయైనా దొరక్కు
డా దాచివుంచి, అవి దొరకనిరోజులల
ఎక్కువధరల కమ్మడం 'ధాన్యంవ్యాపార
అంటారు. అందులో జూదం పా
మూడువంతు లుంటుంది. ప్రజాప్రభుత్వా
లలో ఘరానా పెద్దమనుష్యు లందరూ శ
హాటంగా ఈజూదాలు నడిపి, బీదసాదలన
దోచుకోవడం, — వర్తకస్వతంత్రంపేర —
చాలా మర్యాదవృత్తిగా పరిగణింపబ
తోంది. అది మనకు నిత్యానుభవం.

నాజీజర్మనీలో అట్లు కాదు. ప్రతియేడు
ప్రతివ్యవసాయదారుడూ, ప్రతివర్తకుడూ
ప్రతిపిండిమర రొట్టెలమరయజమాను
నాజీప్రభుత్వంచే నిర్ణయింపబడ్డ ఆయా తేదీ
లోగా, ఆయాధరలకు, ఆయాపంటవ
త్తాలను, మార్కెట్టులో అమ్మకానికి వ
గించాలి. అంతే కాదు. ఏయేప్రదేశాలల
ఏసరుకు ఎంతమొత్తం అమ్మవలెనో అ
కారులే నిర్ణయిస్తారు. ఒకచోట పంట ఎ
కంగా వున్నయెడల అదనంగావున్న ధాన
రాశిని అవసరమున్నచోట్లకు ఎగుమతిచే
స్తారు. విదేశవర్తకాన్నిగురించికూడా అ
కఠినమైన ఏర్పాట్లు కలవు.

ఒకటి రెండు ఉదాహరణలు :—

(౧) జర్మనీలో హాప్సు అనేమొక్కల
ంచి బీరుసారాయిని తయారుచేస్తారు.
-౩౩ లో ఈ పైరు ధరలు పడి
యి జర్మను వ్యవసాయదార్లకు చాలా
ష్టం కలిగింది. ఇకముందు అట్టినష్టాలు
ంగకుండా ఆపంటను నడపడానికి ప్రత్యే
గా ఒక కమిషనరును నియమించారు.
డు పరిస్థితులను గమనించి ఏయేటి కా
ండు ప్రతిరైతు పండింపదగిన పంటమొత్తం,
క్కప్రదేశంలో నిలవవుంచదగిన పంట
త్తం, ధరలు వగైరాలను నిర్ణయిస్తాడు.
సరకుయొక్క క్రయవిక్రయాలు మధ్య
ర్తులద్వారా జరిగినా, స్వయంగా వ్యవసా
దారులవల్ల జరిగినా అధికారిచే నిర్ణయిం
డ్డ ధరల నతిక్రమించరాదు. ఇందును
రించి ఎన్నో విరివిగైన నిబంధనలున్నాయి.
టిని అతిక్రమించిన వ్యాపారస్థులకు, వ్యవ
యదార్లకు తిరిగి ఆవ్యాపారం చేయడానికి
మతి సీయరు. ఆ అధికారి తనకు కావల
విషయాలను రైతులవద్దనుంచి సర్వం
గా అడిగి తెలుసుకోవచ్చును. తన ఉత్త
వుల నతిక్రమించిన వ్యవసాయదారుల
దా, వ్యాపారస్థులమీదా పదివేలమా
లవరకూ జరిమానా విధించి పండిన పం
ను తనస్వాధీనం చేసుకోవచ్చును.

ఇదేవిధంగా ఉన్ని, బంగాళాదుంపలు,
రాయి, పంచదార, బీటుదుంప, వెన్న,
లు, పశువులమేత, తోటపైరులు మొద
ఆహారసామగ్రినిగురించి ఏర్పాట్లు
యి. పాలఅమ్మకం మరియొక ఉదా
రణగా చెప్పవచ్చును.

జర్మనీలో పాలకు సంబంధించినసమస్య లన్నిటిని పరిష్కరించడంకోసం ఒక కమిషనరు కలడు. పాలనుగురించి దేశాన్ని ౧౬ జిల్లాలుగా విభజించారు. జిల్లా కొక డైరక్టరుచొప్పున గలడు. ఒక్కొక్కప్రదేశంలో పాలను సప్లైచేయడానికి ఒక్కొక్కరికి లైసెన్సు ఇస్తారు. ఈవిధంగా చిల్లరవర్తకుల, మధ్యవర్తుల లాభాలు, ఖర్చులు తగ్గిపోయాయి. పాలధరలీటరు౧కి౧౦ పెన్నింగుల నుంచి ౯ పెన్నింగులవరకు తగ్గింది.

పంటసరుకుల ధరలను నిర్ణయించడంలో నాజీగవర్నమెంటు ప్రయత్నాలు వ్యవసాయదారులకు చాలా అనుకూలంగా వున్నట్లు త్వరలోనే స్పష్టమైంది. ౧౯౩౩ జనేవరి మొదలు ౧౯౩౮ డిశెంబరు ఆఖరులోగా వ్యవసాయపు పాడిపంటలధరలు నూటికి ౧౯.౯ వంతులు హెచ్చినట్లు తెలుస్తుంది. అందులో ముఖ్యంగా పశువులధరలు ౧౦౦కి ౨౨.౩ వంతులు, పాలు, కోడిగుడ్లు, వెన్న ధర ౧౦౦కి ౨౨ వంతులు, పశువులఆహారం ధర ౧౦౦ కి ౨౩ వంతులు, కూరగాయల ధర ౧౦౦కి ౨౬.౨ వంతులు హెచ్చాయి. అందుకుతోడు వ్యవసాయదారులకు మును పటిమోస్తరుగా అప్పులు పుట్టడంలేదు. గవర్నమెంటునిర్బంధంవల్ల వారు పాతబాకీలను క్రమంగా తీర్చుకుంటున్నారు. ఈపరిస్థితులన్నీ వ్యవసాయదారులకు అనుకూలంగా వున్నాయని చెప్పకతప్పదు.

పంటసరుకుల టోకుధరలు హెచ్చడానికి కారణం ప్రభుత్వంవారు ధరలను నిర్ణయించి, ఇన్నాళ్లూ మధ్యవర్తులపర మవుతూ వున్న లాభాలను వ్యవసాయదారులపరం చేయడమే అనిన్నీ, టోకుధరలు హెచ్చాయి

గాని చిల్లరధరలు హెచ్చలే దనిన్నీ, అందువల్ల సరుకులను వాడుకునే వినియోజకులకు నష్ట మేమీ కలగలేదనీ నాజీ అధికారుల వాదము. సరుకుల టోకుధరలు హెచ్చడంవల్ల చిల్లరధరలుకూడా హెచ్చాయనీ, నాజీ గవర్నమెంటు విదేశాలనుంచి తిండిసామగ్రి దిగుమతులను తగ్గించడంవల్ల ప్రజలకు చాలినంత ఆహారసామగ్రి దొరక్క వారు చాలా ఇబ్బంది పడుతున్నారనీ, అందులో పశువులమేతదిగుమతి తగ్గిపోవడం వల్ల ౧౯౩౮ లో జర్మను వ్యవసాయదారులు తమ పశువులను నిర్బంధంగా చంపివేయవలసి వచ్చిందని విమర్శకుల వాదము. నాజీ ప్రభుత్వం కొత్తలో, అనగా ౧౯౩౮-౩౯లో తలవని తలంపుగా పంటలు చెడిపోయి ప్రభుత్వపు అంచనాలు తారుమారై వ్యవసాయదారులకు ఇబ్బంది కలిగినమాట నిజమే. కాని ఒకటి రెండేళ్ల అనుభవాలను బట్టి ఈపద్ధతిని నిరసించడం భావ్యం కాదు. క్రమక్రమంగా పరిస్థితులు మారి యిప్పుడనుకూలంగా వున్నాయి.

గ్రామాలలో పనిపాటులు లేనివారికి భూవసతు లిచ్చి స్థిరనివాసం ఏర్పాటు చెయ్యడం నాజీకార్యక్రమంలో వక భాగం అని పైన చెప్పివున్నాము. తూర్పుజర్మనీలో పెద్దపెద్ద ఎస్టేట్లు కలవు. ఆవైపున జర్మను సామ్రాజ్యసంరక్షణార్థం అవి పూర్వం ఏర్పాటు చేయబడ్డవి. యుద్ధానంతరం ఆ ఎస్టేట్ల ప్రొప్రయిటర్లు ఆర్థికదుస్థితివల్ల అప్పులలోపడి చితికిపోయారు. హిట్లరుకు పూర్వం వాటిని ఉద్ధరించడంకోసం ప్రయత్నాలు జరిగాయి గాని కొన్ని ఎస్టేట్లు పూర్తిగా దివాలా తీసి అమ్మకానికి వచ్చాయి. నాజీప్రభుత్వం ఆ ప్రొప్రయిటర్లకు వర్షాశనా లిచ్చి, వారిఎస్టే ట్లను స్వాధీనం చేసుకొని, వాటిలోను, ఇ బంజరు రిజర్వుభూములలోను చిన్నచి గ్రామా లేర్పరచి 'పవిత్రమైన ఆర్య' తతి బీదవ్యవసాయదారులకు భూము లి న్నారు. ఇదిగాక మిక్కిలి కృషివల్ల స ద్రంలోనుంచి భూమిని స్వాధీనం చేసుకొ సాగులో పెడుతున్నారు. ఈవిధంగా పాతికేళ్లలో సుమారు ౫౦ లక్షల ఎకర భూమిలో సుమారు ౩½ లక్షల మంది పాటులు లేని జర్మను పౌరులకు వృత్తు కల్పించవచ్చు నని వారి నమ్మకం. ఇ కాలం అలక్ష్యంగా వదిలివేయబడ్డ ప్రాం లలో ఇప్పుడు వృత్తులు వర్తకవ్యాపారా అభివృద్ధి అయినాయి. ఈప్రయత్నా వల్ల ఈప్రాంతాలలో ప్రతియేడూ సుమా ౧౦ కోట్ల మార్కులు ద్రవ్యం చెలావ లో తిరుగుతోంది. ఇందులో ప్రతినాణెమ సార్థకంగా వినియోగమవుతోందని చెప్ప నికి సందేహం లేదు.

పైన చెప్పబడ్డ వారసత్వపు హక్కు చట్టం ఈ భూములకుకూడా వర్తిస్తుం ఒక్కొక్క పొలం విస్తీర్ణం వ్యవసాయ రుడి కుటుంబపోషణకు చాలి ఉండాలి. ఇ త్రాకూడా, అంతకంటె తక్కువ పొలమున్న చోట్ల మిగత భూమిని కొని ఇస్తున్నా పొలం పనిని సాధ్యమైనంతవరకు వ్యవసా దారుడూ, అతడిభార్యా పిల్లలూ స్వయం చేసుకొంటారు. ఇదిగాక విద్యార్థు విద్యార్థినుల సేవాదళాలు వ్య సాయదారులకు, వారిభార్యలకు పొలంపన లోను, ఇంటిపనులలోను ఉచితంగా స యం చేస్తున్నారు. దీనినే విద్యార్థుల "భ

...ాయ కార్యక్రమం." అంటారు. దీనిని ...రించి మరో సందర్భంలో వివరంగా వ్రాసి ...న్నాను. ఇందుమూలంగా విద్యార్థులకు, ...ద్యార్థినులకు చదువుతోపాటు పనిపాటుల ... ప్రత్యక్షానుభవం కుదురుతోంది. వ్యవ...యవృత్తిలో ప్రవేశమూ, అభిరుచీ ...లుగుతున్నాయి. విద్యార్థులు, విద్యార్థినులు ...స్పరసహాయమూ, నలుగురితో కలిసిమె... పనిచేయడమూ నేర్చుకుంటున్నారు. ... తర్ఫీతును బాలురకు, బాలికలకు ...మానంగానే ఇస్తున్నారు; అందరూ వళ్లు ...ంచి పని చెయ్యాలి గాని విశ్రాంతి ...ను, వేడుకలలోను కాలం వ్యర్థపుచ్చ...దు. పట్నవాసస్థులకు, పల్లెటూరివారికి ...పాటులలో ఈ విధంగా మిక్కిలి దగ్గర ...ంబంధం ఏర్పడుతోంది. పల్లెటూరి రైతు ...టుంబాలు, పట్నవాసపు విద్యార్థులు ఒకరి ...ద్దనుంచి, మరొకరు అనేకకొత్తసంగతులు ...ర్చుకుంటున్నారు. వ్యవసాయదారుల జీవి...న్నిగురించి, దృష్టినిగురించి జర్మను ...ద్యార్థి ఎంతో అనుభవం సంపాదిస్తున్నాడు. ...సందర్భంలో అతడికి నాజీసిద్ధాంతాలను ...ర్చడానికి అవకాశం కలుగుతోంది. వ్యవ...యదారుడికి ఉచిత మనుష్యసహాయం ...రుకుతోంది.

ప్రభుత్వంవద్దనుంచి కొత్తగా భూమిని ...ందే వ్యవసాయదారుడు వయస్సులో పాతి...ళ్లు దాటివుండాలి. ఇదివరకే వివాహితుడై ...ుండాలి, లేదా కావడానికి సిద్ధమైయుం...లి. ఇదివరకే పిల్లలు గలవాడైయుండాలి; ...దా పిల్లలను కనడాని కిష్టుడైయుండాలి. ...త్తవ్యవసాయదారు లందరివిషయంలో ఈ ...ంధనలను అతికఠినంగా అమలులో పెడుతున్నారు. భూములనీయడంకోసం కావలసిన ధనాన్ని జర్మనుప్రభుత్వమూ, రాష్ట్రీయప్రభుత్వాలు, స్థానికప్రభుత్వాలు కలిసి ఇస్తున్నాయి. కొత్తభూములను స్వాధీనంచేసుకొని అందులో నివాసాలేర్పరిచి, పొలాలను శాశ్వతంగా అభివృద్ధిచేయడంకోసం ప్రత్యేకంగా కంపెనీలను ఏర్పాటుచేశారు. అందుకోసం ఒకబ్యాంకుకూడా కలదు. వ్యవసాయదారులు శ్రమపనిముట్లను పశువులను తామే కొనుక్కోవాలి. వ్యవసాయంలో అభిరుచిగల పట్నవాసస్థులకుకూడా ఈ షరతులపైన భూము లిస్తున్నారు.

ఒక్కొక్కకమతంలో వ్యవసాయంచేయడానికి కావలసిన పెట్టుబడిలో నూటికి ౯౦ వంతుల ద్రవ్యాన్ని, ప్రభుత్వము దీర్ఘకాలపు అప్పులకింద ఇస్తోంది గవర్నమెంటు అప్పుల మీద నూటికి ౪ చొప్పున వడ్డీరేటు. అరవై ఏళ్లలో గవర్నమెంటుబాకీ తీరిపోయి భూమి పూర్తిగా రైతు స్వాధీన మయ్యేపద్ధతుల మీద ఆబాకీని వసూలుచేస్తున్నారు. నాజీల అధికారానికి పూర్వం లక్షలాది పొలాలలో వ్యవసాయం సరిగా జరిగేదికాదు. అది పూర్వపు పనిముట్లతో, పురాతనపద్ధతులమీద జరుగుతూవుండేది. ఫలసాయం తగ్గినప్పుడు రైతు తనఖర్చును తగ్గించుకుంటాడుగాని పాడిపంటల నభివృద్ధి చేసుకోడానికి ప్రయత్నించడు. వ్యవసాయంలో మార్పులు నిదానం మీద వస్తాయిగాని వెంటనే రావు. కాని అనంతంగా వేచియుండడానికి నాజీలకు ఓపిక లేదు. తమ అశ్రద్ధను, అలక్ష్యాన్ని వదలిపెట్టవలసిందని రైతులను బలవంతపెడుతున్నారు. పంటల నభివృద్ధిచేసే కొత్త పద్ధతులను

వారికి నేర్పుతున్నారు. ప్రతిప్రదేశం లోను అనుభవంగల వ్యవసాయదారులకు కొంతమందికి పొలా లిచ్చి వారిచేత కొత్త పద్ధతులలో వ్యవసాయంచేయించి, ఆవిధంగా వాటిని రైతులకు నేర్పుతున్నారు. రైతు, తోడిరైతుల ప్రత్యక్షానుభవంద్వారా నేర్చుకోవడం వకయెత్తు, అధికారులు నేర్పడం మరోయెత్తు.

కొత్తపద్ధతులమీద వ్యవసాయంచేయడానికిఇంకాఅనేకవిధాల రైతులకుప్రోత్సాహమిస్తున్నారు. వారి పొలాలను పంటలను పరిశీలించి బహుమతులు, యోగ్యతాపత్రాలు, బిరుదులు ఇస్తున్నారు. కొత్తరకం విత్తనాలను బలవంతంగా వాడుకలో పెట్టిస్తున్నారు. మిక్కిలి శ్రేష్ఠమైన పశువులనేగాని వ్యవసాయంలో వాడనీయటం లేదు. పాడి పశువులను మిక్కిలి జాగ్రత్తతో పెంచవలసిందని రైతులను బలవంతం చేస్తున్నారు. వ్యవసాయవృత్తిని పాడిపంటలను అభివృద్ధి చేసే పద్ధతులనుగురించి రైతులలో ప్రబోధం కలిగించడంకోసం ప్రతియేడూ శీతాకాలంలో దేశమంతటా వ్యవసాయశాఖామంత్రి అధ్యక్షతకింద వేలకువేలు సభలు జరుగుతున్నాయి. అవిగాక రేడియో, సినిమా, వార్తాపత్రికవగైరా సాధనాలను విరివిగా ఉపయోగిస్తున్నారు.

ఈప్రయత్నా లన్నిటివల్లా పాడిపంట లభివృద్ధిచెందుతున్నాయి. ౧౯౩౩-౧౯౩౬ లోగా మొత్తం వ్యవసాయపు ఆదాయం రెండుబిలియనుమార్కులు హెచ్చింది. ఒక్కబంగాళాదుంపలపంట ౪౧ మిలియను టన్నులనుండి ౪౬.౭౨ మిలియనుటన్నుల వరకు హెచ్చింది. (మిలియను అనగా పది లక్షలు). వ్యవసాయపు యంత్రాలకోసం వ్యవసాయదారులు చేసిన ఖర్చు ౧౯౩౪ ౧౯౩౬ లోగా ౮౪ మిలియను మార్కుల నుంచి ౨౪౦ మిలియను మార్కులవరకు హెచ్చింది.

మొత్తంమీద నాజీప్రభుత్వంలో మిక్కిలి సమర్థతతో నిర్వహింపబడుతువున్న అధికారశాఖలలో వ్యవసాయం వకటి విదేశస్థులుకూడా అంగీకరించారు.

ఈశ్రమ, ఖర్చు, యావత్తూ రాబోయే యుద్ధానికి ప్రయత్నాలని వాదించేవారు కొందరు. అట్లు కాదు, దేశాభివృద్ధియే నాజీల పరమోద్దేశమని వాదించేవారు మరి కొందరు. ఆచర్చలతోటిగాని, నాజీనాయకుల ఆంతర్యాలతోగాని మన కిప్పుడు పని లేదు. వాటిని చర్చించడం అప్రస్తుతప్రశంస. ఇది స్వాతంత్ర్యమా? మనఅర్థంలో నాజీలకు వ్యక్తిస్వాతంత్ర్యంఅంటేఅభిమానంగాని గౌరవంగాని లేవు. "వ్యక్తిస్వాతంత్ర్యమే అంత ప్రధానవిషయమా?" అని మొన్న నే వక నాజీమంత్రి అడిగాడు. జర్మనీకి సంబంధించినంతవరకు ప్రతివిషయంలోను జర్మనురైతుకు ఎట్టి ఆలోచన లుండాలో, ఎట్టి నడవడి వుండాలో నాజీనాయకులే నిర్ణయించి ఆజ్ఞాపిస్తున్నారు. ఇది నాజీజర్మనీలో ప్రజ లనుభవిస్తూవున్న స్వాతంత్ర్యము. జర్మనుప్రజలకు నాజీదృష్టి, నాజీభావాలు ఏర్పడ్డకొద్దీ పరిస్థితులు క్రమక్రమంగా మారవచ్చును. వారు అధికారానికి వచ్చి ఇంకా ౬ ఏళ్లైనా దాటలేదు.

కాని నేటి సోవియటురష్యాలోను, నాజీ జర్మనీలోనువున్న నిరంకుశాధికారాలకు

కొన్ని భేదా లున్నాయి. వ్యవసాయము, వర్తకము మొదలైన డబ్బు వచ్చే సాధనా లన్నీటిని ప్రజ లందరి ఉమ్మడిలాభంకోసం ప్రభుత్వమే నడపడం సోవియటు రష్యనుపద్ధతి. దేశక్షేమార్థం, ప్రజాహితార్థం; ఏర్పడు ప్రభుత్వనియమాలకు నిబంధనలకు లోబడి ప్రజలు తమ స్వలాభంకోసం వర్తకవ్యాపారాలను వృత్తులను స్వయంగా నడుపుకోవడం నాజీజర్మనుల పద్ధతి. ప్రజాస్వాతంత్ర్యం విషయంలో ఇద్దరూ దోషులే అయినప్పటికీ నాజీజర్మనులే తక్కువదోషులని చెప్పవచ్చును. ప్రజాస్వాతంత్ర్యం అన్నిచోట్లా ప్రజాహితానికి విపత్తుల్యంగా పరిణమించడమే నాజీ నిబంధనలకు కారణం.

ఈమార్పులు జర్మనురైతుకు ఇష్టమేనా?

“కాదు! జర్మనురైతు నాజీఅధికారులను తిరస్కరిస్తున్నాడు. తనవ్యవసాయం తగ్గించుకుంటున్నాడు. పశువులకు మేత చాలక వాటినిచేతులార చంపుకుంటున్నాడు. తన పంటసరుకులను ఎక్కువధరలకు రహస్యంగా ఇతరుల కమ్ముతున్నాడు” అని విరోధుల విమర్శనలు.

ఇవి ఎంతవరకు యథార్థము? ఇతర దేశస్థులకు తెలియడం కష్టము. కాని తమ లోటుపాట్లను సవరించుకోడానికి, పద్ధతులను మార్చుకోవడానికి, ఆశయాలను, ఆచరణను పూర్తిగా సమన్వయం చేయడానికి నాజీనాయకులు అహోరాత్రులు విసుగువిరామాలు లేకుండా పాటుపడుతున్నారు. ఆవిషయమై వారు నిద్రపోవటం లేదు; జర్మనీదేశాన్ని నిద్రపోనియటం లేదు. నిదానంమీదగాని నిజం తెలియదు. ఈలోగా పక్షపాతమనస్సులతో దూషణ భూషణాలు తగవు. నాజీప్రభుత్వమున జర్మనులు తిండిలేక మాడిపోతున్నారని చెప్పడం కేవలం అనృతోక్తి. ఏసంస్కరణలోనైనా తాత్కాలికమైన ఇబ్బందు లుండకమానవు. అంతమాత్రాన జాతి యావత్తు చెడిపోయిందని నిందించడం అతిశయోక్తియని నిస్సందేహంగా చెప్పవచ్చును.



# కుజ్జతనమా? మానవస్వభావమా?

శ్రీ పాలగుమ్మి పద్మరాజు

అబ్బ! పాడుకోటు! ఇంత భారంగా ఉంటేం! క్రితం వేసవిలో ఈ కోటు కుట్టించినతరవాత తను బాగా లావు ఎక్కాడో, లేకపోతే చాకలిబల్లమీద నలిగి ఇది కురచ అయిపోయిందో రాముడికి సరిగా జ్ఞాపకంలేదు. కోటుజేబులో పర్సూ, జేబురుమాలూ చొక్కా జేబులో వేసుకుని కోటు విసుగ్గా విప్పి బెంచీమీద పడ వేశాడు. ఆ వేసవి ఎండలో స్టేషనంతా మూర్ఛపోయి నట్టుగా ఉంది. ఏమూలో, 'సుడా అండీ! సుడా!' అంటున్నాడొకడు నీరసంగా. కొంతమంది బెంచీల మీద నిద్రపోతున్నారు. కొండపల్లి బొమ్మలవాడు ఎవరూ కొనరనే ధైర్యంచేత గోడకి జేరబడి కూర్చుని కునుకిపాట్లు పడుతున్నాడు. ఉస్సు! రైలు ఆలస్యంగా వస్తుందటకూడాను. రాముడికి చాలా చిరకుగా ఉంది. చెమటకల్ల చొక్కా తడిసి కొంత చల్లగా ఉన్నా తాపంమాత్రం తగ్గలేదు. ఆ స్టేషనులో మనుష్యుల సవ్వడులు నీరసంగా చాలాదూరాన్నుంచి వినబడుతూ ఉన్నట్టుగా చెవిమీద పడుతున్నాయి. ప్రపంచక మంతా మత్తుమందు పుచ్చుకున్నట్టుగా ఉంది.

చేతులో పుస్తకాలపెట్టే, చంకలో పుస్తకాల దొంతరా పెట్టుకుని, రామశాస్త్రి క్రాపుగల ఒక మనిషి, రాముడివంక కొంతసేపు ఎగాదిగా చూసి, 'వావెల్సు కావాలాండి? సార్! వావెల్సు?' అని అడిగాడు. అక్కరలేదన్నట్టు తల ఊపాడు రాముడు. వెనుక వావెల్సు! చదువుకున్నవాళ్లకేం నచ్చుతాయి ఇవి? కాని వావెల్సువాడిని చూడ్డంతోటే రాముడి కేదో జ్ఞాపకంవచ్చింది. చటుకుని లేచి ప్రక్కనే ఉన్న హిగిన్ బాతమ్సు బుక్ స్టాల్ దగ్గరకు వెళ్లాడు రాముడు.

రాముడు పుస్తకాల విషయంలో అంత చేసిన శైయ్య. పేరు చూసి, అతనికి తల ఊపడానికి తాపాను గల పుస్తకాలు లెక్కపెట్టలేం. కాని అతడు స[...] గ్రంగా చదివిన పుస్తకాలు చాలా తక్కువే. పుస్తకా[...] మీద అతడు అభిప్రాయాలు ఇచ్చేటప్పుడు మీరు వింటే[...] అతడు మాట్లాడే ధోరణీ, పరిశీలనాదృష్టీ, అత[...] ఉపయోగించే పరిభాషా చూసి, అతడు చదవనిపుస్తక[...] ప్రపంచకంమీద ఉండదని మీరు అనుకుంటారు. కా[...] అదే మీపొరబాటు. ఒక్క పుస్తకాల విషయంలోనే [...] కాదు, తక్కిన అన్ని విషయాలలో మా రాముడు అంతే[...]

ఆనాడు అతని అభిరుచి తెలుగు కవిత్వంమీది[...] పోయింది. భారతి చేతులోకి తీసుకుని పుటలు తిర[...] వేస్తున్నాడు. అందులో 'కుమార' అనే ఎవరిదో ఒ[...] పద్యం ఉంది. పేరు చూస్తేనే అది చదవాలనిపించింది.

కుజ్జతనమా? మానవస్వభావమా?

విరులగుత్తుల పరిమళముతో
విరియబూచిన ప్రకృతియంతా
కలకలనైనే—నీనవ్వుల
పులకరింపులతో—

ఘనశిలాస్తంభముల కరిపి కట్టిన
భూరిసౌధాంగణము లన్నీ
ఘోరమనెనే—నీ నవ్వుల
మారు మ్రోతలతో—

ఆ కుమారపు ఆకసంలో
ఆపులించిన నీలిలోతులు
నిండిపోయెనె—నీ నవ్వుల
పండు వెన్నెలతో—

సీమసీమల నిద్రపోయిన
జీవచైతన్యంబు మేల్కొని
పరుగులెత్తెనె — నీ నవ్వుల
తరళవేగముతో—

ఒక్కసారి ప్రపంచకమంతా మేలుకుంది. మన్ను న్న పాములా పడుకున్న అతని ఉద్రేకం ఉవ్వెత్తుగా చింది. ఈ భావం అతనికి చాలా పరిచితమయినదే. క్కడన్నా ఇదివరకు చదివాడా? కాదుకాదు. ఇది న మనస్సులోనిదే. చాలాకాలంనుంచి మోస్తూ ఉన్న రువు ఒక్కసారిగా దిగిపోయినట్టు అనిపించిం దతనికి. డియోతరంగాల మాదిరిగానే భావతరంగాలు కూడా నస్సు నుంచి వ్యాపిస్తాయిగావును; లేకపోతే ఈ భావ రూపానికి అర్థం అతనికి కనిపించలేదు. అతడూ ంతవరకు కవే. అప్పుడప్పుడు పద్యాలు వ్రాస్తూ ఉం న్నా. కాని ఆ పద్యాలు కేవలం తన వ్యక్తిగతమయిన నుభవాలకి సంబంధించినవి అవడంచేతనూ, వాటిలోని ంతరార్థం ఇతరులు గ్రహించలేరేమోననే సంకోచం తనూ, వాటిని ఇంతవరకూ పత్రికలకు పంపలేదు. త్రం! ఈ పద్యంకూడా కేవలం తన వ్యక్తికి సంబం ంచినదే! పత్రికలో పడడంతోటే ఇది అనంతమయిన పంచానుభవంగా మారిపోయింది. అసలు అన్ని అనుభ లూ అంతేనేమో! దీనినిబట్టిచూస్తే తన పద్యాల న్నింటినీ పత్రికలకు పంపవచ్చు.

రైలు 'కైంయి' మని కూసింది.

రాముడు అదరిపడి వెనక్కి తిరిగి చూశాడు. లు కదులుతూ ఉంది. అరే! రైలు వచ్చి ఆగినట్టే నలే దతను. చేతులో భారతి అక్కడే పడవేసి ందరగా పరుగెత్తాడు. అదృష్టవశాత్తు ఇంటరు తర పెట్టె ఎదురుగానే కనబడింది. ఎల్లాగో తలుపు త్రోసు లోపలికి దూరాడు. వెంటనే బెంచీమీద మరచి యిన కోటుసంగతి జ్ఞాపకం వచ్చింది. రైలు ప్లాటు రం దాటిపోయింది. అతడు తన పరధ్యానాన్ని దించుకున్నాడు. 'సరే! ఏం జేస్తాం!' అనుకుని కూర్చు న్నాడు. జేబురుమాలూ, పర్సూ, చొక్కా జేబులో వేసు న్నాడుగాని లేకపోతే మరీ అభాసయిపోను. మొగం ద చెమట తుడుచుకుని, దడదడ కొట్టుకుంటూ ఉన్న డెలసద్దు అపడానికి ప్రయత్నిస్తున్నాడు.

'కుర్రతనమా? మాతవస్వభావమా?' - తనలో నవ్వుకున్నాడు.

ఇంతలో ఏవో రెండు కళ్లు తన వెనకనుంచి తదేకదీక్షతో తనవైపే చూస్తూ ఉన్నట్టు అనిపించిం దతనికి. వెనక్కి తిరిగి చూశాడు. తను కూర్చున్న సీటుమీదనే ఒక యువతి కూడా కూర్చుని ఉంది. పెట్టెలో ఇం కెవరూ లేరు. ఆలోచించుకోకుండానే అతడు లేచి ఎదురుగా ఉన్న సీటుమీదికి పోయి కూర్చు న్నాడు. అతనిదృష్టి తనమీద పడడంతోటే ఆమె తన చూపులు ప్రక్కకు తిప్పి కిటికీలోనుంచి అవతలకి చూస్తూ కూర్చుంది. అతడు వెర్రివానిలా ఆమెవంకే తెల్లబోయి చూస్తున్నాడు. ఆ చూపులకు చలనం లేదు. పెట్టెలో ఇం కొకయువతి ఉంటుందని అతడు అనుమానించనయినా లేదు! ఆమె మళ్లీ సన్నగా తన చూపులను అతనివైపు తిప్పి అతడు తనవంకే చూస్తూ ఉండడంచేత వెంటనే ముఖం తిప్పుకుని మొదటివలె కిటికీవంక చూస్తూ ఉంది. ఆమె చెక్కిలు కొంచెం ఎఱ్ఱబడ్డాయి. ఆమె తనవంక తిరిగి చూడడంతోటే అతనికి స్థైర్యం కలిగింది. ఎల్లాగో క్షమార్పణ చెప్పా లనుకున్నాడుగాని ఏమి చెప్పాలో అతనికి తోచలేదు.

'ఇది...ఇది...ఇది ఆడవారిపెట్టా?' అన్నాడు కంగారుగా.

'కాదు.' ఆమె కిటికీకి దగ్గరగా జరిగింది.

అతని మనస్సు కొంత కుదుటబడింది. కాని ఆమెకు కేవలం ఎదురుగా కూర్చుని ఉన్నమూలంగా, ఒకవిధమయిన ఆందోళన కలిగింది అతనికి. తన దుస్తుల వంక చూసుకున్నాడు. పంట్లాంమడత నలిగిపోలేదు. తెల్లని మల్లిపువ్వులాంటిచొక్కా నిజంగా అందంగానే ఉంది. చొక్కా పంట్లాంలోపలికి ఉంది. అంత వరకూ బాగానే ఉంది. కాని కోటులేకపోవడం చాలా వెలితిగా కనబడింది. దాన్నిగురించి ఆమెకు చెప్పకపోతే వీలులేదనుకున్నాడు. నాగరకలక్షణాలలో గలిగిన ఈ లోపం క్షమించడానికి వీలులేనిది. తననుగురించి ఆమె ఏమనుకుంటోందో!

'నే నింత వెకిలితనంగా రైలు ఎక్కడం చూస్తే మీకు నవ్వు వస్తోందేమో!' అని అతడు తనంతటనే నవ్వ డానికి ప్రయత్నించాడు. ఆమెముఖం కొంచెం ఎఱ్ఱ

జారింది. వచ్చేనవ్వుని బలవంతంగా ఆపుకుని, ఆమె కిటికీకి దగ్గరగా జరిగి, కిటికీమీద గడ్డం ఆనుకుని బయటకు చూస్తూఉంది.

'ఏదో పరధ్యాన్నంగా స్టేషనులో పుస్తకాలు చూస్తూ నిలబడ్డాను. రైలు వచ్చి ఆగినసడే నాకు వినబడలేదు. కదిలేటప్పుడు కూత వినబడింది. బల్లమీద పడేసినకోటు మరిచిపోయి గబగబా ఎల్లాగయితేనేమి రైలు ఎక్కాను' అన్నాడు. మాట్లాడేటప్పుడు మాత్రం ఆమె తనవైపు చూడకపోయినా, అతడామెవైపు చూడకుండా ఉండలేక పోయాడు

ఆమె ప్రత్యక్షంలో అతడు తన స్వభావసిద్ధమయిన మనస్థైర్యాన్ని నిలబెట్టుకో లేకపోయాడు. తన స్వరూపవదలవాదులలో వైకల్యం ఏమన్నా ఉందేమోనని అతనికి పూర్తిగా అనుమానం.

ఎల్లాగయినా ఆమెతో మాట్లాడాలని కోరికఅతనికున్నా, సంభాషణ ఎల్లా మొదలుపెట్టాలో అతనికి తెలియలేదు. కాని వారిద్దరిమధ్యా ఆమానం, కేవలం మౌనంగా లేదు. ఏవో అస్పష్టప్రవాహాలు ఇటూ అటూ ప్రవహిస్తూనేఉన్నాయి. ఆరైలుపెట్టెలో ప్రతిఅణువూ సజీవంగా సంచలిస్తూఉంది. అంత సజీవమయిన వాతావరణం అతన్ని ఆవరించడం, అతని కింతవరకూ అనుభవంలోకి రాలేదు. అందులో అతడు ఉక్కిరిబిక్కిరయిపోతున్నాడు. అల్లా ఉక్కిరిబిక్కిరి అవడంలో ఎంతో కులాసా, మైకం ఉన్నాయి.

ఆమె నాజూకుయొక్క అవతారం. ఆనాజూకులో దౌర్బల్యం ఏమీలేదు. ఆమె అంగసౌష్ఠవం పరిపూర్ణం. సుల్లనేలలో మొలిచిన క్షీరపాదులా ఉంది ఆమె. తనకాలేజీఆడపిల్లలలో అంతపొంకం ఎవరికీలేదు. సున్నితమయిన ఆమె శరీరపు మృదుత్వంలో అపూర్వమయిన శక్తి ఉంది. ముట్టుకుంటే వాడిపోయే సౌకుమార్యంకాదు ఆమెది. ఆమె అనుక్షణం ఎదుగుతూనే ఉంది. రాముడికళ్లకి ఆ ఎదగడం కనబడుతూనే ఉంది. గాలితాకుడుకి పులకరించే నవకం ఆమెది.

'ఆమె తనువున పులక లఖిలదిక్కులను
గాలికెరటాలపై కదలి వ్యాపించినవి!'

ఆమెను చూస్తేనే కవిత్వం పుట్టుకువస్తుంది. ఈపద్యం తను ఇదివరకు వ్రాసిందా? కాదు. అప్ప కప్పుడు అకస్మాత్తుగా తన భావనలో పుట్టిందే. ఇ నిజమయిన కవిత్వం.

ఈమాటు నిజంగానే గాలి పులకరించింది.

ఆమె ఒకసారి లేచింది. లేవడంతోటే చీర చిర లాడింది. ఆమెచుట్టూ ప్రదేశం అంతా ఒకసా జలదరించింది. పైటచెరగు సరిగా మోకాళ్ల పైను తీసుకుని చేతిలో పుస్తకం ప్రక్కని బల్లమీద పె మళ్లీ కూర్చుంది.

అతని హృదయంలో ఎవరో గిలిగింతలు పెట్టార ఆమెపొంకాన్ని చూసి, అతనిలో ఉద్వేగం ఉవ్వెత్తు లేచింది. ఆమె కూర్చోగానే అతని గాబరా కొం తగ్గింది.

'ఏదండీ! ఆపుస్తకం చూసి ఇస్తాను' అని అ గాడు.

ఆమె ఆ పుస్తకాన్ని అతడు కూర్చున్న బ మీదికి గిరవేసింది. అది తీసుకుని మొదటిపే విప్పాడు. ఆమెపేరు దానిమీద ఉంటుం దనుకున్నా కాని అతనిఆశ విఫలమయింది. పేరు ఆమెనే అడు దా మనుకున్నాడుగాని ధైర్యం చాలిందిగాదు. 'ఆ పేరులో ఏముంది?' అనుకుని చివరకి సమాధానపడ్డాడు

పుస్తకం ఒక ఇంగ్లీషుపద్య సంగ్రహం. ఇంట మీడియేటుకి అది ఆ ఏడు పెట్టారు. ఆమె ఎక్కడి ఇంటరు చదువుతూ ఉండి ఉంటుం దని అనుకున్నాడు

'మీకు కవిత్వంలో ఏమన్నా అభిరుచి ఉందా అని అడిగాడు. ఆ ప్రశ్న అంతసహజంగాగాని సందర్భానికి తగినట్టుగాగాని లేదని అతనికే అనిపించింది.

'నేను వ్రాయలేనుగాని కవిత్వమంటే నా ఇష్టమే.'

ఆమెసన్నని కంఠస్వరం సంగీతం మ్రోగింది. అది ఈ ప్రపంచకాన్నుంచి రాలేదు దిబ్మండలానికి అవతలప్రక్కనుంచి ఏగంధర్వగాన ప్ర లో అతనిచెవుల్లో మ్రోగినట్టుగా అనుకున్నా డత

'నా అభిమానకవి మేస్‌ఫీల్డు' అన్నాడు పు కంలో పేజీలు తిరగవేస్తూను.

ఈసారి ఆమె చిఱునవ్వుని ఆపుకోలేకపోయింది.

'మీరు ఏ కాలేజీలో చదువుతున్నారు ?' అని
ఖమెత్తి కొంచెం ఆమెవంక చూశాడు. ఆమె చిఱు
వ్వు కొంత అతన్ని తలక్రిందుచేసింది. ఇందాకటిపద్యం
తనికి అప్రయత్నంగా జ్ఞాపకం వచ్చింది.

'సీమసీమల నిద్రపోయిన
శీతచైతన్యంబు మేల్కొని
పరుగులెత్తెనె — నీ నవ్వుల
తరళవేగముతో —'

'వసంతమా ? మానవస్వభావమా ?' అతనికి
వ్వువచ్చింది.

'కాకినాడకాలేజీలో' నని ఆమె చెప్పిన సమా
నం అతడు వినిపించుకోలేదు.

'మన ఆధునిక ఆంధ్రకవిత్వంలో కొన్ని
పాలు లేకపోలేదు.' తను ఈ అభిప్రాయం ఇవ్వడం
వసరమేమోనని వెంటనే అనుకున్నాడు.

'మీరు కవిత్వం వ్రాస్తారా !' ఆమె కిటికీ వంక
సి ప్రశ్నించింది.

అతడు తెచ్చిపెట్టుకున్న చిఱునవ్వులో కొంత
లితనం లేకపోలేదు. 'కొంచెం వ్రాస్తానుగాని
త్రికలకు పంపలేదు.'

ఆమె ఇంకేమీ మాట్లాడలేదు. తమ సంభాషణ
తటితో అర్థంలేని ముగింపుకురావడం అతనికి ఇష్టం
దు. మళ్లీ ప్రశ్నించాడు: 'భావకవిత్వంమీద మీ
ప్రాయం ఏమిటి ?'

'నేను చదివింది చాలా తక్కువ. చాలామట్టుకు
కేమీ అర్థం గాదు.'

రాముడికి కొంత సంభాషణకి అవకాశం దొరి
ది. తన సహజధోరణిలో మొదలుపెట్టాడు. 'మీకు
నుభూతి ఉంటే అర్థం గాకపోదు. మీరు కవియొక్క
నుభవంలోకి వెళ్లడానికి ప్రయత్నించాలి. కాని మన
బంధాలలో కవిత్వాన్ని అర్థంచేసుకున్నట్టుగా దీనిని
రు అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తే మీ ప్రయత్నం
ఫలమయిపోతుంది.'

'ఇంగ్లీషు కవిత్వంలో ఆ బాధ ఎందుకు రాదు?
వ్రాసేవారిలోకూడా ఉంటుం దనుకుంటాను.'

'నిజమే ! వ్రాసేవారిలో గొప్పతనాన్నిబట్టే కవిత్వానికి ప్రసాదగుణం ఉంటుంది. కాని తెలుగులో ఈ కొత్తకవిత్వం మొదలుపెట్టి ఆట్టే రోజులు కాలేదు. ఇంగ్లీషుకవుల ధోరణిలో ఆలోచించడం మనకి అలవాటయిపోయింది. అందువల్ల ఇంగ్లీషుకవిత్వం అర్థంచేసుకోవడంలో మన కంత కష్టం ఏమీ ఉండదు. క్రొత్త పరిభాష ముఖ్యం. అది నిర్మించుకోడానికి కొంతకాలం పడుతుంది. అది ప్రజలు గ్రహించగలగడానికి ఇంకా కొంతకాలం పడుతుంది.

ఆమె దీనికి జవాబుగా కిటికీవంక తిరిగి నవ్వుతూ కూర్చుని ఉంది.

కొంత తన చేష్టలలో వెకలితనం ఉన్నా సంభాషణలోమాత్రం పైచెయ్యి తన దనుకున్నాడు రాముడు. తన వాగ్ధోరణిమీద అతనికి మంచి స్థైర్యం, నమ్మకం ఉన్నాయి. కాని ఆమె సంభాషణకి తావు ఇవ్వడం లేదు. ఆమె తనతో మాట్లాడడానికి సంకోచిస్తున్నదా? లేక మాట్లాడ్డం ఇష్టంలేక మాట్లాడ్డం లేదా ?

పుస్తకంలో పేజీలు తిరగవేస్తున్నాడుగాని ఒక్క అక్షరమయినా అతను ఆనవాలు పట్టడంలేదు మనస్సులో అర్థంలేని ఆందోళన. అతనిచుట్టూ వాతావరణం అతనిమీద అపరిమితమయిన ఒత్తిడిచేస్తూ ఉంది. అతని మనస్సు ఆ ఒత్తిడిలో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. వేసవి ఎండ అతనికి జ్ఞప్తిలో లేనేలేదు. అసలు తను రైలులో ఉన్నట్టుగాని, రైలు ఇప్పుడే తాడేపల్లిగూడెం దాటినట్టుగాని అతనికి స్మృతిలేదు. ఆమె తనకు అంత దగ్గరగా ఉన్నా వారిద్దరిమధ్యా కొన్ని సముద్రాలున్నాయి, ఆ సముద్రాల నతను ఈదడానికి ప్రయత్నిస్తున్నాడు.

పై వేసవి ఎండ అతన్ని ఎంతమాత్రం బాధించడం లేదు. అసలు ఆసంగతే మరచిపోయాడు అతడు. ఎక్కడో అంతులేని వసంత ఋతువులో, ఆకులు పండి రాలని ఆరామసీమల్లో, తీగలతో పెనగొన్న భూరుహచ్ఛాయలలో పువ్వులతో దిండ్లు అమర్చబడిన

ఊగుటుయ్యాలలలో 'తనకుకా ప్రాణము ప్రాణమైన చెలి' ప్రక్కని కూర్చుండగా ఊపుఊపులోనూ స్వర్గాన్ని అందుకుంటూ, డోలికా సౌఖ్యాన్ని అనుభవిస్తున్నాడు. అప్పు డతని మనస్సులో ఉన్నవి, మంచి గంధాలూ, మల్లెపువ్వుల చల్లతావులూ, కోయిలకల గానాలు, మంచినీటి చుక్కలూ, తళతళ మెరసే పచ్చికలూ, మందమలయానిలాలూ, పండు వెన్నెల్లూ, ఇంకా ఇల్లాంటివి ఎన్నో, ఎన్నో.

రైలు దీర్ఘంగా కూతవేస్తూ ఆగింది. నిడదవోలు ప్లాటుఫారంమీద. ఆమె తొందరగా లేచి బల్లమీదిపెట్టె దింపుకోబోతోంది.

అప్పుడే ఆమె దిగిపోవడమేం? అసంభవం! అసంభవం! ఇంత...ఇంత...ఇంక అతనికి ఆలోచన కూడా పోలేదు.

అతని కాసందర్భంలో ఏమిచెయ్యాలో బోధపడలేదు. ఆమె కూలివాడిని పిలవకుండే ఆమె సామానులు దింపి క్రిందపెట్టాడు. ఆమె వద్దని ఒకటి రెండుసార్లు అందిగాని అతన్ని ఆపగలిగేటంత గట్టిగానూ నిర్మొగమాటంగానూ చెప్పలేకపోయింది. ఆసామాన్ల నతడు చాలా సున్నితంగా ముట్టుకున్నాడు. ఆమె సామాన్లకు కూడా ఆమె మృదుత్వం ఉంటుందనే అత డనుకున్నాడు. అతనిథోరణి చూసి ఆమె ఇంకో ప్రక్కకు తిరిగి చిఱునవ్వుకుంది.

ఆమె దిగిపోయింది. రైలు ఆమె లేకుండనే కదలిపోయింది.

వేసవిఉక్క మళ్లీ ప్రారంభమయింది. బూట్సు కాళ్లని నలిపివేస్తున్నాయి. గబగబా విప్పి అల్లా ప్రక్కకు పారవేశాడు. కాళ్లకి కొంచెం గాలి తగలడంతో కొంత ప్రాణం లేచివచ్చింది. అమ్మయ్య! కాని మళ్లీ మొదటి నీరసమే. ప్రపంచకం మళ్లీ నిద్రపోతూ ఉంది.

'ఆమెవెంటనె పోయె నానంద మంతయును,' తనెప్పుడో వ్రాసినపద్యం జ్ఞాపకం వచ్చింది.

కాళ్లు ఎదురుగా ఉన్న బల్లమీదికి జాపుకుని వెనక్కి కొంచెం కేర్లబడ్డాడు. బండి వేగంగా పోతూ ఉండడంచేత బాగా శరీరానికి గాలి తగులుతూ ఉంది.

ఈ వేసవినీరసంలోనుంచి మళ్లీ అతనిలో వెనుక ఆలోచనలు పుట్టుకొచ్చాయి.

'నాబరువు బెడలోన స్వప్నములు మిలిసె,
దుఃఖభారములోన మాధుర్యమొదవె,'

ఇదీ తను వ్రాసిందే! ఏ నాటివో ఈ పద్యాల ఈ పరిస్థితికి అవి ఎంత బాగా సరిపోతున్నాయి! పద్యాలు వ్రాసినప్పుడు తనకు ఈ అనుభవం ఉందా ఏమో. అసలు ఏసందర్భంలో వ్రాసినవో ఈపద్యాల అతనికి స గా జ్ఞాపకం లేదు.

ఆమె అసలు ఎవరో? ఏ ఊరునుంచి వస ఉందో? ఏ బెజవాడనుంచో వస్తూఉండి ఉంటుం తను ఏలూరులో ఎక్కాడుగా మరి. తను ఎక్క ఆమె రైలులో ఉంది. అరెరే! అడగడం మర పోయాడు. ఆమె నిడదవోలులో మారి ఒకవేళ వర పురం రైలులో ఎక్కి ఉంటుందేమోగదా!

అదీ సంభవమే. పోనీ ఆమె ఎక్కడికి పోతేమా ఏమి? ఆమె పేరయినా అడగవలసింది. ఏదీ ఇ తొందరగా దిగిపోతుం దని అనుకోలేదు.

మళ్లీ ఆమెనెప్పుడయినా కలుసుకోగలుగుతా

కలుసుకోలేకపోవడమేమి? తప్పకుండా కలు కుంటాడు. రోజూ కలుసుకుంటాడు ఆమాటకొస్తే. పైకెత్తి ఆలోచిస్తున్నాడు.

ఆమె రోజూ ఆదారినే, అరైలులోనే ప ఉంటుందట. ఆ పెట్టెలో తను ఏలూరులో ఎక్క ఆమె ఆ పెట్టెలోనే ఉంటుందట. రోజూ ఆమెకొర లో ఆ వేళకే రావలసిన అవసరం ఏమి ఉంటుందో అ కక్కరలేదు. తను రోజూ ఏలూరు ఎందుకు వెళతా అంతకంటె అవసరం లేదు. తనూ ఆమెఏలూరునుంచి ని వోలుదాకా కలిసి, ఆ పెట్టెలోనే ఇంకెవరూ లేకుండా వస్తూఉంటారు అట. రెండురోజులవర ఆట్టే పరిచయంగాదు. మూడోనాడు అతడు ధైర్య చేసి ఏదో మాట్లాడిస్తాడు. ఆమె మాతృభాలుకం కొంచెం చనవుగానే జవాబు చెపుతుంది. ఆనాటి సంభాషణలో చాలావిషయాలు దొర్లిపోతాయట. ఊరు కొవ్వూరని ఆమె వొకసారి తప్పకుండా రమ

...ాడు. ఆమె వీలులేదని మృదువుగానే చెపుతుంది. ...రి ఆశయాలన్నీ ఒకటే! వారిద్దరికీ పరిచయం చాలా ...క్కువ అయినా వారిద్దరూ పరస్పరం కొన్ని శతాబ్దాల ...ంచి ఎరుగుదురు. తన కవిత్వమంతా ఆమెకు చదివి ...నిపిస్తాడు. ఆమె ఆశ్చర్యపోతుంది. ఇటువంటి కవిత్వం ...ంతవరకూ ప్రపంచకంలో పుట్టలేదంటుంది. ఆహాగ ...ే తనను సంతోష పెట్టడానికి ఉద్దేశించబడినా, తన ...విత్వాన్ని ప్రపంచకంలో ఎవరయినా అర్థం చేసుకో ...లిగితే, ఆమె ఒక్కత్తే అర్థంచేసుకో గలుగుతుంది.

వాలుగోనాడు ఆమెను కొవ్వూరు రమ్మం ...టాడు. ఆమె వెంటనే తొందరగా 'ఓ వీల్లేదు. క్షమిం ...చండి' అంటుంది. నిడదవోలు స్టేషను వచ్చేదాకా ...రామాలు సంభాషణే. కాని ఆమె మామూలుగా నిడదవో ...లులో దిగదు. ఇంక పైకి ఎక్కడికి వెడుతుందా, అను ...కుంటాడు. కొవ్వూరుస్టేషను వస్తుంది. అతడు దిగ ...తాడు. ఆమెనుకూడా దిగమంటాడు. ఆమె దిగనం ...టుంది. పోనీ ఒక సోడా అయినా త్రాగమంటాడు. ...రే నంటుంది. సోడా పావుగంట త్రాగుతుంది. రైలు ...దలిపోతుందేమోనన్న తొందర ఆమెకు ఉండదు. రైలు ...ఈల వేసి కదలిపోతుంది. రాముడు కంగారు పడుతూ అయ్యో! రైలులో సామానన్నా దింపలేదే' అంటాడు.

'ఈవేళ నే నేమీ సామాను తీసుకురాలేదు' అం ...టుంది ఆమె. ఆమెముఖంవంక తీక్ష్ణంగా చూస్తాడు. ...ఆమె చిలునవ్వు నవ్వుతుంది. అతనికీ నవ్వొస్తుంది. ఆమె ...నిజంగా తనతో కొవ్వూరు రావాలని ముందే నిశ్చయించు ...కున్నట్టు అంతవరకూ అతడు గ్రహించలేకపోతాడు.

ఇద్దరూ రైలుగట్టువెంబడి గోదావరి రైలువంతె ...నదాకా పోతారు. వంతెనక్రింద ఇసుక తిప్పమీద ...వరూ లేనిచోటికి పోయి కూర్చుంటారు. గోదావరి ...నదినుంచి చల్లనిగాలి వీస్తూ ఉంటుంది. సాయంకాల ...మయింది. ఎండవేడిమి తగ్గిపోయింది. రెల్లు దుబ్బులు ...హుషారుగా తలలు ఆడిస్తూ ఉంటాయి.

ఇద్దరికీ ఏమి మాట్లాడ్డానికీ, ఏమీ తోచదు. ఎవరి ...ఆలోచనలు వారి మనస్సులోనే అల్లుకుపోతూ ఉంటాయి. 'రోజూ అంత చనవుగా మాట్లాడుకునే వాళ్లం గదా, ఇప్పుడు మాటలే తోచవేం?' అనుకుంటూ అతడు. ఆమెకు కొంచెం దగ్గరగా జరుగుతాడు. ఆమెదేహం కొద్దిగా అతనికి తగులుతుంది.

అతనితల దిమ్మెక్కిపోతుంది. శరీరం ముచ్చెమటలూ పోశాయి. చేతులతో తల ఒకసారి తడుముకున్నాడు.

తనతల వెనకబల్లకి తంగుమని తగిలినట్టు క్రమంగా అతనికి తెలిసింది. లేచి సరిగా కూర్చున్నాడు. రైలు వెనక్కి ఒక సంజా సంజే నెమ్మదిగా సాగుతూ ఉంది. ఒక్కసారి ఆవులించి ఒళ్లు విరుచుకుంటూ పెట్టె తలుపు దగ్గరకు వచ్చాడు. స్టేషనులో దీపంమీద 'కొవ్వూరు' అని అస్పష్టంగా కనబడింది. కళ్లు నలుపుకుని మళ్లీ చూశాడు.

కొవ్వూరే !

అరెరె ! ఏమిటీ ఈ పరధ్యాన్నం ? పెట్టెతలుపు ఎల్లా తెరిచాడో అతనికే తెలియదు. కంగారుగా మెట్లమీద ఒకఅడుగువేసి క్రిందికి దూకాడు. రైలుకదులుతూ ఉన్న మూలంగా ముందరకు తూల్లపడ్డాడు. మోకాళ్లకు కొంచెం దెబ్బతగిలింది. లేచి దులుపుకున్నాడు. పంట్లాం మడతమాత్రం నలిగిపోలేదు! స్టేషను దాటి తొందరగా ఇంటికి పోవా లనుకున్నాడు.

రెండడుగులు వెయ్యడంతోటే కాళ్లు తేలికగా ఉన్నాయి. చూసుకుంటే కాళ్లకి బూట్సు లేవు. వెంటనే రైలువంక చూశాడు. రైలు ప్లాటుఫారం దాటి ముందుకు పోయింది. కొంతసేపటివరకూ అతనికే ఆలోచనా పోలేదు. దుస్తుల వంకచూసుకున్నాడు. ఇంక చొక్కా పంట్లాంలోపలికి ఉండడంలో అర్థంలే దనుకున్నాడు. పైకి తీసివేశాడు. 'ఛీ! బయలుదేరినవేళ మంచిది కాదు' అనుకున్నాడు. అప్పు డతనికి జ్ఞాపకం వచ్చింది.

'కుఱ్ఱతనమా ? మానవస్వభావమా !'

అతడు పకపకమని పైకే నవ్వుకున్నాడు.

---

# హిందూ దేశపు బట్టలతానుల వ్యాపారము

## ఉత్పత్తి : దిగుమతులు

శ్రీ సి. వి. దీక్షితులు

జరిగిన పదిసంవత్సరములలోను (అనగా ౧౯౨౭ మొదలు ౧౯౩౬-వ సంవత్సరము ఆఖరువరకును) బట్టలతానుల[2] వ్యాపారమందు మన దేశమున కలిగిన మార్పులను పరిశీలించుటయే ఈ వ్యాసముయొక్క ఉద్దేశము. అనేక కారణములవలన ఈ పది సంవత్సరముల కాలమును చాల ప్రాముఖ్యమైనది. ౧౮౯౪-వ సంవత్సరమునుండియు విధింపబడుచుండెడి ఉత్పత్తిపన్ను ౧౯౨౬-వ సంవత్సరమున తొలగింపబడుటచే దేశీయపరిశ్రమల పై భారము కొంత తగ్గినది. ప్రభుత్వాదాయము హెచ్చుట చేతను, బ్రిటనునుండియు, విదేశములనుండియు వచ్చు దిగుమతులపై రక్షణ సుంకములు విధింపబడుటచేతను ౧౯౩౦-వ సంవత్సరమునుండియు దేశీయపరిశ్రమకు లాభము చేకూరజొచ్చినది. కొంచె మించుమించు ఆ సమయముననే ప్రారంభింపబడిన శాసనోల్లంఘనోద్యమమును, దాని ననుసరించిన విదేశవస్త్ర బహిష్కారోద్యమమును,— అందునను బ్రిటనునుండి వచ్చు దిగుమతులపై ఈబహిష్కారము తీవ్రముగా నడపబడుటచేతను—మన దేశపు బట్టల తాను వ్యాపారమందు కొన్ని ముఖ్యమగు మా లకు కారణమైనవి. పైన వివరించిన లా దాయకములగు విషయము లన్నియు దేశీ పరిశ్రమ కెట్లు తోడ్పడినదియు ఆ పది స త్సరములలోను మన దేశమునందలి ఉత్ప లను, మన దేశమునకు వచ్చిన దిగుమ లను సూచించును. ఒకవంక లాభదా ములగు పై సందర్భము లట్లుండగా, ఇంకొ వంక జపానునుండి వచ్చు చౌకరకపు బ పరిమాణము అసాధారణముగా పెరిగిపో మన దేశమునంతను ముంచెత్తుచుండుట ప్రభుత్వ మావిషయమున ప్రత్యేకచ తీసుకొనవలసివచ్చినది. అదికాక పై పది స త్సరముల కాలము తుదను, ఇంగ్లాండులో లాంకషైరు వ్యాపారస్థులు తమ సరకుల దిగుమతి పన్నులు తగ్గించవలసినదని గొ చేయ నారంభించిరి; వారి ప్రయత్న లప్పటిలో కొంతవరకు ఫలించుట ౧౯౩౬-వ సంవత్సరమున వా రింకొ

1. ఈ వ్యాసము ౧౯౪౦-వ సంవత్సరమున వ్రాయబడినది.

2. బట్టల తానులు అనపదము ఈ వ్యాసమునందు 'పీస్ గుడ్స్' (Piece-goods) అను ఇంగ్లీ పదమునకు మారుగా ఉపయోగింపబడినది. ఇందు, కోరాతానులు, మల్లుతానులు, చొక్కాగుడ్డ ధోవతులు, లాంగ్ క్లాత్ (Long cloth), డ్రిల్లుగుడ్డలు, రంగుగుడ్డలు మొదలగునవి చేరును.

క్కువ తగ్గింపులకై యలజడి ప్రారంభించిరి. ట్టి పరస్పర విరుద్ధములగు పాటు పోటుల లితము ఆ కాలమునందలి ఉత్పత్తి, దిగు మతుల లెక్కలను జాగ్రత్తగా పరిశీలించి ట్లయిన మనకు వ్యక్తమగును.

పై కాలమున మన దేశమునం దుత్పత్తియైన ట్టలతానుల లెక్కలు ఈ క్రింది పట్టికయం యబడినవి.

౧-వ పట్టిక

ందూదేశపుమిల్లులలో బట్టలతానుల ఉత్పత్తి

| సంవత్సరము | ఉత్పత్తి, కోట్లగజములలో | | |
|---|---|---|---|
| | కోరా, తెలుపు | రంగులు | మొత్తము |
| ౧౯౨౭ | ౧౬౮ | ౬౮ | ౨౩౬ |
| ,, ౨౮ | ౧౪౧ | ౪౮ | ౧౮౯ |
| ,, ౨౯ | ౧౮౨ | ౬౦ | ౨౪౨ |
| ,, ౩౦ | ౨౦౦ | ౫౬ | ౨౫౬ |
| ,, ౩౧ | ౨౩౧ | ౬౮ | ౨౯౯ |
| ,, ౩౨ | ౨౪౨ | ౭౫ | ౩౧౭ |
| ,, ౩౩ | ౨౨౭ | ౬౮ | ౨౯౫ |
| ,, ౩౪ | ౨౬౪ | ౭౬ | ౩౪౦ |
| ,, ౩౫ | ౨౭౭ | ౮౦ | ౩౫౭ |
| ,, ౩౬ | ౨౭౬ | ౮౧ | ౩౫౭ |

పై వివరములవలన తేలున దేమనగా, ౨౭-వ సంవత్సరమున హిందూదేశము దు మొత్తము ౨౪౦ కోట్ల గజముల తానులు తయారుకాగా ౧౯౩౭-వ సంవత్సర లో ౩౬౦ కోట్ల గజముల తానులు యారైనవి; అనగా ఈ పదిసంవత్సరము లో దేశీయోత్పత్తి నూటికి ౫౦ వంతున రిగినది; ఈ పెరుగుదలలో ఎక్కువ గము ౧౯౩౦-వ సంవత్సరమునకు తరు తనే సంభవించినది. ఇంకొక విశేష మేమన, ఈ కాలమున కోరా తానుల, తెల్ల తానుల ఉత్పత్తినూరింట అరువదిపాళ్లు పెరు గగా, రంగు గుడ్డలలో పెరుగుదలమాత్రము నూరింట ఇరువదిపాళ్లకు తక్కువగా నున్నది. అయినను కోరా, తెల్లతానులు మొత్తము ఉత్పత్తిలో నూరింట ఎనుబది పాళ్లు ఆక్రమించుకొన్నవి; ఎక్కువ పెరుగు దల కూడ ఈ విషయముననే కాన్పించు చున్నది. దిగుమతి లెక్కలలో చూపించి నట్లు ఉత్పత్తి లెక్కలలో కూడ కోరా, తెల్లతానుల వివరములు వేరు వేరుగా చూపించి యుండినట్లయిన ఎక్కువ ఉపయో గముగా నుండెడిది. అప్పుడు కోరాతానుల ఉత్పత్తి ఎంత అధికమయినదో, తెల్లతానుల ఉత్పత్తి ఎంత అధికమయినదో మనము సులు వుగా తెలుసుకొనుటకు వీలయ్యెడిది. ప్రస్తు తము ఈ వివరములు ప్రత్యేకముగా లభిం చుటలేదు. అయినను ఈ విషయమున విస్తా రము అనుభవము కలవారు కోరాతానులే ఎక్కువగా తయారైనవని చెప్పుచున్నారు.

దిగుమతి వ్యాపారము

దిగుమతివ్యాపారమును మనము సరిగా అర్థము చేసుకొనవలె ననిన దిగుమతులను మూడు విధములుగా విభజించవలసి యున్నది; అవేవన (౧) కోరా, (౨) తెల్ల తానులు, (౩) రంగు తానులు - ఇట్లు విభ జించిన పిదప ఈ సరకులను మనకు ముఖ్య ముగా పంపించుచున్న బ్రిటను, జపానుదేశ ములు ప్రత్యేకముగా ఎంతెంత దిగుమతి చేయుచున్నవో ప్రత్యేకముగా తెలుసుకొన వలసియున్నది.

౨-వ పట్టిక
కోట్ల గజములలో వివిధరకముల
బట్టలతానుల దిగుమతులు

| సంవత్సరము | కోరా తానులు | | | తెల్ల తానులు | | | రంగు తానులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము | బ్రిటను | జపాను | మొత్తము | బ్రిటను | జపాను | మొత్తము | బ్రిటను | జపాను |
| ౧౯౨౭ | ౮౮ | ౬౫ | ౨౨ | ౫౭ | ౫౩ | ౧ | ౫౧ | ౩౫ | ౧౦ |
| ౧౯౨౮ | ౮౪ | ౫౮ | ౨౬ | ౫౫ | ౫౩ | ౧ | ౫౧ | ౩౪ | ౧౧ |
| ౧౯౨౯ | ౯౩ | ౫౨ | ౪౦ | ౪౭ | ౪౪ | ౧ | ౪౮ | ౨౮ | ౧౫ |
| ౧౯౩౦ | ౩౭ | ౧౪ | ౨౨ | ౨౭ | ౨౩ | ౩ | ౨౫ | ౧౫ | ౭ |
| ౧౯౩౧ | ౨౫ | ౬ | ౧౯ | ౨౮ | ౨౧ | ౬ | ౨౨ | ౧౧ | ౧౦ |
| ౧౯౩౨ | ౩౬ | ౧౧ | ౨౪ | ౪౧ | ౨౮ | ౧౨ | ౪౩ | ౧౯ | ౨౧ |
| ౧౯౩౩ | ౨౩ | ౯ | ౧౪ | ౨౬ | ౧౮ | ౮ | ౨౭ | ౧౪ | ౧౨ |
| ౧౯౩౪ | ౩౦ | ౧౦ | ౧౯ | ౨౯ | ౨౪ | ౪ | ౩౬ | ౨౧ | ౧౪ |
| ౧౯౩౫ | ౩౩ | ౯ | ౨౫? | ౨౬ | ౨౦ | ౬ | ౩౫ | ౧౬ | ౧౯ |
| ౧౯౩౬ | ౨౬ | ౫ | ౨౧ | ౨౨ | ౧౬ | ౫ | ౨౭ | ౧౨ | ౧౬ |

పై పట్టికను బట్టి తేలుచున్నది. ౧౯౩౦-వ సంవత్సరమునకు పూర్వము హిందూదేశమునకు సగటున ౮౪ కోట్ల గజముల కోరా తానులు దిగుమతి యగుచుండెడివి. ప్రారంభమున ఈ వ్యాపారములో నూరింట ౭౫ పాళ్లు బ్రిటను చేతులలోను, శేషించినది జపాను చేతులలోను ఉండెడిది. కాని రాను రాను ఆ సంవత్సరమున కాసంవత్సరము జపాను దిగుమతులు బ్రిటను దిగుమతులను త్రోసిరాజని వానిస్థానము నాక్రమింపజొచ్చినవి. అయినను కొన్నాళ్లపాటు జపానునుండి వచ్చు దిగుమతులకంటె బ్రిటను నుండి వచ్చు దిగుమతులే హెచ్చుగా నుండెడివి. ౧౯౩౦-వ సంవత్సరమునకిక దిగుమతులు నూటికి అరువదిపాళ్లు పడిపోయినవి. ఇందువలన రెండు దేశములును దెబ్బతినినప్పటికి ఆ దెబ్బ బ్రిటనుకే ఎక్కువగా తగిలినది; జపాను బ్రిటనుయొక్క ప్రథమస్థాన మాక్రమించుకొన్నది. అన్ని విధములచేతను ౧౯౩౦ కంటె ౧౯౩౧ టవ సంవత్సరము ఎక్కువ చెడ్డ దనిపించుకొన్నది. అటు పై సంవత్సరమున వ్యాపారము కొంచెము ముందంజ వేసినను ఆ పిమ్మట మరల దిగుమతులు పడిపోవుచునేవచ్చెను. కోరా దిగుమతుల విషయమున బ్రిటను స్థానము నీచమై తుదకు గణనకు రాకుండపోయినది.

ఇక తెల్లతానుల విషయ మాలోచించినచో ౧౯౩౦-వ సంవత్సరము తరువాత దిగుమతులు పడిపోయినను వీనిస్థితి కోరా తానులస్థితియంత చేటుగా లేదు. ఈ రకమున బ్రిటను ఆక్రమించుకొన్న స్థానము నుండి జపాను దానిని కదపలేకపోయినది: కాని జపాను తెల్ల తానులను అదివరకుకంటె ఎక్కువగానే దిగుమతి చేయుచు వచ్చినది.

రంగు తానుల విషయమున కూడ ౧౯౩౦-వ సంవత్సరము తరువాత పై తగ్గుదలయే కనిపించినది. ఈ రకమందు మొట్ట మొదటిసారి ౧౯౩౩ లో బ్రిటనుయొక్క ఆధిక్యము పడిపోయినది. ౧౯౩౪లో బ్రిటను తిరిగి ప్రథమస్థానము నాక్రమించుకొన్నను, అటుపిదప తా నా స్థానమును నిలుపుకొనజాలకపోయినది.

పై విషయములనుబట్టి ౧౯౩౦-వ సంవత్సరముతరువాత హిందూదేశములోనికి విదేశపు తానుల దిగుమతులు చాలవరకు తగ్గిపోయిన వనియు, మిగిలిన కొలదిపాటి దిగుమతులలో కూడ బ్రిటను తన స్థానమును నిలుపుకొనజాలక జపానుకు వదలివేసిన దనియు స్పష్ట మగుచున్నది.

### దిగుమతులు పడిపోవుటకు కారణములు

జాతీయోద్యమము:— ౧౯౩౦-వ సం
త్సరములో గాంధిమహాత్ముడు ప్రారంభిం
న శాసనోల్లంఘనోద్యమము జాతీయ
వమును లెస్సగా పురికొల్పినది. దానికి
హాయభూతముగా ప్రారంభించిన విదేశ
స్త్రబహిష్కారము ముఖ్యముగా బ్రిటను
ండి వచ్చు దిగుమతులవంకకే కేంద్రీక
పబడినది. హరతాళములును, ముఖ్యమగు
వ్యాపారస్థానములలో (markets) విదేశపు
ట్టల నమ్మెడి కొట్లముంగట పికెటింగులును
cketing) తరుచు జరుగుచుండుటచేత
వ్యాపారము స్తంభించిపోయినది. తరువాత
రువాత ఈ ఉద్యమము తగ్గిపోయినను ప్రజా
హృదయమున నది స్వదేశాభిమానమును
ర్తిగా రేకెత్తించినది. అంతేకాక స్వదేశీ
శ్రమ మన మార్కెట్లలో పాతుకొనుటకు
ంచి అవకాశము కలుగజేసినది.

ఆర్థిక పద్ధతులలో మార్పులు:—
౩౦-వసంవత్సరమునకు పూర్వము అన్ని
శముల నూలుసరకులపైనను వానివిలువ
నూటికి ౧౧ వంతున దిగుమతిపన్ను వేయ
బడుచుండెడిది. ౧౯౩౦-వ సంవత్సరమున
యబడిన రక్షణ చట్టము ప్రకారము
otton protection Act of 1930) ఈ దిగుమతి
న్ను బ్రిటిషుసరకులపై నూటికి ౧౫
రకును, బ్రిటిషుసరకులు కాని విదేశపు
రకులపై నూటికి ౨౦ వరకును హెచ్చింప
బడుటయు, కోరాతానులపై పౌనుబరువుకు
ముడున్నర అణాలకు తక్కువగాని కసీసపు
న్ను విధింపబడుటయు జరిగినది. ఈవిధ
ముగా బ్రిటనునుండి వచ్చుసరుకులు ఎక్కువ
దరమును బడయజొచ్చినవి. అట్టి ఆదరము
తరువాతిసంవత్సరములలో కూడ చూప
బడుచునే వచ్చినది. ౧౯౩౧-వ సంవత్సరము
మార్చి నెలలో దేశముయొక్క ఆర్థిక పరిస్థి
తులవలన బ్రిటిషుసరకులపై పన్ను నూటికి
ఇరువదివరకును, ఇతర దేశములనుండి వచ్చు
సరకులపై పన్ను నూటికి ఇరువదియైదువర
కును హెచ్చించుట అవసరమైనది. అంతే
కాక ౧౯౩౧-వ సంవత్సరము అక్టోబరు
నెలలో తయారుకాబడిన అత్యవసర బడ్జె
టులో అప్పుడున్న పన్నులపై నూరింట యిరు
వదియైదుపాళ్లు అదనపుపన్ను విధింపబడు
టచే బ్రిటిషుసరకులపై పన్ను నూటికి ౨౫
వరకును, ఇతర దేశముల సరకులపై పన్ను
నూటికి ౩౧ ¼ వరకును పెరిగినది. అటుపిమ్మట
౧౯౩౨-వ సంవత్సరములో జపాను తన
కర్రెన్సీ విలువను తగ్గించివేయుటచే దాని
ఫలితములు నరికట్టుటకుగాను ఇతర దేశపు
సరకులపై దిగుమతిపన్ను వాటి విలువలో
నూరింట ఏబదిపాళ్లవరకును హెచ్చింపబడి
నది. మొదటినుండియు, బ్రిటిషుసరకులపై
పన్ను ఆదాయముకొరకు మాత్రమే అనియు,
ఇతర దేశముల సరకులపై పన్ను రక్షణ
నిమిత్త మనియు ఇండియాప్రభుత్వము
నొక్కి చెప్పుచుండెడిది. దిగుమతి సుంకము
లకు కారణ మేదైనను ఈ పన్నులు దిగుమ
తులను తగ్గించుటకు మిక్కిలి యుపయోగిం
చినవి. మొట్టమొదట తాత్కాలికమే యని
భావించిన ఈ దిగుమతులయొక్క అపార
మైన తగ్గుదలకు కలవరపడి, ఇండియా ఆఫీసు
ద్వారా లాంకషైరు తన పలుకుబడిని ఇం
డియాప్రభుత్వముపై వినియోగించుటచే,
౧౯౩౪ వ సంవత్సరపు ఇండియా టారిఫ్
బోర్డు (Indian Tariff Board) సూచ

పల ప్రకారము బ్రిటిషు సరకులపై పన్ను ౧౯౩౬-వ సంవత్సరమున నూటికి ఇరువదివరకును తగ్గింపబడినది. అయినను ఈ తగ్గింపు మన దేశపు బట్టలతానుల వ్యాపారములో అంత మార్పేమియు కలుగజేసి యుండలేదు. ఈ మధ్య జరుగుచున్న బ్రిటను ఇండియాలయొక్క పరస్పరవర్తకమును గూర్చిన సంభాషణలలో ఈ సుంకములను బాగుగా తగ్గించవలెనని బ్రిటిషువర్తకులు చేయుచున్న ఒత్తిడి ఒడంబడికషరతులు త్వరగా కుదరకుండుటకు కారణమైనది.[3]

ప్రజల కొనుగోలుశక్తి:- హిందూదేశములో నూలుతానుల చెల్లుబడి ముఖ్యముగా వ్యవసాయదారుల కొనుగోలుశక్తిపై నాధారపడియున్నది. మన దేశమున ప్రజలలో నూటికి ౭౫ గురికి పైగా వ్యవసాయమే ముఖ్యాధారముగా గలవారు. వారి కేదైన నష్టము వాటిల్లిన నూలుబట్టల చెలామణీ తగ్గిపోవును. ౧౯౩౦-వ సంవత్సరము తరువాత ధరలు విపరీతముగా పడిపోవుటచే, ముడిసరకులయొక్కయు, తయారైన సరకులయొక్కయు వెలలో తేడా అధికమై వ్యవసాయదారుల కొనుగోలుశక్తి మిక్కిలి క్షీణించిపోయినది అందువలన ప్రజాబాహుళ్యముయొక్క దృష్టి వెల అధికమగు సరకులనుండి వెల తక్కువ యగు సరకులపైకి మరలినది. ఆ హేతువువలననే హిందూదేశములో తయారగుచున్నట్టియు, జపానునుండి దిగుమతి యగుచున్నట్టియు చౌకరకపు బట్టలు విరివిగా చెలామణి యగుచుండగా, బ్రిటనునుండి దిగుమతి యగు వెల యధిక మగు సరకులను కొనువారి సంఖ్య తగ్గిపోయినది.

మూడవ పట్టిక

హిందూదేశపుమార్కెట్లలో చెలామణియగుచున్న సరకులలో దిగుమతులు, దేశీయ సరకులు—వీని వివరములు

| సంవత్సరము | కోట్లగజములలో | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | నికరపు దిగుమతులు† | దేశములో తయారైన సరకు | | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| | | మిల్లులు | చేతి మగ్గములు | | | | |
| ౧౯౨౭ | ౧౮౦ | ౨౩౬ | ౧౨౭ | | ౫౧౭ | | |
| ,, ౨౮ | ౧౭౭ | ౧౮౯ | ౧౦౩ | | ౪౪౫ | | |
| ,, ౨౯ | ౧౭౯ | ౨౮౨ | ౧౩౫ | | ౫౩౪ | | |
| ,, ౩౦ | ౮౦ | ౨౫౬ | ౧౩౪ | | ౪౫౧ | | |
| ,, ౩౧ | ౬౭ | ౨౯౯ | ౧౪౬ | | ౪౯౧ | | |
| ,, ౩౨ | ౧౧౩ | ౩౧౭ | ౧౬౬ | | ౫౭౯ | | |
| ,, ౩౩ | ౬౯ | ౨౯౫ | ౧౪౦ | | ౪౮౮ | | |
| ,, ౩౪ | ౮౫ | ౩౪౦ | ౧౪౨ | | ౫౫౦ | | |
| ,, ౩౫ | ౮౫ | ౩౫౭ | ౧౬౧ | | ౫౮౭ | | |
| ,, ౩౬ | ౬౬ | ౩౫౭ | ౧౪౫ | | ౫౫౩ | | |

ఈ పట్టికను బట్టి ౧౯౩౦-వ సంవత్స[రము]నకు ముందు మన దేశములో ౫౦ కోట్ల గజముల నూలుగుడ్డలు ఖర్చగుచు[న్న]దుట చూడ నగును. ఒక్క ౧౯౨౮-వ సంవత్సరమున మాత్రము దేశీయోత్ప[త్తి] తక్కువగా నున్నది; అందులకు కారణము ఆ సంవత్సరమున బొంబాయిలో చాల ది

3. ఈ మధ్యనే ఇండియాకును బ్రిటనుకును లండనులో పాటింపు వర్తకమును గూర్చి ఒక ఒ[డం]బడిక జరిగినది.

† నికరపు దిగుమతు లనగా, దిగుమతులలోనుండి తిరిగి ఎగుమతి చేయబడిన భాగము పోగా, శేషించినవి

ులు సమ్మె జరుగుటయే. ౧౯౩౦, ౩౧-వ ంవత్సరములలో సరకు చెల్లుబడి తక్కువగా ండుటకు ఆ సంవత్సరములలో ఆర్థికదుర స్థయును, వ్యాపారమును స్తంభింపజేసిన దేశవస్త్ర బహిష్కారమును హేతువులు. గుమతులలోని విస్తారమైన తగ్గుదలను మరి ంత కాలమువరకును దేశీయోత్పత్తి ార్తిచేయలేకపోయినది. దిగుమతుల తగ్గు లవలన గలిగిన లాభములో చాలభాగ ు దేశమందలి మిల్లులకే చేకూరినది ; చేతి గ్గములు పొందిన లాభము చాల స్వల్ప ు. ఈ కాలమున మిల్లుల ఉత్పత్తి నూటికి బది వంతున పెరుగగా చేతిమగ్గముల త్పత్తి నూటికి ౧౦-౧౫ వరకు మాత్రమే రిగినది. పై పట్టికవలన స్వదేశీ మార్కె-ట్లలో జరుగుచున్న మార్పు — అనగా దేశమందలి మిల్లులలో తయారైన సరకులు క్రమముగా విదేశీ దిగుమతుల స్థానము నెట్టాక్రమించుకొనుచున్నవో - చక్కగా విశదము కాగలదు.

ముఖ్యమగు రకముల బట్టలలో - అనగా ధోవతులు, చొక్కా-గుడ్డలు, డ్రిల్లులు, రంగుబట్టలు, వీనిలో — దేశీయోత్పత్తి ఎంతయో, దిగుమతు లెంతయో తెలుసుకొనుటవలన కొంత యుపయోగ ముండ వచ్చును. ఈ క్రింది పట్టికలో ఆ వివరము లీయబడినవి.

ఈ క్రింది పట్టికవలన స్పష్టమగున దేమనగా మొదటలో మన దేశమున ఖర్చగుచున్న

౪-వ పట్టిక

రకరకముల బట్టలలో దిగుమతులను, దేశీయోత్పత్తిని సూచించును

| సంవత్సరము | కోట్లగజములలో | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కోరా, తెలుపు తానులు | | | | | | | | | రంగు తానులు | | |
| | ధోవతులు | | | చొక్కా-గుడ్డలు, లాంగ్ క్లాత్ * | | | *డ్రిల్లులు, జీన్ గుడ్డలు* ఇతరములు | | | | | |
| | దిగుమతులు | ఉత్పత్తి | మొత్తం | దిగుమతులు | ఉత్పత్తి | మొత్తం | దిగుమతులు | ఉత్పత్తి | మొత్తం | దిగుమతులు | ఉత్పత్తి | మొత్తం |
| ౧౯౨౭ | ౬౦ | ౬౮ | ౧౨౮ | ౩౫ | ౬౨ | ౯౭ | ౧౮ | ౯౧ | ౧౦౯ | ౫౦ | ౬౮ | ౧౧౮ |
| ,, ౨౮ | ౫౩ | ౬౨ | ౧౧౫ | ౩౮ | ౪౭ | ౮౫ | ౧౮ | ౭౬ | ౯౪ | ౫౧ | ౪౮ | ౯౯ |
| ,, ౨౯ | ౫౫ | ౮౪ | ౧౩౯ | ౪౪ | ౫౯ | ౧౦౩ | ౨౦ | ౧౦౦ | ౧౨౦ | ౪౮ | ౬౦ | ౧౦౮ |
| ,, ౩౦ | ౧౯ | ౮౯ | ౧౦౮ | ౨౪ | ౬౪ | ౮౮ | ౬ | ౮౧ | ౮౭ | ౨౫ | ౫౬ | ౮౧ |
| ,, ౩౧ | ౯ | ౧౦౨ | ౧౧౧ | ౨౧ | ౭౯ | ౧౦౦ | ౭ | ౧౦౩ | ౧౧౦ | ౨౨ | ౬౮ | ౯౦ |
| ,, ౩౨ | ౧౪ | ౧౧౬ | ౧౩౦ | ౨౯ | ౭౫ | ౧౦౪ | ౫ | ౧౦౮ | ౧౧౩ | ౪౨ | ౭౫ | ౧౧౭ |
| ,, ౩౩ | ౧౦ | ౧౦౪ | ౧౧౪ | ౧౯ | ౭౩ | ౯౨ | ౭ | ౯౭ | ౧౦౪ | ౨౭ | ౬౮ | ౯౫ |
| ,, ౩౪ | ౧౨ | ౧౧౭ | ౧౨౯ | ౨౨ | ౮౬ | ౧౦౮ | ౪ | ౧౧౫ | ౧౧౯ | ౩౬ | ౭౬ | ౧౧౨ |
| ,, ౩౫ | ౧౩ | ౧౩౦ | ౧౪౩ | ౨౬ | ౮౪ | ౧౧౦ | ౬ | ౧౨౯ | ౧౩౫ | ౩౫ | ౮౦ | ౧౧౫ |
| ,, ౩౬ | ౧౦ | ౧౧౮ | ౧౨౮ | ౨౨ | ౯౦ | ౧౧౨ | ౪ | ౧౩౭ | ౧౪౧ | ౨౮ | ౮౧ | ౧౦౯ |

† Longclcth, Drills, Jeans - ఇవి ప్రత్యేకరకముల నూలుగుడ్డలు.

౧౩౦ కోట్ల ధోవతులలోను ౭౦ కోట్ల గజములిచ్చటనే తయారగుచుండగా శేషించిన ౬౦ కోట్ల గజములును విదేశముల నుండి దిగుమతి కావలసివచ్చెడిది; అనగా నూరింట ౫౫పాళ్లు దేశీయోత్పత్తి, ౪౫పాళ్లు దిగుమతులు. కాని రానురాను ప్రతి సంవత్సరమును దేశీయోత్పత్తి అధికమై దిగుమతులు పడిపోవజొచ్చినవి; ఈ పది సంవత్సరముల తుదను మొత్తములో నూరింట తొమ్మిది పాళ్లకు దిగుమతులు పడిపోయినవి.

చొక్కాగుడ్డలు, లాంగ్‌క్లాత్ వీని విషయమున దేశీయోత్పత్తి మొదట మూడింట రెండుపాళ్లతో ప్రారంభించి తుదకు నూరింట ఎనుబదిరెండు పాళ్లవరకును చేరినవి. అయితే ఈ విషయమున పెరుగుదల ధోవతుల విషయమునం దంత తృప్తికరముగా లేదు.

డ్రిల్లుగుడ్డలు, జీన్స్ అనబడునవి :— వీని దేశీయోత్పత్తి ప్రారంభములో నూరింట ౮౩ పాళ్లనుండి తుదకు నూరింట ౯౭ పాళ్ల వరకును పెరిగినది.

ఈవిధముగా కోరాతానులు, తెల్లతానులును అన్నిరకములు మొత్తముమీద దేశీయోత్పత్తిలో నూటికి ౫౦ నుండి ౮౫ వరకును పెరుగుదల చూపినవి. కాని రంగుగుడ్డల దేశీయోత్పత్తి నూరింట ౫౪ నుండి ౭౪ వరకుమాత్రమే పెరిగినది.

ఇట్లు ధోవతులు, డ్రిల్లు గుడ్డలు మొదలగు కొన్ని రకములవిషయమున, ఏకొద్ది మొత్తపు ప్రత్యేకమైన సరకుల యవసరమునో మినహాయించినచో, హిందూదేశము తనమీదనే యాధారపడి నిలువగల స్థితికి వచ్చినది. కాని చొక్కాగుడ్డలు,లాంగ్‌క్లాత్ విషయమునను ముఖ్యముగా రంగు గుడ్డ విషయమునను హిందూదేశము పరాపే లేకుండ నుండవలె ననిన, ఇంకను చాల అభివృద్ధి పొందవలసియున్నది. హిందూ దేశము స్వోత్పత్తిపై నాధారపడియుండవ నని చెప్పునప్పుడు రెండు సంగతులు ముఖ్యముగా గుర్తు పెట్టుకొనవలెను. అవే వనగా (౧) స్వదేశీ పరిశ్రమ ఎంత సమర్థతతో నడపబడినను కొన్ని ప్రత్యేకతరగతుల ప్రజ వాంఛలను తృప్తిపరచుటకు ఏవో కొన్ని రకముల బట్టలు సాధారణముగా ఎప్పుడును దిగుమతి యగుచునేయుండును; (౨) బ్రిటనకును జపానునకును హిందూదేశము ము ప్రత్తిని ఎగుమతి చేయుచుండుటచే దాని బదులుగ ఆ దేశములనుండి ఏదో కొంతవ కైనను కొన్ని బట్టలు దిగుమతి చేసికొన తప్పనిసరి యగును.

## హెచ్చు దిగుమతిసుంకములవలని లాభముల

౧౯౩౦-వ సంవత్సరమును అంతకు ముందు సంవత్సరములతో పోల్చి చూచి ట్లయిన అన్నిరకముల బట్టలలోను దేశీయో త్పత్తి ఒక్కసారిగా పైకి గంతువేసిన ద విశదమగును; తరువాతి సంవత్సరములలో కూడ ఈ యభివృద్ధి కనిపించుచునేయున్నది ౧౯౩౦, ౧౯౩౧-వ సంవత్సరములలో జా యోద్యమము విదేశపు సరకుల దిగుమతు లను చాలవరకు అరికట్టిన దనుట నిర్వివా దాంశము. అయినప్పటికిని ౧౯౩౦-వ సం త్సరమునుండియు విదేశవస్త్రములపై వేయ బడిన హెచ్చు దిగుమతి పన్నులు దేశీయ పరిశ్రమ జాతీయోద్యమమువలన తాన పొందిన లాభములను నిలుపుకొని కాల

లువ ద్రొక్కుకొని, తనస్థితిని బలపరుచుకొనుటకు బాగుగా ఉపకరించిన వని మాత్రము చెప్పక తప్పదు. బర్మాకు విదేశములనుండి సుంకములకు లోనై దిగుమతి యైనట్టియు, హిందూదేశమునుండి సుంకములు లేకుండ దిగుమతి యగునట్టియు బట్టలతానుల లెక్కలను పోల్చి చూచితిమేని ఈవిషయము మనకు సులభముగా తెలియగలదు. అందు రాజకీయముల సంబంధ మేమియును లేదు ; ఏమన ఆకోజులలో హిందూదేశమున కలవరము కలుగజేసిన జాతీయోద్యమము బర్మాలో అణుమాత్రమును వ్యాపించియుండ లేదు.

౫-వ పట్టిక

బర్మాకు బట్టలతానుల దిగుమతులు

| సంవత్సరము | కోట్లగజములలో | | | |
|---|---|---|---|---|
| | దిగుమతులు | | | దిగుమతుల మొత్తములో హిందూదేశమునుండి వచ్చినవి నూటికి పాళ్లు |
| | హిందూ దేశమునుండి | ఇతర దేశములనుండి | మొత్తము | |
| ౧౯౨౭ | ౩౨ | ౧౩౨ | ౧౬౪ | ౧౯ |
| ,, ౨౮ | ౩౨ | ౧౨౧ | ౧౫౩ | ౨౧ |
| ,, ౨౯ | ౨౯ | ౧౪౫ | ౧౭౪ | ౧౭ |
| ,, ౩౦ | ౨౭ | ౧౦౫ | ౧౩౨ | ౨౦ |
| ,, ౩౧ | ౫౧ | ౯౯ | ౧౫౦ | ౩౪ |
| ,, ౩౨ | ౪౮ | ౧౪౦ | ౧౮౮ | ౨౬ |
| ,, ౩౩ | ౭౭ | ౮౦ | ౧౫౭ | ౪౯ |
| ,, ౩౪ | ౯౯ | ౮౦ | ౧౭౯ | ౫౫ |
| ,, ౩౫ | ౬౯ | ౯౯ | ౧౬౮ | ౪౧ |
| ,, ౩౬ | ౮౩ | ౭౩ | ౧౫౬ | ౫౩ |

౧౯౩౦-వ సంవత్సరము వరకును బర్మాకు ఇతరదేశములు ౧౩౨ కోట్లగజముల గుడ్డను ఎగుమతి చేయుచుండగా హిందూదేశము ౩౦ కోట్లగజముల గుడ్డమాత్రమే ఎగుమతి చేయుచుండెడిది. ౧౯౩౦-వ సంవత్సరము తరువాత ఒకవంక ఇతరదేశములనుండి బర్మాకు వచ్చు దిగుమతులు తగ్గుచుండగా హిందూదేశమునుండి బర్మాకు వచ్చుచున్న దిగుమతుల సంఖ్య క్రమముగా హెచ్చినది. బర్మా, హిందూదేశముల వ్యాపారచరిత్రలో మొట్టమొదటిసారి ౧౯౩౪-వ సంవత్సరమున హిందూదేశమునుండి బర్మాకు వచ్చు దిగుమతుల పరిమాణము ఇతరదేశములనుండి బర్మాకు వచ్చుదిగుమతుల పరిమాణమును మించినది. ౧౯౩౫-వ సంవత్సరమున ఈస్థితి తారుమారైనను, ౧౯౩౬-వ సంవత్సరమున హిందూదేశమునుండి దిగుమతుల పరిమాణము తిరిగి హెచ్చినది. హిందూదేశమునకును, బర్మాకును ఇతరదేశములనుండి వచ్చు దిగుమతులపై హెచ్చు పన్నులు వేయుటవలన హిందూదేశములోని మిల్లులు పొందుచున్న లాభము విశదము కాగలదు; దిగుమతిపన్నులు హెచ్చు చేయబడిన కాలముననే వ్యాపారముకూడ అభివృద్ధి చెందినది.

## పర్యవసానము

పైన చెప్పబడినదానినిబట్టి తేలునదేమనగా : దేశీయోత్పత్తియొక్కయు, జపానునుండి వచ్చు దిగుమతులయొక్కయు తీవ్రమగు పోటీకి తాళలేక బ్రిటను హిందూదేశపు మార్కెట్టులో తా నిదివరకు వహించిన ప్రాముఖ్యమును పోగొట్టుకొన్నది. జపానునుండి వచ్చు దిగుమతులపైకంటె బ్రిటనునుండి వచ్చు దిగుమతులపై సుంకములు చాల తక్కువ యైనను జపాను జయప్రదముగా బ్రిటనుతో పోటీ చేయుచున్నది.

స్వదేశీమిల్లు లన్ననో ధోవతులు, డ్రిల్లుగుడ్డలు, గృహోపయోగములగు ఇతర రకముల బట్టలు — వీనిలో జరుగుచున్న వ్యాపార మంతయు కైవసమొనర్చుకొనినవి. లాంగ్ క్లాత్ లోను, చొక్కాగుడ్డల లోను జరుగు వ్యాపారములో నూటికి ఏను బదిపాళ్ల వరకును, రంగు గుడ్డలలో నూరింట డెబ్బదిపాళ్లను దేశమునందలి మిల్లులే తయారుచేయుచున్నవి. కాని స్వదేశీమిల్లులు సన్ననిరకములబట్టలలోను, కొన్ని ప్రత్యేక రకములలోను విదేశపు సరకులతో పోటీ కాగలేకపోవుచున్నవి.

జనుల కొనుగోలుశక్తి తగ్గుటచేత వ్యవసాయదారుల దృష్టి ఎక్కువ వెల గల బట్టలనుండి చౌకరకపుబట్టలపైకి మరలి నది. స్వదేశీ అభిమానము విపరీతముగా పెరిగిపోయినది. హెచ్చు దిగుమతిసుంకముల వలన దేశీయపరిశ్రమకు రక్షణ చేకూరినది. ఈమూడు కారణములచేతను దేశీయ పరిశ్రమ మంచి లాభమును పొందినది. పరిశ్రమ అభివృద్ధికి పై మూడింటిలో హెచ్చు సుంకములే ప్రధానకారణ మని చెప్పవలసి యున్నది.

౧౯౩౨-వ సంవత్సరమున నూలు పరిశ్రమ విషయమై నియమింపబడిన టారిఫ్ బోర్డు వారు (Cotton Tariff Board of 1932) ఈపరిశ్రమరక్షణనుగూర్చి సాంగోపాంగముగా చర్చించి అధమము పదిసంవత్సరముల పాటైనను ఈపరిశ్రమకు రక్షణ నొసగవలె ననియు, అట్లు చేయకపోవుట ప్రజోపయోగమునకు హానికర మనియు సహేతుకముగా నిర్దేశించిరి. అట్లు చేయుట బట్టలు కొని ఉపయోగించువారలపై అనవసర భారమ్మును మోపుట యగు నను వాదనకు వా రిట్ల సమాధాన మిచ్చిరి: "ఈనరికే దేశములో కొన్ని చిన్నమిల్లులు చూపిన సమర్థ తగినంత రక్షణ నిచ్చినచో సాధారణ మిల్లులను ఇంకను మంచి ప్రయత్నమునక పురికొల్పియు, ఒండొంటితో పోటీవల అసమర్థములును అనుపయోగములును అగ మిల్లులను రంగమునుండి తొలగించియ క్రమముగా పరిశ్రమయొక్క మామూల స్థితిని అభివృద్ధిపరచగలదు. దేశముపై మో పబడు భారము చాలకాలము అనవసరముగ పొడుగింపబడదనియు, పరిశ్రమయొక్క పెట్టుబడిదారుల చర్యవలన ఈ భారమ విపరీతముగా పెరుగ దనియ మే మాశించుచున్నాము." పై మాటల యథార్థము లనుసంగతికి అటుపిమ్మట సంవత రములలో పరిశ్రమ పొందిన సత్వరాభివృ యు, దేశములో వివిధ పారిశ్రామిక కేం ములకును పోటీ పెరుగుటచే కలిగిన ధర తగ్గుదలయు నిదర్శనములు.

పైధోరణి లాంకషైరువారలను చాల క వరపెట్టినది. వారు పెద్దగోల చేసి ౧౯౩౬- సంవత్సరములో దిగుమతి సుంకము కొంత తగ్గింపబడునట్లు చేసినారు. బ్రిట నుండి వచ్చుదిగుమతులను అభివృద్ధి చేయ ఉద్దేశముతో ఈమధ్య ఇండో - బ్రిటి వ్యాపార రాయబారముల సందర్భమ లాంకషైరువారు దిగుమతిపన్నులను ఇంక తగ్గించవలె నని పెద్ద యలజడి గావిం చున్నారు. ఈదేశములో వారు భాగ నుపయోగించు సాధన సామగ్రి బ్రిటన ఇకముందు మన దేశమునుండి ప్రత్తిపెరుగు లధికము కాగల దనునది.

ఈ సందర్భమున ప్రత్తి ఎగుమతుల విషయమున బ్రిటనుకంటె జపానే మన కింతవరకును మంచి కాతాదా రనియు, బ్రిట నుకు కనుకూలమైన యేర్పాటులకు మన మొడంబడినయెడల జపానుకూడ ముందు ముందు ఇట్టికోరికలనే కోరవచ్చు ననియు గుర్తుంచుకొనవలెను. ఇండియా ప్రభుత్వము తనచర్యవలన బట్టల గానుల దిగుమతులు అధికము చేసినట్లయిన దేశములోని సాధారణపు రకపు మిల్లులను చిన్న మిల్లులను నష్టపెట్టి పరిశ్రమకు ప్రోత్సాహకు లగు పెట్టుబడిదారులకును నష్టము కలిగించిన దయితీరును. ఈపరిశ్రమ దేశము నకు చాల ముఖ్యమైనది. మంచి కట్టుబాటు లకు లోనై ఇందు పని చేయుచున్నంత మంది కార్మికులసంఖ్య మరి యే ఇతరపరిశ్రమ యందును లేదు. కాబట్టి ప్రభుత్వము దిగు మతిసుంకములను ఎక్కువగా తగ్గింప బూనుకొనుటకుముందు తత్ఫలితముగా రా బోవు కష్టనష్టములను గుర్తించవలసియు న్నది[4].

4. ఈమధ్య జరిగిన ఇంగ్లో – బ్రిటిషు వ్యాపారపు టొడంబడిక పూర్తి యగుటకు చాల ముందుగనే ఈ వ్యాసము వ్రాయబడినది.

# వీధి నాటకం

'అనూరాధ'

అబ్బ! ఏం ఎండా - దీ నమ్మక్కడుపుకాలా -, ఏం మాడ్చేస్తోంది! విధిలేక బజారుపోయి యింటి కొస్తున్నాను.

కిందకాళ్లూ పైన కళ్లూమండుతూ న్నా, ఎల్లాగో అల్లా పళ్లబిగిని యింటి కొస్తూన్నాను.

ఏమరుపాటుగా ఉండగా, కాకేసి, వెన్నంటి ఉరిమింది మోటారుకారు.

- ఉక్కిరిబిక్కిరై, దారి తప్పుకుంటూన్నాను'

నా మొహాన, కోడ్దంటూ యింతదుమ్ముత్తి, ముందేమిటో ముందుకు పోతున్నట్లు - తనదారిన తాను తుర్రుమంది మోటారు!

ఏం పాపం, ఏంఖర్మం చేశానని నన్ను ముందు లేవరగొట్టాలీ-? దారి తప్పుకుంటూన్నా, పైకొలసుతూ న్నా, నా మొహాన దుమ్మెత్తాలీ-? చెప్పండి.

ఈ వున్నవాళ్లతో యిదే చిక్కు. వాళ్లు మన ముందున్నా - వెనక్కెళ్లినా, మనప్రాణాలు నిలూనా తోడందే పోదు!

... ... ...

పైష్ణవకవుల ఉజ్జ్వలమధుర భావనలకు తల లూచి, గాంధీ రవీంద్రుల భావ-వాఖ్యాన పరంపరలకు నాతలను రేడియో-స్టేషన్ చేసి కాలం గడుపుకుంటూ వొస్తున్నాను. పెళ్లామూ బిడ్డలూ మలమలమాడుతూంటే - 'సఖిపతంగ సుతాపులి వాటికీ...'' అంటూండడం భావ్యం కాదని పిస్తోంది.

అ-బ్బ-! ఎండ మండిపోతోంది! ఏంఎండ...! తలుపెవరో దడదడా పగలగొడుతున్నారు. ఎవరో...? 'వొస్తున్నా ఉండండి. వొసేయ్! ఎవరో తలుపుకొడుతు న్నారు కాస్త వెళ్లితియ్యి. ఊఁ? లే! వొస్తున్నా వుండండి...'

(అపర్ణ వెళ్లి తలుపుతీసింది. అపర్ణ మా ఆవి పేరు...) —

ప్రసాదరావు!

'రావోయ్' రా! అదేమిటీ - అట్లా వున్నావ్

ప్రసాదరావు చెమటలు కారుతూ, రొజుకుంటూ వొచ్చాడు. డస్సివున్నాడు. కళ్లల్లోవున్నై ప్రాణాం

" . . . . . "

"కాళ్లు కడుక్కో, సహం తగ్గుతుంది"

"కాళ్లే కాదోయ్ - ళ్లూ కడగాలి! వెళ్ల దుమ్ము".

అపర్ణ కాళ్లుకడుక్కో ఉప్పనీళ్లూ, తాగ మంచి నీళ్లూ తెచ్చి యిచ్చింది: కాసిని మంచినీళ్లు తాగి అమ్మయ్య అని ఈజీచైరులో నొరిగాడు అతను.

"ఏమోయి! యింత ఎండలో వొచ్చావు! వ తగిత్తే?"

"లేపటికి రెండూ."

"ఛీ! అఘాయిత్యం మాటలు అనకూడదు!

"ఎన్నైతేనేం-నాయనా...మీరు కవులు.. చకోరపక్షి, యింత వెన్నెలా వుంటే చాలు. ఆటలూ పాటలూ పాడుతూ ఆడుతూ వుంటారు."

- పొడిచినట్లైంది. (కొత్తరకం పాటకా రాయమనీ, అవి ఆడాలనీ; ఆడి దేశంలో పంచలన చెయ్యాలనీ, ప్రసాదరావు నేను పారెడీలు రాస్తూన వాటి మంచీ పోరుతున్నాడు. ప్రసాదరావు నటుడూ కవితాప్రియుడూ; చదరంగంమీద కాశిని పద్యాల రాశి తాను కవిని కానని తేల్చుకున్నాడు. Ban వొదలగానే చదరంగం సామానో, చక్కనికవిత్వమె ఏదో వొకటి వుండాలి అతనికి.—

ఏడవలేక నవ్వాను. "నవ్వుతావ్ నాయ్నా; కే, మహారాజువి. కవీశ్వరుడివి"

"వంపకోయ్: రాస్తాను!"

"ఈ మానవుడు అప్పటికి బతికివుంటాడా?"

- కలుక్కుమంది.

"చూడవోయ్! వారంరోజులు!"

"సై ?"

అవునన్నట్లు హుషారు యీలవేశాను: కత్తెర ర్కలు చెరోటీ ముట్టించాక. పొగ వలయాలుగా, లుతూ, విలయాలుగా తిరుగుతూన్న పొగను చూస్తూ- ంత రసపిచ్చి ఐతే- యితనికెట్లా? అనుకున్నాను. ాటకొస్తే నాకు లేదూ రసపిచ్చి...! కలకత్తాలో ు చూచిన రష్యన్ నాటకాన్ని వర్ణించాడు వర్ణిం డూ కోట్టికోలాహలం చేస్తూన్నాడు: కలకత్తా అనే ్పటికే మరోలోకంలో వున్నట్టు భావించే నేను ులు నోరవెట్టుకు వింటున్నాను. వాళ్ల ఆర్కెస్ట్రా, మ్యూజిక్, వొకటేమిటే—నాకు హుషార్ స్తున్నాడు!

- నేను చూచిన క్రూసైడ్స్‌లో,ముందు చూచిన- న్ని,) జ్వాలాసంగీతాన్ని (Firy music) తలుచు టూ రసరాజ్యడోలలో వూగుతున్నాను. గ్రాండ్ ోటల్, లాస్ట్‌డేస్ ఆఫ్ పాంపే; కెప్టన్ బ్లడ్: ు సర్తును తెస్తున్నాడు!

శావిసలకు డాక్టర్ బ్లడ్ మందులు ఇయ్యడం ొచ్చింది! ఏడుపొస్తోంది... తెలీకుండానే -

"హై దునియాకే పాప గులామీ,

జన్ మే జీవన హైరోనా!"

అన్నానట. నాకు తెలీకుండానే నాముఖ ముటు కనిపెడుతూండాలి మరి ప్రసాదరావు!

ఆర్యుల అధికారమదం, అనార్యులబాధ; అనా ర్య ప్రేమాజ్వల్యం: అందులో కూడా వినయం.

'బాగబా అరకే మనో

రో హుకుం ఆరామ్‌కేనే-!"

అని చేసినవినతీ - అన్నీ గుర్తుకొస్తే! నాకు పిచ్చి మొహం పడ్డది! వేళకు అపర్ణ కాఫీ లేకపోతే - ఆకాఫీస్వాదుమరందధారలు నోట్లో పడకపోతే, ఆష్లైవర్ మూమూడకపోతే, అది యింత గొంతు తడపక పోతే, యింకా ఏం ఏం పలవరించి; ఏడుస్తూవుం దునో...?

- రెండు తొలిగ్రుక్కలు తాగాను.

"చూడవోయ్! ప్రహ్లాదనాటకం..."

"ఊఁ!"

"ప్రహ్లాదోయ్!"

"ఎవరూ ?"

"గాడిద! రాఘవాచారి కూచిపూడివాళ్లూ!"

"ఓహో! అదా! నాకు మహాయిష్టమోయ్: ప్రతేడూ రామకృష్ణశాస్త్రిగారూ నేనూ, నిలువుజీతం కుదుర్చుకుని తెల్లార్లూ చూచివొస్తాం. నిరుడు వెల్లటూర్ కూడా వొచ్చాడు:"

"సరే! అవన్నీ కట్టిపెట్టు — వినేవాళ్లుంటే క్లేటుగా వాగుతావు."

—ఉలిక్కిపడ్డాను. "ఏమి టంటావ్ ?"

"హిఁహిఁ: 'అనార్య- ఆర్య' వివాదంగాగానీ, ధనిక, శ్రామికవర్గ దారుణాలుగాగానీ నీవు ఇంటర్ప్రెట్ చెయ్యాలి!"

"ఉఁహూఁ!"

"విచిత్రంగా ఘోరంగా వుండాలి!"

"క్లాసిక్సు అవి: మళ్లీ వాటిని మనం నిర్వహించ లేమోయి!"

"అందుకే యింటర్ ప్రిటేషన్!"

"ఊఁ! అను—అను—!"

'ఊహ పోతోంది: దూసుకుపోతోంది: అఁ!'

'సెబ్యులాదాకా పోయింది: హిరణ్య-కశిపుడా ?'

'కొడుకు ప్ర-హ్లాదుడా ?' భార్య లీలావతా ?'

'ఏం చేర్లోయ్: మహాచక్కగా అమిరె...!'

డబ్బుమీద ఆశతో, యజ్ఞాలు చేసేచోట నో ధనం వుంటుంది గనుక వాటికోసం పోట్లాడి, వాటిని

హరించి యజ్ఞాలు పాడుచేశేవాడూ ... మతద్వేషం కాదూవాడికి...! Capitalist ... శృంగారి...! యింకేం- పెళ్లాం లీలలు గలదీ ?— అప్పయ్యా. వో దమ్ము తీశాను: కుతితీరా యింకోదమ్ము తీశాను: జనానురంజన మా కొడుకుపని-ప్ర-హ్లాదుడా? యింట్లోనే సంఘర్షణా- చండామార్కులు కారు, చండిమార్కులు. మర్కట సన్యాసులగోల ఎందుకు? — చివరికీ-? శ్రీ భూనీళా స్వామి ఐన 'నర-సింహ' స్వామి వొచ్చి, రాజ్యం పగలగొట్టి, ప్రజాపరం-ప్ర-హ్లాదపరం చేస్తాడూ:... భేష్!—

సిజరు పూర్తిగా కాలేటప్పటికి, వూహ చక్కగా వొచ్చింది: యింకోసారి కలబోసి చూసుకుని, ప్రసాద రావుతో ఆవేశంతో చెప్పాను:

"కాగితంమీద పెట్టా !"

... ... ...

"ఊరుకుంటావేం—కాగితం కలం పుచ్చుకో."

"అప్పడే?—ఊహ కాస్త మాగవొద్దూ ?"

"ముందు నోట్సుగా రాయవోయ్ !"

ముందు Plan గా తయారు చెయ్యబోతే; కాగితం కలం పుచ్చుకోవొచ్చేసరికి చిలవలు పలవలై, వన్నెలుచిన్నెలుగా తయారైంది.

అంతా చదివి - ప్రసాదరావు,

"ఎన్నాళ్లలోగా రాస్తావు?"

"ఎంతోయ్; పదిరోజులు"?

"కాదు, వారంలో రాయాలి."

—పెనవబేరం! అల్లా అంటేనేగాని, నెల్లాళ్లైనా రాయనని.

"సరే లే!"

"సరే లే అన్నావూ—? ఇంకేం - వోరెగ్గెల్లు పట్టచ్చు."

"కాదోయ్ బాబూ! సరే - అంటే సరే - రాస్తానుగా."

"నిజం?"

"కర్మభూమి కాదుటోయ్ మందీ? చూపొక్క."

"కాదోయ్ -- కర్మభూమి!"

—నవ్వుకుంది. నవ్వుతో తప్పించాను.

౨

కృష్ణశాస్త్రి రాసిన:

"జయ జయ జయ ప్రియభారత
జనయిత్రీ దివ్యధాత్రి!
జయ జయ జయ శతసహస్ర
నరనారీహృదయనేత్రి!

పాట పూర్తికాగానే—ముందు తెర తీశారు.

మెరుపుదీపాలు జిగ్ జిగ్ మంటూంటే - మెడ నింపిన పూలదండల ఘుమఘుమల్లోంచి, నక్కిదారాల గరగరల్లోంచి, ఈ గిరజాల హిరణ్యకశిపుడు లీలావతిని చూస్తూ మీసపుకొనల్లో నవ్వుతూండడమూ, చూచాను.

'అన్నంలోకి బంగారు రేకులు తే!' అని దర్జాలో ప్రేమలో, మాధుర్యంతో అనడమూ విన్నాను.

—నిన్నటిదాకా కిల్లీల కొట్టుబాకీలు తీర్చలేక భోషకమైనై, దారులు తప్పిస్తూ తిరిగిన నేను, నేడు నాటకం రాయడం, దాన్ని వింతనే -- ఆడడం, నేను నానాటకాన్ని చూస్తూవుండడమూ ... మహాకవి పాల్ (పీనపాలవారి అబ్బాయి : యిప్పట్నించీ మేం మహాకవి పాల్ అంటాం ఎక్కిరింతకి) నామీద పద్యాలు రాయడమూ, (ఎవరో వొహడు రాయాలిగామరి!) ఏం చెప్పనూ, వొళ్లు తెలీటంలేదు వైజాగునుంచి శ్రీ.శ్రీ. మద్రాసు నుంచి రామకృష్ణశాస్త్రిగారూ రాలేదే అన్నకించ తప్పిస్తే... అంతా సలక్షణంగా వుంది; తత్తర బిత్తరతో హాంగామాతో చూస్తూన్నాను.

... ... ...

ప్రహ్లాదుడు ఆరాధకం పుకొల్పుతున్నాడని దండనాయకుకు ప్రభువు ఆజ్ఞప్రకారం బాబా చితకా కొట్టిస్తాడు ! ఊరిలో ఉన్న జనమంతా, స్పృహావున్న ప్రహ్లాదుణ్ణి చేతులమీద మోసుకొని - తల్లి యింటిదగ్గరకు తీసికెళ్లబోతారు. స్పృహా కొంచెం తెలిసి ప్రహ్లాదుడు అక్కడికి పోనంటాడు: ఎల్లాగయినా మాతృమూర్తి లీలావతికి తెలుస్తుంది....

హిరణ్యకశిపుడు కళ తప్పి,లోలో మండేసుండెను క్రైర్యంతో అదుముకుంటూ వొస్తాడు!: లీలావతి ఎదురు

...ళ్లి - తీసుకొస్తుంది: హిరణ్మయ తప్పు చేసినట్లూ - లీల ఎక్క...స్తున్నట్లూ భావిస్తూవుంటారు.

... ... ...

మాతృమూర్తి గనుక పిల్లవాణ్ణి వెనకేసుకుని, ...కడితో పోట్లాడుతోంది:

హిరణ్మయకు నవ్వువొస్తోంది. కాని అది పిశాచపు నవ్వు... లోలోన కుములుతూన్నా, బింకానికి పైకి ...వడు.

లీలావతి — ఏమండీ! వెనకరాజ్యం పోతే ఏం-...నాయన్న బతికుంటే చాలు... ఎక్కడున్నా కన్న ...కడుపును యిట్టా అష్టకష్టాలూ పెడతారా-?.

హిరణ్మ — (మాట్లాడ్డు.)

“నే చూశ్లేను బాబూ — ఈ విడ్డూరం ఎక్క...న్నావుండా —?.”

“హిర — (మాట్లాడ్డు.)

“లీలా — నే చూశ్లేను. (నిట్టూర్పు) నువెళ్ళో ...వెళ్ళో చూసుకుంటాను” (ఏడుస్తుంది...)

ఆడదాని, అందులోనూ భార్య కన్నీళ్లు ...చూశాడు హిరణ్మ. అలనిమ్మక్కడా ఏడుపొస్తోంది:

“వొసేయ్! ఇటు చూడూ —”

లీల చూడబోతుంది. కళ్లల్లో నీళ్లు అడ్డ...మొస్తై.

“ఛీ, ఏడుస్తావు! పిచ్చిదానా! ఏమే - అబ్బాయి ...మీద ప్రేమ లేకనా - వాడి మొండిపట్టుదల పోయి ...ప్పుడు బుద్ధి వొస్తుందో అనిగానీ-”.

లీల: ఏముందమ్మా! లేక లేక వొక్క నలుసు. ...వాణ్ణి రాచి రంపాన బెట్టి, వాడి సొస్తురుతో బోలేట్టు ...లేవా అంటారు మీరు. (ఎక్కెక్కి మాట్లాడలేక ...పోతుంది.)

హిరణ్మ: (కళ్లల్లో నీళ్లు తిరుగుతూండగా) — హుం! వాడిమీదపడ్డ వొక్కొక్క దెబ్బ - యివుగో! ...యీ నా హృదయంమీద వాతల్లాగు వేసుకుంటున్నానే: ...వదింకానికి - పైకి ఏడవటం లేదుగానీ -, (అవురు...కుంటాడు.)

... ... ...

— నాకళ్లంబడీ నీళ్లు వొస్తున్నై.

నా గుండెలమీద కొట్టినట్లు హాలు లేపులు గర్జిస్తున్నాయ్! ఏమి టీ రసభంగం!

హాలుటెంలేపులు మళ్లీ ఏడుస్తున్నై: బైట పెద్ద గోలా అల్లరిన్నీ — నేను బయటకు పోయాను: వో పెద్ద గాంగ్ హాలుమీద రాళ్లేస్తున్నారు!

— పోలీసులు అదమాయించ చూస్తున్నారు: వెళ్లి యథార్థం కనుక్కుందామని, పోలీసుల్ని ఆపి నేనే వెళ్లి వాకబుచేశాను. అచ్చాఫీసుల్లో పనిచేసే వాళ్లూ, వాళ్లూ, అంతా కార్మికులు టిక్కట్లు కొనుక్కోడానికి లేదు: లోపలికి రానీరు. నాటకం చూడాలనివుందీ:, పాపం... అన్నంకోసమేకాక రసం కోసం పోట్లాడుతున్నారు! ఏం చేసేదీ — నా జేబూ లోంచి వో రెండురూపాయలు తీసి - నలుగురికి టిక్కెట్లు కొనిపెట్టాను! లోపలి కెళ్లాను — మళ్లీ గోల!

నాటకం ఎంతమజాగానో వుండే పట్టుల్లో, రాళ్లేసి అల్లరి చేస్తున్నారు: ప్రేమ కసిగా మారింది వాళ్లకు: మేం అనుభవించని రసాన్ని, మానవు లందరికీ సమానమైన హక్కుభుక్తాల్లో వుండాలిసినరసాన్ని, డబ్బెట్టి కొనుక్కుని, అందరాని మానిపండ్లు చేస్తున్నారే అనేఅక్కసుతో హాలుమీద వాళ్లు రాళ్లేస్తున్నారు! నాయనా! వెయ్యద్దు అని బతిమాలుకుందామని మళ్లీ బైట కెళ్లాను: వాళ్లు వొక్కటేముక్క!

— మమ్మల్ని లోపలికి పోనీండి!

— నాటకం మానేజర్‌ను వెళ్లి అడిగాను...!

...వీల్లేదన్నాడు! అలగాజనానికి రసానుభవం ఏమిటన్నాడు? నిజమే! నిజమే ఏమిటే నాపిండా కుడు... వారివారి మనస్సు అంకురవుల్లోంచి వాళ్లువాళ్లు గ్రహిస్తారు! టిక్కట్టుకొన్న అందరూ రసగ్రహణపారీణులా ఏమిటి-? కళ్లమబ్బులు విడిపోయినై: వెళ్లి మళ్లీ అడిగాను: కనికరించమన్నాను: వీల్లేదన్నాడు మానేజరు. లోపల నాకో నరకం పెకిలుమని పగిలి రగులుకొంటోంది: మా నాగేంద్రరావు వొచ్చి అన్నాడూ! నిక్షేపంగా నాటకం జరుగుతూంటే - కానివాళ్లకోసం

విచారిస్తారేం-? మేం ఎన్ని నాటకా లాడాం! పోలీసులు పట్టేస్తారులే అని: నాకు దారుణ మనిపించింది!....

—నాటకం వొదిలాను. హాలు వొదిలాను. స్నేహితుల మాటలు వొదిలాను. స్నేహితుల్ని వొదిలాను. నాగేంద్రావునీ వినిపించుకో లేదు: లాఠీచేతులు ఎగదీసి గేటుయివతలి కొచ్చాను: కార్మికులు ఆక్రోశంతో హాలుమీద రాళ్లేస్తున్నారు: నేనూ కలిశాను!... రాళ్లు కసికొద్దీ హాలుమీద వేస్తున్నాను.

సబిన్‌స్పెక్టరు వొచ్చాడు! చూచాడు. నేను!! ఇందాక పూలదండ వేసి చప్పట్లు కొట్టి మెచ్చుకున్న పిల్లే — నన్ను చూచి బెదురుతూన్నారు!

లెక్కలేకుండా రాళ్లేస్తున్నాను!

దగ్గిర కొచ్చాడు సబిన్‌స్పెక్టరు:

"శాస్త్రిగారూ!"

"ఏం"

—రాయి తీసుకుంటున్నాను:

సబి— నామాట వినండి! గౌరవంగల మీరు చెయ్యదగ్గపని కాదు; మీనాటకానికి మీరా విఘాతం కలిగించేది?

"పిల్లనుకూడా చూణ్ణివ్వండి!"

"లోకం అంతా వొక్కటి చెయ్యగలరుటండీ!"

'తనయందు నిఖిలభూతములందు సమదృష్టి'గుర్తొచ్చింది: ఊరుకున్నాను: ఏమీ జవాబు చెప్పలేదు.

"మర్యాదకాదు; లోపలికి రండి! వృథాఆవేశం...!" అని సర్దుతున్నాడు:

నాకు తిక్క రేగింది! రాయి హాలురేకులమీద విసరబోతున్నాను:

"శాస్త్రిగారూ!"

"మీరు మానకపోతే - మిమ్మల్ని ఈరాత్రికి స్టేషనుకు తీసుకెళ్లాలిసొస్తుంది!"

"తయారు!"

సబిన్‌స్పెక్టరూ, సర్కిలూ, మనస్సులో ఇదవుతూనే- నన్నూ, నా అనుచరులనీ - స్టేషనుకు తీసికెళ్లారు!—

— మిగిలినరాత్రి గవ్వరాళ్లమీద మట్టుద లాగు గడపాలిసొచ్చింది!.

—ఆలోచిస్తున్నాను: పాలుపోటం లేదు. ప్రాబ్లెం సాల్వుకావటం లేదు! పోనీ వొకున్నా కైనా టం లేదు! గజిబిజిగా వుంది!

"ఆర్తత్రాణపరాయణ స్స భగవా నా యణో మే గతిః!" శ్రీరంగం, గుడీ గుర్తొచ్చాయి: గ నిర్మాణం ఎంత చక్కగా వుంది...ఒహోహో అద

'శిల్పాన్నీ- కళల్నీ కేంద్రీకరించి- మతం పేరు మాయచేసి దేవాలయం అన్నారూ?,—

అన్నికళలకూ, పరమావధి దేవుడే నన్నారూ

ఇహపరాలకు రెంటికీ, దేవాలయం కూ అన్నారూ.—

అందుకేనా— అంత శిల్పసమజ్జలంగా గుడు కట్టడం, గుళ్లో పాఠశాలలు పెట్టడం; ఉత్సవాలు పటం...ఉత్సవాల్లో నాటకాలు ఆడడం...అం బహిరంగంగానే కదూ?. ఇష్టమున్నవా డల్లా టిక్కె పట్టానికి!...

చిక్కు విడిపోయింది; ప్రాబ్లెం సాల్వుఅయిం యిహ అన్నిరసాలూ, వారివారి తాహతునుబట్టి వ్యయపడేటట్టుగా చెయ్యటానికి కంకణం కట్టు న్నాను. గిడుగు రామమూర్తిపంతులవాడుకభాష దానికి యిదా కీలకం-? రామమూర్తిపంతులుగారు ఆశీర్వదించండి!...

... ... ...

—బైటపడ్డాను.

మా నాగేంద్రావూ ప్రసాదరావూ వొ చెప్పిచూచారు: నాటకం మాంచి ఎఫెక్టుయిచ్చిందిట

యింకోసారి ఆడితామన్నారు ... తెరల వాటికీ—(అన్నీ కొత్త సంపేణీరి: ఇందుకోసం తయా చేశాం;) ఖర్చైన రెండొందలూ పూడుతై అన్నా

నాటకం బహిరంగంగా వేయమన్నాను: వా రీలు లేకన్నారు!

ఎందేత కీలు లేదూ ?— కీలుంది!

ఉలవపాడులో ఉత్సవాలు చేస్తారు. మిత్రులు వెంకటకృష్ణారెడ్డి ధర్మకర్త. ఉత్సవాలకు రావలదని రాశాడు: నోయిరవై రోజులు ముందుగా ఈ స్త్రంతో తయారైనాను.

వెంకటకృష్ణారెడ్డి శ్రోత్రియంటారు...

విశా—

ఈ హా విప్లవనాటకాన్ని విని-మన్నించి-....

ఉత్సవాలకు దీన్ని ఆడించ ప్రయత్నం చేశారు...

కాని అంత తొందరలో కీలు చిక్కలేదు...

కాని—

"ఆ ప్రహ్లాదనాటకమే ఆసారి ఆడించారు!...

"ఆ పండిట్లో—

"రాజు వెడల రవితేజము వెడలగ" అని వంత పాటగాడు అంటూంటే—తాళాలు చెవుల్లో మోగుతూంటే — రాజువేషగాడు కత్తి సహస్ర ముఖాలుగా, సహస్రకిరణాలుగా తిప్పుతూన్నాడు!....

---

# సౌరూప్యవైద్యశాస్త్రము

శ్రీ డాక్టరు తోలేటి పేర్రాజు (నరసాపురం)

( గతసంచిక తరువాయి )

## సూక్ష్మ జీవులు

ఒకక్షయరోగి నీవద్దకు వచ్చిన, వానిని పరీక్షించి ఊపిరితిత్తులు చెడిన వనియు, అందు సూక్ష్మజీవులు కల వనియు గుర్తింతువు. ఊపిరితిత్తులు చెడుటయు, సూక్ష్మజీవు లుండుటయు కేవలము "రుగ్మత" యొక్క ఛాయలుగాని " రుగ్మత " కాదు. సూక్ష్మజీవులను గురించి భీతిల నవసరము లేదు. మీరుమిక్కిలి అవి రోగి మేలే కోరును. నీవు జాగ్రత్తగా పరిశీలించినచో అవి ఎప్పుడు అంకురించునో నీకు తెలియగలదు. పండు కుళ్లిన వెనుక పురుగు చేరినట్లు ఊపిరితిత్తులు చెడి నవి కనుకనే ఈసూక్ష్మజీవులు ప్రవేశించుచున్నవి. కుళ్లిన మామిడిపండునందు పురుగులుచేరి అకుళ్లను తిని పండు శీఘ్రముగా కుళ్లకుండ ఆపుచేయును. ఈ క్రిములవల్ల మామిడిపళ్లు శీఘ్రముగ కుళ్లుటలేదు. కుళ్లు టకు పూర్వమే ఈక్రిము లందు లేవు. ఇది శాస్త్రజ్ఞులు అంగీకరించిన సిద్ధాంతమే. అటులనే ఊపిరితిత్తుల యందలి కోశములు చెడినతరువరిసే సూక్ష్మజీవులు చెడిన పదార్థమును భక్షించి ఊపిరితిత్తులను త్వరిత ముగా చెడకుండ ఆపుచేయుట గమనింపవలయును. కాన మానవుడు క్షయవ్యాధిచే బాధపడుటకు క్రిము లెంతమాత్రమును కారణముకాదు. ఈక్షయకు హేతువు నీ కంటికి కానరానంత లోతుకలది. కాని నీవు గోచ రించు ఈక్రిములే కారణమని ఎంచి వాటిని ధ్వంసము చేయుటకు చికిత్స ప్రారంభింతువు. నీవు ఇట్లే ఇతర రుగ్మతలకుకూడా హేతువు నీమనోజ్ఞానముచే చూడ గలవు; బాహ్యనేత్రములతో చూచునది రుగ్మత కాదు. రుగ్మత ప్రథమమున మానసికముగా ప్రారంభమై క్రమముగా శరీరోపరిభాగమునకు వచ్చునని తెలి కొంటిమి. కాన దీనికి సంబంధించు చికిత్సకూడ ప్రథమమున మనస్సునందు ప్రారంభమై శరీరముపై పోవలెను. కాన మనస్సే రుగ్మతకు దా చికిత్సకు హేతువు. యథార్థ చికిత్సా విధానమ సారూప్య శాస్త్రాచార్యులు, ఆదిపురుషులు, శ్రీ శామ్యూల్ హానిమన్ మహాశయులు ఒకరుగ్మతకి ఒకమందును నిర్ణయించునప్పుడు రోగి లక్ష సముదాయములో మానసికలక్షణములకు ప్రాధా మొసంగవలెనని సెలవిచ్చియున్నారు. రోగి " నా జబ్బు " గా మన్న దన్నప్పుడు " నేను " " నాకు " అని చెప్పటలో ప్రస్తుతము మనవ మన స్సని అంగీకరింపవచ్చును. మనము ఇంతకుమిం వెళ్ల నవసరము లేదు. " నేను " అను పదమునక మనస్సు అని మనము అన్వయించుకొని మనవిధా మందు మందు నిర్ణయించుటకుగాను మానసిక లక్ష ములకు ప్రాధాన్యమొసంగినచో మనసంకల్పము నె డేరును.

మనము 'రుగ్మత' నిదానము (Diognosis గూర్చి చాలదూరము చర్చించియుంటిమి. ఇంక దీనివిషయము మనము పూర్తిగా గ్రహించవల యున్నది. నీవు సారూప్యవైద్యుడవు. నీపని రో స్వస్థతచేకూర్చుట. రుగ్మతతోగాని రుగ్మతయొక్క పేరుతోగాని నీకు నిమిత్తములేదు. నీవు రోగిని స్వం ముగా చూడవలెను. రోగికి సంబంధించిన అన్ని విషయములు నీవు అవగాహన చేసికొనవలయును.

ఉదాహరణ :— నీవద్దకు ౪ గురు రోగులు ౘ హారోరకు వచ్చిరనుకో.

(౧) వైరూప్య నామకరణప్రకారము ఒకనికి ...ంకవిరోచనములు.

(౨) మరొకనికి జ్వరము, పండ్లపోటు.

(౩) వేరొకనికి అతిసారము.

(౪) ఇంకొకనికి సన్నిపాత జ్వరము.

ఈ నలుగురియందును మానసిక ఆరాటము, తరచు ...రని దాహము, ఉష్ణవాంఛ, అర్ధరాత్రి ఉద్రేక ...ుండినచో ఈ నలుగురుకిని సారూప్యవైద్యుడు పాషా...ము (Arsenic Album) ఇచ్చును.

వేరొక నలుగురు కలరాచే బాధపడుచున్నారను ...నుడు. (వైరూప్యవైద్య ప్రకారము) ఒక్కొక్కరి ...యందును లక్షణములు వేరువేరుగా నుండును. అప్పుడు ...కరికి Arsenic Alb; రెండవవానికి Veratrum ...lbum; మూడవవానికి Camphor; నాల్గవవానికి ...odophylum అవసరము. ఈ విధముగా నీ మందు ...ర్ణయించుటలో రోగముయొక్క పేరుతో నిమిత్తము ...దు. వ్యక్తియొక్క వింతలక్షణములనుబట్టి వేరువేరు ...ందులు నిరూపింపబడును. ఇట్లు రోగము ఒకటియైనను ...ోగులయందలి వ్యక్తిగతమార్పులవల్ల వేరువేరు మందులు ...వసరమైయున్నవి. ప్రథమ ఉదాహరణమందు వ్యక్తుల ...ుక్క ఐక్యలక్షణములు ఒకేమందును నిరూపించు ...న్నవి. ఇట్లు నీకు రుగ్మతయొక్క పేరుతో నిమిత్తము ...ు సరికదా అది నీకు ఏ విధముగాను సాయపడదు. ...ారుమిక్కిలి వెనుక నీవు ఈవిధమగు రుగ్మతకు ఫలానా ...ందు వాడితినని స్ఫురణకువచ్చి లక్షణములను సాకల్య ...ుగా వినక మందిచ్చుటచే నీవు రోగికి తీరని అపకా...ము చేసినవాడ వగుదువు. కావున నీవు రోగిని ...కల్యముగా గుర్తించి, అతనికి గల ...క్షణములు చెప్పిన వన్నియు వ్రాసుకొని ...తనియందు నీవుచూడగలిగిన వింతలు విపరీతములు ...హించి రోగభూయిష్ఠుడైన ఆమానవునికి మందీయవలె ...కాని రుగ్మతకు కాదు. సారూప్య ఔషధచికిత్సకు ...ది మరువరాని అమూల్యమగు ప్రధాన సూత్రము.

మన్యప్రాంతమునందు గల ప్రజలు అచ్చట మన్య...్వరము ప్రాబల్యముగ నున్నను ఆ జ్వరముపాలు ...కుండుటయు, కొంతమంది ఎంత జాగరూకతగా మందు తీసుకొన్నను దానిచే చాల బాధపడుటయు మనము తరచు చూచుచున్నాము. మన్యపుజ్వరము చాలా అపాయకరమైనదని యందుము. వెంటనే ఆ ప్రాంతమునుగూర్చి నిందించెదము. కాని ఒకరికి ఈ జ్వరము రాకుండుటను, వేరొకరు దీనిబాధనుండి తప్పించుకొనలేకుండుటనుగూర్చి మనము యోచించవలయును. అట్లు చేయక ఆ జ్వరముచే బాధపడువానికి, రోగికి, వైద్యునకు ప్రాణము విసుగునంతవరకు మోతాదును హెచ్చుచేయుచు క్వైనా ఇచ్చెదరు. క్రియకు నిరాశతో వైద్యుడు రోగిని 'శీతోష్ణస్థితిమార్పవసరము. ఎచ్చటకైన పొమ్మని సలహా నిచ్చును. ఇది రోగిపై ప్రయోగించు విద్య పూర్తియైనదనుటకు సూచన. అందుచే వైద్యునియొక్క బాధ్యత నివారణచేసుకొనుటకు, రోగి తన్నుపెట్టెడిబాధనుండి తప్పించుకొనుటకు కేవలము చెప్పునది. సరిగా యోచించినచో ఈ జ్వరము అతనిని విడుచుట లేదనుట పొరపాటు. యథార్థముగా రోగే జ్వరమును విడుచుటలేదు. శీతోష్ణస్థితిమార్పు ఈతని కేమి సాయము చేయును ? వానియందలి చైతన్యశక్తి తిరిగి అతని యథార్థ ఆరోగ్యస్థితికి రాలేనంత చెడినది. కొందరియందు చైతన్యశక్తి ఏరుగ్మతయు తాకలేనిదగును. ఒకవేళ ఏరుగ్మతయైనను వచ్చినను అనతికాలములో దానిపాశములనుండి విడివడును. కొందరియందు ఒకసారి రుగ్మత వచ్చిన తిరిగి కోలుకోలేనంత హైన్యములో చైతన్యశక్తి యుండును. ఈ వ్యత్యాసములకు కారణమేమి ? దయామయుడగు భగవానుడు ఇట్లు మానవులయందు హెచ్చుతగ్గులుగల చైతన్యశక్తి నొసంగెనా ? ఏమి భగవానుడు ఒకనిని రోగిగాను ఒకనిని మంచివానిగాను సృష్టించెనా ? కాదు. మనమే చైతన్యశక్తులను ధ్వంసముచేసుకొనుచున్నాము. మనము కర్మలద్వారా వాటిని నిర్వీర్యము చేయుచున్నాము. ఏ కర్మలు ? ఎట్లు ? నిజముగా మనకర్మలే ఈ చైతన్యశక్తియొక్క వ్యత్యాసములకు కారణము. దీనినిగూర్చి తెలిసికొందము.

## రుగ్మత - మనస్సు - శరీరము

శరీరమునకు సంబంధించిన బాధలకే మామూలుగా రుగ్మతయని పేరు ; దాని నివారణకు సాధారణముగా

వైద్యుల సహాయము నపేక్షింతురు. సాధారణముగ మానసిక రుగ్మతలను గమనించము. కాని మానవుడు తన నిత్య కర్మలు చేసుకొనలేనప్పుడు పిచ్చయెక్కినదని భావించి వాని చికిత్సకు ఆలోచించెదము. ఎంతవరకు వాడు తనమీద ఆధారపడినవారి పనులు నెరవేర్చు చుండునో అంతవరకును మనస్సు ఎంత ఆందోళన - వికృతావస్థ చెందినను లక్ష్యము చేయము. మనము సాధారణముగా యోచించినచో మనచుట్టునుండు మనుష్యుల మనస్సును, దాని లోతును తెలిసికొనగలిగినచో నూటికి ఒకరుకూడ ఆరోగ్యమైన మనస్సుగలవారు కాన్పించరు. కాని ఒక్కరుకూడ తన మనస్సు సరిగా లేదని గ్రహించరు. ఇది చాలా విచారకరమైన అంశము.

విద్యార్థుల ప్రవర్తన – ఉపాధ్యాయులు ఎంత శ్రమపడినను బాగుచేయలేకుండుట అందరెరిగినదే. కొందరియందు నయాన్ని - బుజ్జగించి - భయాన్ని - క్రియకు శిక్షించినను లాభములేదు. వారందరును ఒకే పాఠశాలలో-ఒకే ఉపాధ్యాయునివద్ద - ఒకే పాఠమును చదువుచున్నారు. కాని వారి ప్రవర్తనలు, యోగ్యతలు వివిధవిధముల నుండును. ప్రతివానికి ఒకేఅంశము "సత్యము మాటలాడవలెను" - "ఒరులసొత్తు దొంగిలించరాదు" అనునదే పాఠము. ఈ నీతులు వివిధబాలుర యందు వివిధరీతుల పరిణమించును. ఏల? దొంగను-దొంగిలించకుము, దోషము అనిన మానునా? మానడు - అతను దొంగతనము చేయకుండ ఉండజాలడు. ఇది సాధారణముగా వానికి అలవాటుండును. దొంగ అలవాటు పడుటచే దొంగిలించకుండ నుండలేడు అందుము. అతనికి ఈ దొంగతనము ప్రారంభమున ఎట్లు అలవడినది? అతనికి ఎల్లరకు ఉపకారము చేయవలెనన్న అలవాటు ఏల కలుగకూడదు? అందుచేత అలవాటుపడెను అని చెప్పుట సరికాదు. ఒకపనిని తరచు చేయుచుండిన అది అలవాటులోనికి దిగుట సహజమే. కాని తాను చెడ్డదని తలచుదానిని అలవాటు చేసుకొనుట ఎట్లు? దొంగకు యథార్థముగా దొంగిలించుట తప్పని తెలియును. అతను పట్టుపడినచో జైలు ప్రాప్తించునని, అందుచే మానివేయవలెనని అనుకొనును. కాని దొంగతనము మానలేడు. దీనికి కారణమేమి? దానిని మానలేకపోవుటే; అనగా అతని మనస్సు సరిగా లేదు. మనస్సునందు ఒకరుగ్మత కలదు. చక్క ఆరోగ్యముకల మనస్సు ప్రథమమున దొంగతనమ అనిననే కిట్టదు. ఇక అలవాటు మాటయేలేదు. ఆరోగ్య మైన మనస్సు అబద్ధమాడవలెననికూడా ఒప్పుకొనదు తలిదండ్రులు, ఉపాధ్యాయులు, వారు చేయు హి బోధ, పాఠములు, బెదరింపులు, క్రియకు కొట్టు దుష్ప్రవర్తనను మాన్పించునని ఎంతురు. కా వీటివల్ల ప్రయోజనములేదు; వీనివలన బండబా చెడినవారిని మనమెరుగుదుము. ఈరోజులలో తరచు చిన్నపిల్లలు ముష్టిమైథునమును చేసుకొని తమ అమూల్య ఆరోగ్యమును కోల్పోవుచున్నారు. వారి కేవలము మానసికముగా రుగ్మతపాలై అది మానలే ఎవరికంట పడకుండ ఈ దుష్కార్యములు చేయుచు న్నారు. కొందరు చెడుస్నేహముచే నేర్చుకొని ఇంది ఆనందింతురు. కొంతమంది ఇది చెడ్డదని తెలిసిన వెంట మానివేయుచున్నారు. కొంతమంది చెడ్డదని తెలిసిన మానలేరు. ఇట్టివన్నియు యథార్థముగా మనస్సు చెడి టచే కలుగుచున్నవి. చెడుఆలోచన, చెడుపని ఆరోగ్య మైన మనస్సుకలవానికి అసంభవము. మన మిది మనజీవి ములో ప్రతియంశమున గమనించవలయును.

ఒక కుటుంబములో ఏదైన విపత్తు, అనగా ఒ మరణము సంభవించిన ఆకుటుంబములోనివా రందరు ఒకేవిధముగా విచారము పొందకుండుట మనము తరచ చూచుచుందుము. ఒకడు ధైర్యముతో నుండును వేరొకడు కృంగి కృశించును. ఈ మొదటివాడు రెండ వానికంటె మానసికముగా ఆరోగ్యవంతుడు. అంద చేతనే తాను ఈకష్టమును భరించకలిగెను. దుర్బ అనారోగ్య మనస్కులయందు ఇట్టి విపత్తులు ఎక్కు ఆందోళన కలిగించును. మనస్సు ఆరోగ్యముగ నుండువారి కిట్టి వేమియు చేయజాలవు. చీకటియంద తాడును త్రొక్కి పామని భీతించి మరణించినవారి కలరు. అమితమగు విషాదానందములు ఆకస్మాత్తుగా తెలిసినప్పుడు మరణించినవారు కలరు. కారణము అనా రోగ్యమైన మనస్సు.

౧౦ మంది మనుష్యులు ఒక యజమాని ఏమైన నిందించిన- కొందరు లెక్క చేయకుండుట, కొందరు

ోచ్చుకొనుట, మరికొందరు చిక్కిలి చిన్నపోవుట
రుగును. ఇట్లు ఒకేమాటాడినప్పుడు వివిధరీతుల
ాధపడుటకు కారణము వారియందలి మనస్సుయొక్క
ఆరోగ్యమేకారణము. ఆడినమాట యొకటియే; మనస్సులు
ేరు. (మనుష్యులువేరు) దానిఫలితము వివిధముగానున్న
వనులలోని తేడాగాక మరేమి? కాన ఈ మనస్సుల
ోని తేడాయే ఆరోగ్యములలోకూడా తేడా. 'ఒకగృహ
జమాని ఇంటి ఆడవారి వస్త్రములన్నియు చించి
వి చెడినందులకు వాళ్లపై కేకలు వేసెడివాడు. ఈ
ెద్దమనిషి అన్నివిధముల ఆరోగ్యముగానే యుండెడి
ాడు. దైవవశాత్తు సన్నిపాతము వచ్చుటచే నేను మం
చ్చితిని. ఆతడు ఈసన్నిపాతమునుండి కోలుకొన్న పిదప
తడు నావద్దకు వచ్చి తనకున్న దురలవాటు చెప్పి ఇంటి
డవారిపై ఏదో ఒకందుకు కోపపడుట అలవాటనియు,
ది తప్పించుకొనుట దుష్కరముగా నున్న'దని ఘటక్
ారు తమ అనుభవమును చిత్రించుచున్నారు. బహుశః
రోగికి మందిచ్చుటలో ఏకోయొక ఘాటుమందు
Deep acting) పడుటచే ఈ అలవాటును మానకలి
ను. ఇంతకు ఆ రోగియొక్క మనస్సు బాగా
ెడినదని తెలియవగును. పసిపిల్లలు తరచు మారాము
ేయుట, ఏడ్చుట. ఈ మొదలగున వన్నియు వారి
నారోగ్యతను తెలియచేయును. హోనిమన్ మహో
ీయులు Every man is a moral lepor అనెను;
ది యథార్థము. రుగ్మత ప్రథమమున మనస్సునందే
ారంభించునని వెనుకనే చర్చించియుంటిమి. చెడు
ెలంపులు భౌతికశరీరముపై పరిణమించి కర్మలో
ప్రతిఫలించుటచే రుగ్మతలు కలుగుచున్నవి. ప్రథ
మమున చెడుతలంపు, తదుపరి చెడుపనులు. అంతే
కాని చెడుపనులు ముందు, చెడుతలంపులు తర్వాత
సంభవింపవు. మనస్సే శరీరమునకు ఆకారము నిచ్చును.
మనస్సుయొక్క ప్రతిబింబము శరీరము. మనస్సునుబట్టే
శరీరముండును. మనస్సు చెడిన శరీరముకూడా చెడక
మానదు. కాన నీవు శరీరమును ఆరోగ్యముగా నుంచ
దలచినచో నీవు మనస్సువిషయములో జాగ్రత్తపడ
వలయును. శారీరమును ఆరోగ్యముగా నుంచుకొనుటకు
ఇంతకంటె వేరుమార్గములు లేవు. ఈ హేతువుచేతనే
మేధాసంపన్నులగు మనపూర్వఋషులు పిల్లలను, యువ

కులను తరిఫీదుచేయుటలో తమ ఆశ్రమమందే యుంచు
కొని తమ శిష్యులకు ఆధ్యాత్మిక, అధిభౌతికముల
యందు తరిఫీదుచేసి తగిన నియమములను నిర్ణయించి సరి
యైన ప్రవర్తన కలవారినిగా చేసిరి. అది కేవలము మాన
ససంబంధముగా నొసంగబడిన తరిఫీదే. భారతవర్షమున
ఎంతకాలము ఇట్టి వాతావరణ ముండెడిదో అంతవరకు
మానసిక భౌతికారోగ్యము కలవారై ప్రజలు సుఖించి
యుండిరి. కాని అట్టి దినములు గతించినవి. ఇప్పుడు
ప్రస్తుతము ఎవరును తమమనస్సును అరికట్టలేరు.
అందుచే శరీరము చెడుటలో ఆశ్చర్యము లేదు. కాని
ఇప్పుడు శరీరము వివిధరుగ్మతలకు ఆలవాలముకాగా,
వాటిని ఎప్పటి కప్పుడు మాపుకొనుచు మాయనాటకము
లాడి క్రియకు నివారణాసాధ్యములైన ఘోరరుగ్మతల
పాలై మరణించుచున్నారు.

శరీరముయొక్క ఆరోగ్యము మనస్సు
యొక్క ఆరోగ్యముపై ఆధారపడి యుండుటచే—
మనస్సును ఆరోగ్యముగా నుండునట్లు చేయుట ఎట్లు?
దీనికి సమాధాన మిచ్చుటకుపూర్వము—ఎందుకు మనస్సు
అనారోగ్యమగునో తెలుసుకొనవలెను. మనస్సుకూడా
శరీరమువలెనే చెడుచున్నది. మనస్సు కేవలము
నిరాకారము, అతిసున్నితము - శరీరముయొక్క
పదార్థరహితమగు ఆధ్యాత్మికస్థితి. భౌతికశరీరము
మనస్సుయొక్క నిర్మాణము. శారీరరుగ్మతలు మనస్సు
నుకూడా చేరచును. ప్రస్తుతము ఈరుగ్మతలను
గూర్చి చర్చించుట మనపని కాదు. కాని ఏరీతిగా
మనస్సు అనారోగ్య మగుచున్నది, దాని నివారణ
ప్రస్తుతాంశము. సోరా (ఉలారము) మొదలైనవి
మనకు వచ్చుపెక్కు రుగ్మతల నుద్భవింపచేయుటకు
కారణములు-మానసికముగాను, శారీరకముగాను. ఏమం
దైనను శరీరముపై పనిచేయుటకుముందు మనస్సుపై
నది పనిచేయును. నేను నిన్ను ఒకవిషయములో
మందలించితి ననుకొనుము. ఆమందలింపు ఎక్కడ
ప్రథమమున పనిచేయును? తప్పక ప్రథమమున
మనస్సుపైని, తదుపరి శారీరముపైని. ప్రథమమున
ఆనిందావాక్యము మనస్సును భేదించును. తర్వాత
భౌతికముగా ఏడ్పు, గుండెదడ, ముచ్చెమటలు;

కొన్నియెడల ప్రహాతప్పట తటస్థించును ఈ విధముగా ఏదైన మనసును బాధించుటకు పూర్వము మనస్సుకు వైపరీత్యము తెచ్చును. ఇది స్వతస్సిద్ధమగు సిద్ధాంతము. ఒకవిషయమును గమనించవలయును. సూక్ష్మము, నిరాకారమైనదిగాక పదార్థపూరితమైనది పనిచేయుట తటస్థించినచో నది మనస్సునుమాత్రము తాకలేదు. మనస్సుపై ప్రసరింపవలెను, లేక పనిచేయవలయునన్నచో అదికూడ మనస్సువలె, కంటికి కానరానిదై అతిసూక్ష్మమై సన్నిహితముగా నుండవలెను. కారణము పదార్థముతో కూడిన వస్తువులు ప్రథమమున శరీరములో ప్రవేశించి అతిసూక్ష్మావస్థను చేరలేవు. ఉ॥ మనము తిను ఆహారము ఈ భౌతిక శరీరముగుండా లోనికి ప్రవేశించి జీర్ణమై సూక్ష్మముగా సూక్ష్మావస్థను జెంది, అప్పుడు మనస్సును, చేరి దానికి ఆలోచించుటకు నిశ్చలతకు చైతన్య మొసంగుచున్నది. మన మిప్పుడు ఈ పదార్థములగూర్చి మాట్లాడుటలేదు. ఉలారము, శగ, పవాయి తత్వములు అతిసూక్ష్మములు. మనస్సంతే సన్నిహితములు ఆ హేతువుచే అవి ప్రథమమున మనస్సుపై పనిచేయును. లఘుశక్తికరణ (Low Potency) సారూప్యౌషధములు మనస్సుపై పనిచేయనేరవు. ఎక్కువ ఉన్నశక్తికరణ (Higher Potency) ఔషధములు మాత్రమే ప్రథమమున మనస్సుపై పనిచేయును. ఈహేతువుచేతనే మాతృద్రావకము (Mother Tincture) సేవించి రుజువుచేయువారికి భౌతికశరీరముపై వైపరీత్యములు కలుగుటయు, అవే ఎక్కువ శక్తికరణ ఔషధములు మానసికముగా ప్రథమమున పనిచేసి తదుపరి భౌతికశరీరముపై పరిణమించుటయు సంభవించును. ఈ పైనుదాహరించిన త్రిదోషములు నిరాకారముచే మనస్సును చెరచుచున్నవి. ఇదే ప్రథమమున మనస్సునకు అంటుదోషము తగులుట హేతువు. ఇంకను వివిధములు కలవు. వాటినిగూర్చి ముందు యోజింతము. ఒకవిషయము—సృష్టియొక్క ఆద్యంతములు తెలుసుకొనుట దుర్లభము. చెట్టు ముందా విత్తు ముందా? అనునట్లుండును. ముందు మేఘము తదుపరి వర్షమా ? లేక మేఘమునకు హేతువు వర్షమా ? ఇది మానవమాత్రులబుద్ధికి నిర్ణయము చేల్చలేని భగవానుని సృష్టిరహస్యము. మనస్సును ఏదో విషయము బా
చును. తిరిగి ఆ మనస్సే తన్ను చెరచు ఈ విషయమును సృష్టించును. మనము భగవానుని సృష్టిరహస్యమును పైవిధంబున గుర్తించినచో మన కుతర్కమునకు అ
కాశము లేదు. ప్రథమమున చెడిన మనస్సును ఎప్పుడ
దిద్దగలిగినచో అప్పుడే దాని దుర్నయము అంత్యమగును కాని ఎప్పుడు అట్లు జరుగదు. పాపము తన ఉద్యో
మును చక్కగా నిర్వహించుకొను ఒక యువకుడు ఎట్లు సెగ తగిలించుకొనునో భగవంతుని కెరుక యథార్థముగా అతను సత్యవాది. యోగ్యుడు. కా
సెగ తగిలిన నాటనుండి ప్రతివిషయమునందు అబద్ధము దగా. ఇది అనుభవముగల ప్రతిసారూప్యవైద్యునకు తె
సినదే. అతనొక్కడే దీనిని నివారింపగలడు. దురదృష్ట
మున నాతడు ఒక వైరూప్యవైద్యునివద్ద కేగి 'అయ్యా
నాకు మూత్రనాళమందు బాధ, మూత్రముపోయు
నప్పుడు మంట. ఇట్లు కొన్ని దినములనుంచి బాధపడు
చున్నాను. బహుశః నాపొట్టకొరకై రైళ్లపై తరచు ప్రయాణముచేయుటచే సంభవించియుండును. దయ
యుంచి ఏదైనను ఇంజెక్షనుఇచ్చి మాన్పుడని కోరెను
వెంటనే ఇంజక్షను ఈయబడినది. రుగ్మత అణచిపెట్ట
బడినది. ఇక రోగము కుదిరినదనిరోగిని సం
చేయును. నీవు ఏంతో సంతోషముగా అతని
డబ్బిచ్చెదవు. వివిధనామములచే పిలువబడు పెక్కు
భయంకర రుగ్మతలను ఇట్లు అణచిపెట్టుటకు తావిచ్చు
చున్నావు. కాని ఎవరు చెవి యొగ్గి వినెదరు
చిడుము అణచిపెట్టబడుటచే ఉబ్బసము వచ్చునని ఎ
రైన విశ్వసించెదరా ! చిడుము పైకి మందు వ్రాసిన ఏమి
హాని ! చిడుము చర్మవ్యాధి; ఉబ్బసము—ఊపిరితిత్తు
జబ్బు— దీనికి దానికి ఏమి సంబంధము ? ఈ విధమైన
విమర్శన ప్రారంభమగును. ఎవరును ఈవిషయము లోతు
ఆలోచించరు. నీవు సారూప్యవైద్యుడవైనచో నీ ప
నీవు చేయవలసియున్నది. నీవు సత్యమును వెల్లడిచేయ
వలసియున్నది. సత్యము ఏనాటికైనను బయల్పడక మానదు.

పైనుదాహరించిన సెగరోగి నిజముగా సరియగు
చికిత్స (అణచిపెట్టుటకాదు) పొందినచో మనస్సు
వెంటనే ఈమాలిన్యమునుండి విముక్తిచెంది పెక్కు

వైరూప్య వైద్యులు ఇచ్చు ఒక ఇంజక్షనుకు ౫ం లేక ౬ం రూప్యములు వెచ్చించుటకుకూడ వెనుదీయరు కాని జీర్ణ వ్యాధులందు రోగిని పరీక్షించి ప్రథమమున మం దిచ్చుటకు పది, పదిహేను రూప్యములు సారూప్యవైద్యున కీయవలెనన్న బహుకష్టముగా నెంచెదరు. కేవలము ఉపరిభాగమునగల లక్షణంబులు తీసివేసి రుగ్మతను అంతర్ముఖముచేయుచికిత్సకు ఎంతయేని వెచ్చించెదరు. సత్యమునకు ఆదరణ లేదు. సత్యమును ప్రేమింపరు. మేలు మెరుంగులు గుర్తించు వాడుడు లేడు. మేలిమికంటె మెరుగునకే చేకు ఆదరణ మెండు. ఈ త్రితత్వముల చికిత్సా విధానమునుగూర్చి తెలిపియుంటిని. రుగ్మతల నిర్మూలించు చికిత్సను పొందకుండినచో క్రమముగా మానవులు చెడుట సిద్ధము. ఉన్న దోషములకుతోడు నూతన రుగ్మతలు బిలబిల, పలవలుగా పెరిగి వీరిని బాధపెట్టుట తథ్యము.

## సారూప్యౌషధములు: అపాయకరమా?

మనవారు "హోమియోపతిమందు చేస్తే ఉపకారము చేస్తుంది, లేకపోతే లే దనుట" కద్దు. ఇది కేవలము సత్యదూరము. ఇట్లు చెప్పు పెక్కుండ్రు సారూప్య వైద్యులనుకూడా నే నెరుగుదును. ఇది కేవలము వంచన.

ఉ॥ నన్ను ఒక మిత్రుడు తన బావమరదికి పెనుగొండలో చాలా జబ్బుగా నున్నది. ఒకసారి వచ్చి చూడ మని కోరెను. నాటిసాయంకాలము మే మిరువురము పెనుగొండ రోగిని చూచుటకు పోతిమి, ముందుగా అప్పట్లో మం దిచ్చుచున్నవారిని పిలిపించితిమి. వారు అసలు ఆయుర్వేదవైద్యులు. గత ౬ మాసములనుండి హోమియోపతి వైద్యము చేయుచున్నట్లు వింటిని. వారు ఈ రోగికి ఫాస్ఫరస్ (Phosphorous) ౧౦౦౦ శక్తికరణ(Potency)ఔషధము ౫ మోతాదులు ౧౦ దినములక్రిందట ఇచ్చితి ననియు, నాటినుండి రోగియు బాధపడుచుండె ననియు చెప్పిరి. గత మూడురోజులనుండి అమితముగా విరోచనములగుట తెలుసుకొంటిమి, రోగిది లేవలేనిస్థితి. అపరిమితమగు ఆయాసము. అతిసారము. అంత ఆవైద్యునితో విరోచనములు ఆపవలదనియు ఆపినచో రోగి వెంటనే మరణించు ననియు, రోగిపడుచున్నబాధ చూడలేక టరెంటులా (Tarentula) ఈయవలసిన దని చెప్పి వచ్చితిని. పాపము! ఆవైద్యుడు సారూప్య వైద్యశాస్త్రము పూర్తిగా చదువుకొనకుండుటచే ఈ అనర్థము వాటిల్లెను. ఫాస్ఫరస్ (Phosphorous) క్షయవ్యాధికి చాల జాగ్రత్తగా వాడవలయును. ఒకవేళ అవసరమువచ్చి వాడినను తిరిగి మోతాదు ఈయకూడదు. మీదుమిక్కిలి రోగియందు చైతన్యశక్తి క్షీణించి యుండెను.

కాన సారూప్యౌషధప్రయోగమందు చాలా నిదాన మవసరము. రోగియొక్క మానసిక లక్షణములు, ఇతరలక్షణముల సముదాయ వేమూలికను గుర్తించునో ఆమూలికను ఈయవలెను. ఔషధశక్తి (potency) విషయములో రోగిచైతన్యము (vitality)ను బట్టి రుగ్మత దీర్ఘతనుబట్టి, అతని యోగ్యతనుబట్టి నిర్ణయించవలసియున్నది. నీరసులకు, దుర్బలమనస్కులకు, మోటారు వారికి, ఘనశక్తి (higher poteney)కరణ ఔషధము వాడుట అపాయకరము. దీనివిషయము సాకల్యముగా హానిమన్ ఋషిప్రోక్తంబగు ఆర్గనాన్ అనుసారూప్య వేదమందలి సర్గలు పఠించి జీర్ణించుకోవలసియున్నది. తెలివితక్కువగా వాడినచో సారూప్యౌషధమంత బాధ కలిగించుమందులు వేరొండు లేవని నానమ్మిక. ఈ విషయములో కెంటు మహాశయులు చెప్పినఈక్రింది విషయములు గమనార్హములు.

"మనమందులు జనులను చంపకలిగినంత శక్తి కలిగినవి కానిచో అవి భయంకరరుగ్మతలను కుదర్చగల శక్తిని కలిగియుండవు. ఘనశక్తి (Higher potency) కరణ ఔషధములను ప్రయోగించుట అనగా వాడిగల కత్తులతో చెలగాటము వంటిది. ఒక డజనుమంది నీగ్రో జాతివారు నన్ను గదిలో బంధించి కత్తులతో పొడిచినను అంగీకరింతునుగాని తెలివితక్కువగా ఘనశక్తి కరణ ఔషధములను వాడునట్టి తెలియని సారూప్యవైద్యుని చేతులలో నుండుటకుమాత్రము అంగీకరించను. అవి సక్రమముగా వాడిన వాటంత ఉపకారము చేయునవియు లేవు. అక్రమముగా వాడిన వాటంతటి అపకారము ఏవియు చేయజాలవు."

కెంటువంటి మేధావి అనుభవముపై నుడివిన ఈ వాక్యములు చాలావిలువైనవి. సారూప్యౌషధముల నిరపాయకరమనుట శిక్షార్హము.

## సారూప్యము - మన ఆచారములు

"ఉష్ణం ఉష్ణేనశీతలం" అన్న ఆయుర్వేదసిద్ధాంతము మన సిద్ధాంతములకు చాల సన్నిహితము. ఎండపడి వచ్చినవాడు వెంటనే చన్నీళ్లయందు స్నానముచేసిన తప్పక వడదెబ్బకొట్టును. అందుచేతనే మన కార్మికులు ఎండకాలము పనిచేసి వచ్చిన తరువాత ఉడుకునీళ్లు పోసుకొందురు. వారు అనుభవముతో దాని అమూల్యతను గుర్తించిరి. ఈపాటకప్రజనము గాడ్పులప్పుడు వేడినీరు త్రాగుదురు. పెక్కుమంది చలివేంద్రలయందుకూడ వేడినీరు కాచియిత్తురు. మిక్కిలి చలికాలమగు కార్తికమాసమందు తెల్లవారకముందు నదిలో చన్నీళ్లు స్నానమాడుట సనాతనాచారము. ఈకార్తికమాసము నెలదినములు స్నానముచేయుట పుణ్యమని మనవారి యభిప్రాయము. పుణ్యముమాట ఎట్లుండినను ఈ మాసము చన్నీళ్ల స్నానము చేసిన ఆ సంవత్సర మంతయు ఆరోగ్యముగా నుందురు. మన ప్రాచీనులు ఒక పని వలన రెండుకార్యములు నెరవేరునట్లు ఆచారములు పెట్టియున్నారు. లోతు తరచిన ప్రాచీనమగు ఆచారములలాభములు గోచరించును.

## సారూప్యము - ప్రకృతి

ప్రకృతిని అవలోకించిన సారూప్యసిద్ధాంతము యొక్క సత్యము గోచరించును. మండువేసవికాలమగు చైత్రవైశాఖమాసములందు పనసపండ్లు, మామిడికాయలు కాయును. ఈ రెండు ఫలములు తినిన దారుణముగా వేడిచేయునని మనసిద్ధాంతము. మండువేసంగిలో ఇంత వేడిచేయుఫలములను సృష్టించుటలో సృష్టికర్త అభిప్రాయ మేమి? శీతకాలములో శీతాఫలములు, జామి, రేగడు ఈ మొదలగు శీతలఫలములను భగవానుడొసంగుచున్నాడు. ఆయాకాలములలో ఫలించు ఫలములు మానవుడు తప్పక భుజింపవలెనని మనవారి శాస్త్రము. దీనినిబట్టి యోచించినచో దయామయుడగు భగవానుడు మానవప్రపంచకముయొక్క ఆరోగ్యమును కోరియే వేసవికాలమందు వేడిచేయు ఫలములను, శీతాకాలములో శీతలఫలములను సృష్టించియున్నాడు. ఇదియే సారూప్య సిద్ధాంతము (Like Cures the Like). సారూప్య ఔషధములు సారూప్యవ్యాధులను నివారణచేయును.

సారూప్య వైద్యసిద్ధాంతముయొక్క అమూల్యత లోకమునకు చాటుటయే ఈ వ్యాసకర్తయొక్క సంకల్పము. సహజము—శాస్త్రసమ్మతమగు ఈ చికిత్సావిధానమునకు తగుప్రోత్సాహ మొసగుట ధర్మము.

---

# కాలమానము - క్షీణమాసము

శ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణ

సూర్యకుటుంబములో సూర్యుడు పెద్ద. గ్రహకూటంనడుమ నిశ్చలంగా ఉన్నాడు. నవగ్రహాలు (ఇటీవల 'ప్లూటో' అనే దశమ గ్రహాన్నికూడా శాస్త్రవేత్తలు కనిపెట్టారు) తమతమ ఉపగ్రహాలతో తమ పెద్దచుట్టూ తిరుగుతున్నాయి. ఇలాంటిగ్రహాల్లో భూమి ఒకటి. ఈ భూమిచుట్టూ తిరిగే ఉపగ్రహం చంద్రుడు. భూమి దినమున కొకమారు తనచుట్టూ తాను తిరుగుతూ ౩౬౫ దినముల ౬ గంటల ౯ నిముషముల ౯.౫౪ సెకనులలో (౩౬౫.౨౫౬౪ దినములు) ఒకమారు సూర్యునిచుట్టూ తిరుగుతోంది. ఈపరిభ్రమణంవల్ల సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నట్టు కనిపిస్తుంది. సూర్యుడు ఒక నక్షత్రమువద్దనుంచి తిరిగి ఆనక్షత్రంవద్దకు వచ్చేసరికి, భూమి సూర్యునిచుట్టూ తిరుగుటకు పట్టే కాలము పడుతుంది. ఈ భూమార్గం సరియైన వృత్తము కాకపోవుట చేతను (elliptic ecliptic), భూమి తనచుట్టూ తాను తిరిగే ఇరుసు (axis of the earth's rotation) భూమార్గమునకు లంబముగా నుండక వంగియుండుటచేతను (obliquity of the ecliptic) ఋతువులు, శీతోష్ణపరిస్థితులు కలుగుతున్నాయి.

ఇదంతా అనంతవిశ్వంలో, ఆద్యంత రహిత కాలగర్భంలో జరిగే ఒక చిన్న చిత్రం. ఇందులో ఒక గ్రహములో ఒకమూల ఉండే మానవబుద్ధికి ఈకాలమానం అవస[రమ]ైంది. ఇది రెండు విధములు; ఒకటి సూర్యమానము, రెండు: చాంద్రమానము. సూర్యకుటుంబములో పెద్దమై, మధ్యస్థమై యున్న సూర్యగమనాన్ని (apparent motion) అనుసరించి గణించేది సూర్యమానము. భూమికి అత్యంతసన్నిహితంగా ఉన్న చంద్రగమనానుసరణమైంది చాంద్రమానము.

ప్రస్తుతము వ్యవహారంలో ఉన్న ఇంగ్లీషు కేలెండరు సూర్యమానమ[ు]ననుసరించి ఉంది. ఇందు ఉద్దేశించిన ముఖ్యవిషయాలు రెండు: సంవత్సరమునకు దినములు పూర్ణసంఖ్యలో నుండుట, ఋతుధర్మము తేదీల ననుసరించి యుండుట. ఇందుకు సంవత్సరమునకు ౩౬౫ దినములని నిర్ణయించారు. ఈవిధంగా గణించి చూ[స్తే] ౪ సంవత్సరములలో సుమారు ఒక దినము తక్కువ అవుతుంది (.౨౪౨౨ × ౪ = .౯౬౮౮). అందుచే అబ్దసంఖ్య ౪ నిశ్శేషముగా భాగింపబడితే అది లీపు సంవత్సరమని (leap year), దానికి ౩౬౬ దినములని నిర్ణయించారు. ఈవిధంగాకూడా ౪౦౦ సంవత్సరములలో 3 దినములు ఎక్కువ వస్తున్నాయి. (1 – .౯౬౮౮ = .౦౩౧౨). ౪ సంవత్సరములలో .౦౩౧౨ దినములు ఎక్కువ; ౪౦౦ సంవత్సరముల[లో]

.౧౨ దినములు ఎక్కువ). దీనికి ఈసవ
ణ ప్రవేశపెట్టారు: శతాబ్దసంఖ్య ౪ చే
శ్శేషముగ భాగింపఁబడినకాని, శతాబ్దము
entury year) లీపు సంవత్సరం కాదు;
నగా ౧౯౦౦ సంవత్సరం ౪ చే నిశ్శేష
ముగ భాగింపబడినప్పటికి, ౧౯ (century)
చే నిశ్శేషముగ భాగింపబడదు కాన
౯౦౦ లీపుసంవత్సరం కాదు.

చంద్రుడు భూమిచుట్టూ తిరుగుటకు
సుమారు ౨౭ ⅓ దినములు పడుతుంది. కాని,
సూర్యునివద్దనుండి తిరిగి సూర్యునివద్దకు
చ్చుటకు ౨౯.౫౩౦౬ దినములు పడు
ంది. నక్షత్రములకు పరస్పరముగా సూ
ర్యుడు తిరుగుచున్నట్లు కనిపించడంచేత
ఈ భేదం కలుగుతోంది. సూర్యునకు పర
స్పరముగా (relative to the sun) చంద్రుడు
కచుట్టు తిరుగుటకు పట్టే ఈ కాలము
౨౯.౫౩౦౬ దినములు) చాంద్రమానము
lunation) అంటారు.

ప్రస్తుతం ఆంధ్ర దేశమున ప్రచార
ం దున్న పంచాంగము చాంద్రమాన
గణితమే! ఇందులో ఋతుధర్మం మాసాను
క్రమముగ నుండుటకు చేసిన ప్రయత్నం కన
బడుతుంది. ౧౯ సూర్యమాన సంవత్సర
ములు లేక ౨౨౮ సూర్యమాన మాస
ములు ౨౩౫ చాంద్రమాసములకు
సమానం (౨౨౮ × ౩౬౫.౨౪౨౨ =
౬౯౩౯.౬౦ ; ౨౩౫ × ౨౯.౫౩౦౬ =
౬౯౩౯.౬౯). ఈ సవరణ నిమిత్తం సుమారు
౧౯ సంవత్సరాల కొకమారు అధికమాసం
వస్తుంది. నిజానికి ౧౯ సంవత్సరాలలో ౭
(౨౩౫ – ౨౨౮) అధికమాసాలు ఉంటాయి.

సూర్యుడు క్రమంగా ద్వాదశ రాసులను
ప్రవేశించడం సంక్రమణం అంటారు. సాధా
రణంగా ఈ సంక్రమణం ప్రతిమాసంలోను
ఉంటుంది. సంక్రమణం లేని మాసం అధిక
మాసం అవుతుంది. ఇంకా, పూర్ణిమనాడు
చంద్రు డున్న నక్షత్రనామం ఆమాస నా
మానికి చెంది ఉంటుంది. చైత్ర పూర్ణిమ
నాడు చంద్రుడు చిత్తా నక్షత్రంలో ఉంటా
డు; వైశాఖ పూర్ణిమనాడు విశాఖా నక్ష
త్రంలో. ఈ విధంగా కానినాడు ఆమాసం
అధికమాసంగా గణిస్తారు. సంక్రమణ రహిత
మైన మాసాలు, నక్షత్రమానములు ఏకం
కాని మాసాలు ౧౯ సంవత్సరములలో ౭
ఉంటాయి.

అధికమాసం అందఱకు తెలిసిన విష
యం కాని, క్షీణమాసం అని మరియొక సవ
రణ ఉంది. ఇది చాలామందికి తెలీదు.
కారణం: అది సుమారు ౬౨ శతాబ్దాలకు
ఒకమారు సంభవిస్తుంది. ౨౩౫ చాంద్ర
మాసాలు ౧౯ సంవత్సరాలకంటె .౦౯ దిన
ము ఎక్కువ (౬౯౩౯.౬౯ — ౬౯౩౯.౬౦
= .౦౯) ఈవిధంగా ౧౯ సంవత్సరములలో
.౦౯ దినము హెచ్చు ఉంటే, సుమారు ౬౨
శతాబ్దాలలో ఒక మాసం అధిక మౌతుంది.
శీతోష్ణాది పరిస్థితులు కాలమానాన్ని అనుస
రించి ఉండాలంటే, ఈమాసం తగ్గించవలసి
ఉంటుంది. దీన్నే క్షీణమాసం అంటారు.
ఇది కొద్ది శతాబ్దాలకు పూర్వమే సంభవించి
నట్లు తెలుస్తోంది.

---

# చితి

## శ్రీ రామచంద్ర అప్పారావు

గాడుపులో నదో కదలి కాల్చుచు నున్నది చావుమేళమే
నా ? లలనా వియోగ హృదయానల భీషణ రక్తధారలే
నా ? లలితా ! జగమ్ము తన అస్ఫుట చిత్తములోన గాలిపే
శోలికలోన నూగుచు అనూనముగా నిదురించు మత్తులో.

చితి కాలుచున్నది, శిశిర శీతాచల
శిథిలవాయువులచే శిఖలు విరిసి ;
అది ప్రేతభూమి, దినాంత, మేకాంతమ్ము,
మునిచీకటివిషాలు ముసిరికొనియె.

చితి మండుచున్నది, చెంత వింతప్రకృతి
విరహావీణ వరాళిపార స్పృశించు
అది హృదయమ్ములో నాగి మాఱ్ఱోగి ఎ
టో పాప మాకాంత నూరడించు.

చితి రగులుచుండె చిటచిటా సెగల రొదల
ఆమె అట నిరాశా స్వచ్ఛమైన యెడద
నిలచినది, సొగసొక్కటే కలగి వింత
వింత తలపుల ముంచి ఏడ్పించు నన్ను.

కదలవు శుష్కహస్తములు, కంపిల దామెసుమాధరమ్ము, వా
యదరదు, వెఱ్ఱిగా నరయు నక్షుల నంత నభోంజనాల నే
యదో ఒక మేళనం గని నిజాత్మను జూచి భామల్ కదల్చు, సో
కి దిగి కశైకకాంతులె రగిల్చిన ఆచితి హోమగేఖకున్.

చితి రగులుచుండె, ఎఱ్ఱని వెతల పొగల
వలలు నవ్వుచుక్కల నట్టె పట్టి విడచు ;
పాడు తావి కళా సౌరభమ్మువలెనె
రేగి నాకన్ను లదిమి లాలించుఁ గలల.

కదలుచున్నవి శల్యఖండమ్ము లేనాడొ
సొలసిన ప్రియురాలి స్ఫురణచేత ;
ఎలమొగ్గల్ దోఁచు ఆమోద మంటలోఁకూడ
నీరవమ్ముగ పాట నేదొ పాడు ;
ఈమంచురక్తమ్ము లే నా కళావీథి
పిన్నవోర్మి నవ్యవిధి నటించె
అవి నేడు పొగపొగలై నగ్నముగ విశ్వ -
మును ముంచి వణికించి పోవు నెటకొ.

అబ్బ ఓయీ కళోపాసకా ! నశించె
మా మరణలోచనములకు నీ మహాత్మ
చంద్రు డెప్పటియట్ల శ్రీ సాంద్రుడయ్యె
భువి యథావిధి సుఖనిద్ర మునిగిపోయె.

ఈచితి నాది లాగ వణికించును సన్నిపు; డాడినంతనే
ళాచణ యోజనా జలదలాస్యము లేరనిపూలవానతో
పూచిన వేల్పుకన్నె కలె ముద్దులతో నను బిల్చునో హా దే
వీ ! చలియించు జీవము, నటించు నశించును నేటిపాటతో.



# కీర్తిశేషులైన యేచూరి వెంకట్రామయ్యగారు

వెంకట్రామయ్యగారు మొన్న జూన్ ౧౯ - వ తేదీ సోమవారం మధ్యాహ్నం 3 గంటలకు విజయనగరంలో దివంగతులైరన్న ఘోరవార్త విని చాలాదుఃఖపడ్డాను.




వెంకట్రామయ్యగారు తెనుగుతల్లి కనుక్కున్న మహారత్నాల్లో ఒక మహారత్నం. విజయనగరం కాలేజీలో చాలా కాలం కెమిస్ట్రీ ప్రొఫెసరుగానున్న, తరువాత ప్రిన్సిపాలుగానున్నా, ఆపిమ్మట ఎస్టేటు దివానుగానున్న ఉండి పింఛను పుచ్చుకున్న శ్రీ యేచూరి నరసింహం పంతులుగారి కుమారుడు. ఇప్పుడు ౪౦ సంవత్సరములకంటె ఎక్కువ వయస్సులేదు. మాతమ్ముడు తిరుమలరావున్నూ, వెంకట్రామయ్యగారున్నూ సహాధ్యాయులు. బి. ఏ. కెమిస్ట్రీబ్రాంచి పేసయిన తరువాత వెంకట్రామయ్యగారి చాలాకాలం పరిశోధనలుచేసి, అనేకకొ విషయాలు కనుక్కొని ప్రకటించారు. ధాతుశాస్త్రంలో వారు చేసిన కృషికి మెచ్చు కొని వెంకట్రామయ్యగారు ఫ్రాన్సు వె నప్పుడు (Special Convocation) ప్రత్యేకంగా కాన్వొకేషన్ మహోత్సవం పారిస్ యూ వర్సిటీవారు వారొక్కరికోసం జరిపిం డాక్టర్ ఆఫ్ సైన్సు D. Sc. బిరుదం ఇచ్చా రు. కొంతకాలం హైదరాబాదు నైజా కాలేజీలో ధాతుశాస్త్రాధ్యాపకులుగా ఉం ఆరోగ్యం బాగులేక అపనికి ఆయన రా నామా ఇచ్చేశారు. జనసామాన్యానికి కూ (Scientific knowledge) శాస్త్రవిజ్ఞానం బో పడడానికి ఉపన్యాసాలు ఆయన ఇచ్చేవార వెనక ఒకమారు ఎలమంచిలి హైస్కూల లో వారు యిచ్చిన ఉపన్యాసం ఇంకా న చెవులలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నది.

ఇటీవల జ్యోతిషంలో ఆయన చాల ప్రవేశం కలుగజేసుకున్నారు. ఋగ్వేదంలో ఉషస్సు సంబంధమైన ఋక్కులు Auror Borealis తో సమన్వయం చేస్తూ గొ గ్రంథం తయారుచేస్తున్నారు. లోకమాన తిలకుగారి ఒరయన్. (Orian-Arctic Hom of the Vedas) వలె జగత్ప్రసిద్ధి కావలసి ఈ గ్రంథం పూర్తిగాకముందే—౪౦ సం త్సరాల నడియావనంలో హృద్రోగం పా బడి ఆయన ప్రాణాలు విడిచారు. శ్రీ వి

యనగరం రాణీవారికి కూడా ఈయన చేసే పరిశోధనయందు చాలా ఆదరం కలదు. లోకానికి మంచి విజ్ఞానాభివృద్ధిన్నీ, తెనుగు దేశానికి కీర్తిన్నీ తేగల యీవ్యక్తి యిట్టే కాలగర్భంలో చేరిపోయింది. వార్ధక్యదశలో తండ్రిగారికి పుత్రశోకమున్ను, గర్భవతిగా నున్న సతీమణికి భర్తృవియోగమున్ను, నలుగురుకు మార్తైలకు పితృవియోగమున్న కలిగిస్తూ వెంకట్రామయ్యగారు అస్తమించి, కుటుంబమునకూ మిత్రలోకమునకూ ఆంధ్ర లోకమునకూ తీరనిలోటు వాటిల్లచేశారు. విజయనగరం మునిసిపల్ కౌన్సిలుకు వైసు ఛైర్మన్‌గా ఉండికూడా వీరు ప్రజాసేవ చేసే వారు.

పరమేశ్వరుడు ఆయన ఆత్మకు శాంతి న్నీ, ఆయన వియోగమునకు దుఃఖించే బంధుమిత్రులకు ఉపశమనమున్ను కలిగించు గాక.

---

# టాంగనీక

మాండేటెడ్ రాష్ట్రియునందు దంతములు, సింహములు మెండుగల్లి, అడవిజాతులవారు లేకున్నచో అట్టి రాష్ట్రీయచరిత్ర సంపూర్ణ మైనదని చెప్పుటకు వీలులేదు. జర్మనులను, మరొకసెల ఇంగ్లీషువారిని తుపాకులతో ప్రేల్చుటకు ఒకప్పుడు రెండుదులకు చేర్చబడినదో వారికి తెలియునే తెలియదు. వారిజీవితము మిక్కిలి అవనీతి కరముగ పరిణమింపక తప్పినది కాదు. ఇటీవల అమెరికాలో ప్రచురింపబడిన "బ్లాక్ అండ్ బ్యూటిఫుల్" అని పిలువబడే మేరియస్ ఫార్టీ గారి గ్రంథమునందు ఈ విషయము బాగుగ పొందుపరుపబడినది.

టాంగనీక రాష్ట్రమని పిలువబడే ప్రదేశమునందు గ్రంథకర్త వేలకొలది మైళ్లు ప్రయాణము నరచ్చెను. నిష్కపటులను ఈ ఆఫ్రికనులకు తనప్వదేశమంటే యేవిధముగ నుండనది మరొక గ్రంథమునందు యెక్కువ విపులముగ గన్పించదు. వారిలో వేలకొలది మంది మలేరియాచే బాధపడిరి. ప్రపంచ యుద్ధమువలన ఇన్‌ఫ్లుయంజా ప్రబలముగా నుండెను. ఈరెండు జాడ్యములకు క్వైనెను పరమౌషధము. పంచిపెట్టుటకు తనవద్ద క్వైనెను సమృద్ధిగ నున్నంతవరకు తన సంచారము యెంతో దిగ్విజయముగా సాగినదో, క్వైనెను లేనప్పుడు యెట్లు నివారింపబడినదో గ్రంథకర్త వ్రాసియున్నారు.

వారుమిషనరీ కారు. అయితే పదియేండ్లు మధ్య ఆఫ్రికాలో క్వైనెనుగూర్చియు, ప్రేమను గూర్చియు వారు ప్రచారము సలిపిరి. జాతిసమితి మలేరియా కమిషనువారు సూచించినట్లుగా మలేరియా వచ్చినప్పుడు 5 మొదలు 7 దినములువరకు 15 నుండి 20 గ్రెయినులు చొప్పున, మామూలు దినములలో 6 గ్రెయినులు చొప్పున ఆయన క్వైనెను వొసగెను. వారికి క్వైనెను యెట్లుపనిచేసినదీ, మరెవరు అంతకంటె స్పష్టముగ వ్రాసియుండలేదు. M. E. No. 64

# నివారణ

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

(శివతపోభంగమునకు పోవుచున్న మన్మథునితో రతీదేవి—)

పోజనదు నానాథ! పోజనదు నానాథ!
వేడ్క లిగురొత్తగా వీణియను మీటెదను:
గానప్రపంచమున కన్మరగి నిద్రింప
వేళ అయ్యెడి గాన వెడలకుడు నానాథ!
ఎంతో కాలమ్మయ్యె, ఏల పోదుకు, స్వామి
స్వప్నదృశ్యమ్మెల్ల సత్యమై దోచేను!
మినుమిట్లు గొల్పేటి మెరపుతీగల గుంపు
తొంగిచూచుచు నేదు ద్రోహమని పల్కెనవి!
పూర్ణిమానిశనెల్ల పొలచె సిమేఘాలు
ఈ యంధకారమున ఏదారు లందెదరో
క్షణమైన మిము వీడి కదలజాలను నాథ!
ప్రొద్దెక్కెనను గూడ పోదు నని యనరాదు
ఏకాంతమై మీర లేరీతి పోయెదరు
సాహాయ్యమొనరింపచనుదెంతు మీతోడ...

ఈ యామమందేలో హృదయభారముమిగుల
కప్పివేసెను నన్ను, కదలిపోకుడు నాథ!
కార్యభారమైన కదలరా దేవేళ
ఆ దూర దేశాల కరుగవల దో నాథ!

శుష్కించి శుష్కించి సోయగము కోల్పోయి
తెలతెల్ల వారేటి కళలనే జేరినవి.
శన్యూవస్సున మీరు చనుట శుభమే కాదు:
పవళించగా రాదె భార్యకౌగిలిలోన!

ప్రాక్పర్వతమ్ముల్లో పలవించి పలవించి
పాలిపోయిన మూర్తి పడిపోవుచున్నాడు;
దూరదేశమునుండి తొంగిచూచిన దివ్వె
తిమిరమ్ములను పంప తెలియలేరే నాథ!
శివతపోభంగమ్ము చేయబోకుడు నాథ!

జగములన్ రక్షింప సల్పు వాడు తపస్సు.
ఇంద్రునానతికి మీరేమి లోబడరాదు!
మీకృత్యముల నెల్ల మీరిపోవుచు శివుడు
పర్వతేశ్వరుకన్య పరిణయంబగు వాడు.
గళలాంఛనము చూచి కంపింతు రోయేమొ.
ఉగ్రతాపసిశక్తి నూహించగాజాల.
శివకేశవులు, నాథ! స్నిగ్ధు లొదురుగాన
చెలరేగగా రాదు శివతపస్సును గాంచి:
దేవముఖ్యుడు పంప దివిజగాణిక్యమ్ము
సంయమీంద్రులచేత శాపదగ్ధం బయ్యె.
ప్రియురాలి పల్కులను పెడచెవిని బెట్టకుడు;

అది యేలకో గాని అంతరంగమునందు
సంభ్రమం బఃఖమైన శాంతించకున్నయది,
కిన్నెరల గానమ్ము, కన్నెకామిని నోము,
చిన్నెలందిన ప్రేమ, సన్నుతించును శివుడు:
శ్రమజెందకుడు నాథ! శాంతించు డిట మీరు
ప్రొద్దెక్కెనను గూడ పోదునని యనరాదు!
వెడలుదము వనిలోకి విహరింప నుదయాన!
పరిమళమ్ముల నొసగి ప్రత్యూష కాంతిలో
విరులు క్రొత్తవి నేడు విరిసియుండును నాథ!
భూషించెదను మిమ్ము పుష్పమాలిక తోడ.

ావృతీగలలోన పొందియుండగ పూల
ేవముఖ్యుడు మనల తెలసికొనలేడచట.
ంతించునదియేమొ చెప్పరాదా నాకు?

ధిగుమ్మములోన వేచియున్న వసంతు
ంటి కంపుదు నాథ, ఏను రానని చెప్పి—
ాణసంశయవేళ బంధు ముఖ్యునికైన
న్పృతమే పల్కినను అన్యాయమే గాదు!
ల సందేహింతు రేల మాటాడరు?
వితేశ్వరి పల్కు శిరసావహింపరా?
యత్నమును వీడి ఆరామవాటిలో
వవిగ్రహము నిల్పి చేయదగు కృత్యమ్ము.
ాయుదేవుని గొల్చి వాయువుల దెప్పింతు:
ావిమొగ్గల నతడె మరలించు శివుపైకి!
ియురాలి ప్రార్థనల వినిపించుకొనకుండ
దియేల ప్రాణేశ, అట్లు పోయెద రేం?

మీ దృఢవ్రత మరసి మీమాట కెదురాడ
జాలకున్నా నిపుడు, క్షణ మాగుడో స్వామి!
శ్రేయస్సు నివ్వగా శీఘ్రమ్ముగా నిదే
శుభనిమిత్తమ్ములఁ జూచి వత్తును నేను.
పోవలదు, పోవలదు, పోవలదు, ప్రాణేశ!
శకునమారయకుండ చనరాదు, చనరాదు!
ఆత్మేశ్వరిని మీర లాలింగనమ్ములో
ప్రమదభరితను జేసి బయలుదేరుడు నాథ!

అయ్యయో నామాట లాలకింపక త్రుటిని
కైలాసగిరి జూడ కదలిపోతిరె నాథ!
ఏమి కానున్నదో, ఏమి అనుభోగ్యమో?
అశుభచింతలె వెల్లు నంతరంగమునందు
ఏకాకినిగ నేను ఇచట నిల్వగలేను
తోడు నీడగ నిదే తోడ్తోన అరుదెంతు.



# నాటకకళ: లక్ష్మయ్యగారు

శ్రీ అత్తిలి సూర్యనారాయణ
(రవీంద్రసారస్వతసమాజము)

కళాపీఠం ప్రెూలు వీకరించి, సుస్నిగ్ధాలైన భావకుసుమాలపరీమళాన్ని నింపి, మూర్తిదర్శనత్వంపొందిన కిరణాలల్లో శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్యగారు స్నాతులయ్యారు.



లక్ష్మయ్యగారు 'బొమ్మ, బొరుసు' అయిన నటన, నాట్యకళాసరస్వతికి 'కొండ తిరిగీ కోన తిరిగీ' పేర్చి కూర్చారు సుమమాల. ఉపాహారంగా 'ఆవు నడిగీ, అడవినడిగీ, పూలగిన్నెల' పొందుపర్చారు 'గుమ్మపాలూ, కొమ్మతేనే' యున్నా. 'రాతిబొమ్మ నన్ను రాతికళ్లా నవ్వే'నని 'తృష్ణలూరా వెదకితికదా,' అన్న 'కృష్ణాభిసారిక'సంతుష్టిలో జీవితాన్ని పూలబాటగా చేసుకుంటున్నారు.

కవి, నటుడు, కళాసేవకుడు, నాటకసమా నిర్వాహకుడు, ప్రచారకుడుగా ఆయనచేస్తున్న సే యిట దిఙ్మాత్రసూచితం.

చిన్నవాడు:— ౧౮౯౯ నాటి భీమవరంలో జననం. వీరిప్రథమవిద్యార్థిత్వంతోనే భీమవరాని ఉన్నతపాఠశాల ప్రథమంగా—మిషనరీ హైస్కూలు— ప్రారంభమవుత. విద్యార్థిగా ఉండే రోజుల్లో పా శాలలో నాటకాలు వేయించటానికి కారకు డయ్యా రంటే అప్పట్లో సంచారరీత్యా భీమవరంలో నాట ప్రదర్శనాల నెలకొల్పిన శ్రీ గోవిందరావుగారి సురభి కంపెనీయే ప్రోత్సాహ మిచ్చినది. స్కూలుఫైనల ప్యాసై దత్తమండలాల్లో స్కూళ్లయిన్స్పెక్టరిస్సు ఆఫీసుగుమాస్తాగా, అయిదారేళ్లు పనిచేశారు. తాను పెట్టుకొన్న లక్ష్యానికి వైరుధ్యమగు ఈ ఉద్యోగానికి పుష్పార్ఘ్య మిచ్చి, గోవిందరాయ సురభినాట్యమండలి ప్రధానకార్యదర్శిగా నియమింపబడటం, ఆయన కంటూవచ్చిన నాటకకళ సర్వాంగసుందరత్వస్వప్నా ల్ని యదార్థం చేయకపోతాయా అన్నఆశాలతకు చిగుళ్లు తొడిగింది.

కవి:— ఉద్యోగపర్యాయాలలో, బాలికలపాఠశాల రంగస్థలానికి అనువైన 'భరతపట్టాభిషేకం', 'తులసి' రచించి, ప్రదర్శింపించి, విద్యాశాఖాధికారుల అభి నందనప్రశంసల నందుకుతూ వచ్చారు.

సమాజకార్యదర్శి:—నమ్మి సేవించుటా; ఆనమ్మిక మోసపడనీని, యింకిపోని ఆదరణ తీపి జలవెల్లువ పాలించుటా, సాత్త్వికలక్షణాలు. ఎప్పుడు ఏమాట రానీ, గోవిందరాయుడూ, సురభికంపెనీ అనే లక్ష్మయ్యగారి ప్రతిజీవకణమూ విశ్వాసప్రేమపూరితము.

నాటక కళాసేవలో తన యజమాని యొనర్చిన
...నకు, అనన్యజన లభ్యమగు శిలావిగ్రహ ప్రతిష్ఠ
...యొనర్చి, ధన్యు డయ్యారు లక్ష్మయ్యగారు.

పండిత, కవి, విమర్శకుల చేరి, తమ ప్రదర్శన
...లకు ఆహ్వానించి, లోటుపాట్లు తెలిసికొని, సమాజ
...భివృద్ధికి తోడ్పడు ముఖ్యాంశాన్ని అమలు జరిపి
...ది యీనాట, లక్ష్మయ్యగా రొక్కరే అన్నది వివా
...ంశము కానేరదు.

అంతకుమున్ను పురాణపక్కీ సేను సమాజనాటక
...కు 'కొత్తపాటలు పాడుకొమ్మ'న్నది—కొత్తనాట
...లే!- వీరు సాంఘిక నాటకాలు రచియింపజేసి ప్రద
...ంపించు టే.

అనేకమంది కవులు, ప్రతికాధిపులు యీమేటి
...త్రి సంపాదన గోవిందరాయునికి కూర్చి పెట్టినది శ్రీ
...క్ష్మయ్యగారే అని ప్రచురించారు. ఒక్క పాదచరణ
...ర్తికి, ఒక్కకోట పట్టిచ్చిన మెలకువకు, మన
...ంధ్రకష్మపతులు అగ్రహార పారితోషికమో, గండ
...పెండేరమో, అక్షరలక్షలో యిచ్చిన యితిహాసము
...న్నది!

వివిధనాట్య మండలులకు ప్రోత్సాహము, తన
...తచే గల్పించి, వారి 'నాట్యకళోద్ధారక' బిరుదుకు
...రణం లక్ష్మయ్యగారు.

నాట్యకళా పరిషత్స్థాపన:— "చలన చిత్రాలూ, ...ట్లాడే ఫిలుంలూ విరివిగా ఒకొక్కటే వచ్చేస్తూ ...టకాల్ని, నాటకరంగ ప్రాశస్త్యాన్నీ అణగద్రొక్క ...నుకకు నెట్టేస్తున్న యీరోజుల్లో, నాటకరం ...వశ్యకతా, దాని ప్రాశస్త్యం నిలబెట్టి, ముందంజ ...యుటలో తగు శ్రద్ధా, ప్రోత్సాహ సహాయాలూ అర్థి ...స్తున్నాను" అనే వీరి ఆవేదనాపూర్వక విజ్ఞప్తికి ఫలి ...ంగా ౧౯౩౯ లో, మహామహోపాధ్యాయ ఆచంట ...ంఖ్యాయనశర్మ, దేశోద్ధారక కళాప్రపూర్ణ విశ్వ ...థ — కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ...ట్టి చినపూర్ణయ్య పంతులుగార్ల అధ్యక్షతను ...డుకోజులు తెనాలిలో ప్రథమ నాట్యకళా పరిషత్తును జరిపించుటకు శ్రీ గోవిందరాయుని ద్రవ్యసహాయము కారణమైనది.

శ్రీ నీలంరాజు వెంకట శేషయ్యగారి సంపాదకత్వమున వర్ధిల్లిన 'నాట్యకళ' అను పరిషత్పక్షమున వెలువడిన త్రైమాసికపత్రిక జననానికి లక్ష్మయ్యగారు హిరణ్యగర్భులు; దాని స్థిరత్వానికి లక్ష్మయ్య శేషయ్య గారలు రమామాధవులు. సంచీ బుజాన్ని వేసుకొని చందాదారులకొరకై తిరుగు లక్ష్మయ్యగారి నప్పట్లో చాల మంది ఎఱిగున్నదే! అట్టిసులక్షితమగు పత్రిక విలయమొందుటకు, నటుక, లోక అనాదరణా విషమనేత్రపు చూపులే కారణము. లోక శివతాండవాని కదరి యొదిగి అణగిన దీ 'నాట్యకళ.' ఆకళలో, దానివల్ల సుఖించి, ఆనందించువారల నిర్లక్ష్యత పట్టి ఉదాసీనత అనుకొన నీదేమో అనే సంశయము.

పరిషత్కార్యదర్శిగా నాట్యకళాపోషణ కనువగు పద్ధతుల నూహించుచు కలల వెళ్లబుచ్చుతున్నా డీనాటికీ దీర్ఘ పవళ్లను లక్ష్మయ్యగారు.

నైజాం ప్రభువుగారి రజతజూబిలీ ఉత్సవాలల్లో ఆంధ్రనాటక ప్రదర్శనావశ్యకత నిరూపించుటకై డాక్టరు కజిన్సు, సర్. రాధాకృష్ణన్ గార్లచే బంపబడి, అచ్చట ప్రచార మొనర్చి, తెనుగు నాటకప్రదర్శనాన్ని సాగించిన ఆంధ్రుడు. తెనుగువారు కప్పతిప్పలుగానున్న ఆ దేశాన్న తెనుగు ప్రదర్శనాలకై మహజర్లా ?!

పశ్చిమగోదావరి జిల్లాలో యీపరిషచ్ఛాఖ స్థాపించారు, లక్ష్మయ్యగారు.

ప్రచారకుడు:— ప్రచారకులుగా నాటకకళకై వీరొనర్చిన త్యాగాన్ని ప్రశంసిస్తూ శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారిల్లా వ్రాశారు (౧౫-౫-౩౭ కృష్ణాపత్రిక):

"...మీ ప్రచారము చాల బాగుగా నున్నది. ఇట్లే దేశ మెల్లెడల సాగిన ఎంతో ఉపయోగముగా నుండును. గ్రామములలో భరతనాట్యము, తోలు బొమ్మలు, పూర్వమువలె ఆదరింపబడు నట్లు చేయవలెను..." ఈప్రశంస లక్ష్మయ్యగారు పరిషదుద్యమ

ఆదర్శాన్నీ, పరిషత్తుయొక్క తీర్మానాల్నీ పశ్చిమగోదావరిజిల్లాలో ప్రచార మొనర్చినతరి కల్గినది.

నాటకకళాభివృద్ధికి ప్రభుత్వచట్టముల ప్రతిబంధకము లెట్లున్నవీ పలుచోట్ల ఉపన్యసించి, తుదకు ప్రస్తుతపు మంత్రుల ఎదుటా విన్నవించి, ఆచట్టాల్ని రద్దుచేయించుటలో మొదటి మెట్టు ఎక్కారనే చెప్పాలి.

నటుడు:—కావ్యాలల్లో చుక్కలవెలుగు విలువ భావనాపటిమచే ఊహించి మెళుకువల నొదిగి పద గుంఫిత మొనర్చిన కవిసృష్టిగల రసవత్ఫలాలను, శబరివలె సంగ్రహించి- కాదు, ఆస్వాదించి తేనెవాకల ప్రజల కందిచ్చు నటు డుంటేనే ఆకవిబ్రహ్మసృష్టికి చరితార్థత.

ఆ నటుని బాహ్యాంతర ప్రవృత్తినిబట్టి పాత్రల సైక మగుట సంభవిస్తోంటుంది. తన్ను తెలిసికొన్నవ్యక్తి నానందమయుని 'రసో వై బ్రహ్మః'గా అంగీకరించుట- అంగీకారాన్ని కోశదేలేడు. అయిపోతూన్నప్పుడు - దైవాని కట్లో, కవికీ అల్లే.

మహారాజు కోపముగాని, ఆదరణగాని కనుగొల కుల తొణికిసలాడుతుంది. మధ్యమజనుడు, వాచిక ప్రస్ఫుట మొనరుస్తాడు. ఇంకను తక్కువ కేగినచో, అతనిమనఃప్రవృత్తి క్రియావాచికద్వంద్వాల నలుగుతుంది.

విషయం, కాలం, సమయస్ఫూర్తి సందర్భ శుద్ధి ఎఱిగి, నిరంకుశాః కవయః' అనిపించుకొన్న కవివ్రాతల ఒంటబట్టించుకొని, అందుకు తగ్గ పాత్రోచితాన్ని పోషిస్తూ కళారాధనచేసిన నటుడు రసపరిప్లుతుడు.

అతని తీరు గమనించి, లోతులెఱిగిన, తెలిసికోవాలన్న పఠితులూ తన్మయులే!

చారిత్రాత్మకములను, సాంఘికములను ప్రదర్శించునటుడు, ఆకాలాన్నీ, ఆచారాల్నీ, పరిస్థితులను గమనించుట విధి.

ఆంధ్రకవిశేఖరులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి 'వేనరాజు' రంగస్థలాన్ని పునీతంచేయలే దిప్పటికీ అంటే, ఓపిక చేర్చుకొన్న రసభావప్రాధాన్యాన్ని మనస్సా అంగీకరించి అమలుబెట్టు సిద్ధహస్తులగు నటులు లేరనే చెప్పాలి.

బొబ్బిలినాటకంలో 'బుస్సీ'వంటి పాశ్చాత్య వ్యక్తిని మీ కెఱుకచెయ్యాలంటే, ఆనాగరిక తె సాంప్రదాయావసరా ల్నెఱిగి ప్రదర్శించుట అవసరం ఈ వేషధారణ, పలుకుఉచ్చారణలలో లక్ష్మయ్యగారి కొన్నిపట్ల డా. గోవిందరాజుల వెంకట సుబ్బారావు గారిని మించిరని వ్రాయుట సాహస మనుకోను.

మన తెనుగునాట హాస్యం, నాటకాలల్లో విదూషకునిదో, లేకపోతే ప్రత్యేక గాంధోళిగానిదో అయిపోయింది. కాని ప్రధానపాత్రలలో సున్నితవై 'పెదవుల్ని బిగించుకోవాలనుకొనే' పెద్దల కదలించ పాత్ర సృష్టించిన నాటకాలు అరుదు.

శ్రీ విశ్వనాథ కవిరాజుగారి 'మహానంద నాటకమున కష్టించి ఓ విచిత్ర, 'ఇయాగో'ను సృష్టి చారు. తనచేర్చిన ప్రజల మెప్పుతోబాటు కవినీ అ రించి 'నేను హాస్యం చేస్తున్నాను, మీ రంతా నవ్వండి' అన్నట్టుగా గాక, బహు అపామాషీగా తీపి చతురతో వాచికాభినయస్ఫూర్తి మెఱుగుపెట్టారు లక్ష్మయ్య గారు 'భైరవ శాస్త్రి'గా.

వీరిని ముఖ్యంగా 'స్త్రీ సామ్రాజ్యం'లో వకీల గా చూడాలి లక్ష్మయ్యగారిని. ఈనాటకప్రదర్శన ప్ర లలో ఈకాల, భావాలమార్పులో ఏపరివర్తన తెచ్చునో సందియమే! స్త్రీత్వగౌరవాన్ని శక్తిస్తూన్న నాటికలు ప్రదర్శనాలు బహుజనహాస్యపాత్రాలూ కాలక్షేపాల మాత్రమే. అయినా యీనాటకాన్ని ప్రత్యేక అప్ర ర్శనమాత్రదృష్టిలో లక్ష్మయ్యగారు అర్థమె నర్చుకొన్న "వాచికాంగిక సాత్త్విక ఆహార్యాభినయ లని ఆరాధించి పవరించటంలో Master Hand అయినారనే చెప్పాలి.

శ్రీ లక్ష్మయ్యగారి పాత్రధారణము గూర్చి నాటక నిజార్థం తెలిసిన ఉత్తమ నటకుని లక్షణ శ్రీ డా॥ గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారు వ్రాసి పదాలు లిఖించి, అవన్నీ లక్ష్మయ్యగారి స్వంతసొము లయినాయి అన్నముక్కతో విరమిస్తాను.

"ఉత్తరువ్వ అతిక్రమించని స్వార్థత్యాగి. ని తాన్ని నటించి, యితరుల స్థలాల్ని ఆక్రమించక ప్ర హాని కదుకీదక, ధోరణినిబడి combined effect Successful overtureకు పాటుపడేవాడు."

# మానసబోధము

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు

దేవాలయములోని దేవు డేడకో పోయె
దీపాలు లేవేమె, మనసా!
మ్ముథిమ్మని చిమ్మచీకటుల లోపలను
దెయ్యాలు ఆడెనే, మనసా!

శ్రీ వేంకటేశ్వరుని చెలువైన ఒకరాతి
బొమ్మగా తీర్చితివె, మనసా!
అలమేలుమంగ నొక ఆటవస్తువు గాగ
అంగడికి ఈడ్చితివె, మనసా!

దేవతలు నరులతో, నరులు దేవతలతో
తిరిగి రీదేశాన, మనసా!
దేవతలు తమ విమానాలలో వెడలగా
దిక్కుమాలిరి జనులు, మనసా!

ండ్లలో ఉండేటి ఇలువేల్పు లందరును
ఎచ్చటికో ఏగిరే, మనసా!
వరితోవై వారు ఎగురుతూ ఉన్నారు,
ఏమూనో తెలియదే, మనసా!

ాతతోవలలోను పాదాలు మెట్టితే
భద్రమని మరచితివె మనసా!
త్తదారులు పట్టి, కోరి అడవులు చొచ్చి,
కూలిపో నేలనే, మనసా!

దలోను పదిలముగ కుదురుకొన్నట్టి నీ
చదువులన్నీ యేవె? మనసా!
దువులన్నీ విడిచి కొదువపడి మరిఒకరి
సరసచేరితివేమె? మనసా!

నీవన్నె చెడిపోయె, నీ చిన్నె మరుగుపడె,
నీ యంద మేమయ్యె? మనసా!
నీవారిదారి సరివారిలో తలమెత్తి
నిలుపలేవేమె? ఓ మనసా!

ఆలు ఆడుదియాట, మగడు మగవాడౌట
అది లోకమర్యాద, మనసా!
ఆడుదియు మగవాడు అందరును ఒకటైన
అది యెట్లు పొసగునే? మనసా!

వెలగలుగు రత్నాల విలు వెరుగ కున్నావు
వెర్రివై విడిచితివి, మనసా!
తళుకు బెళుకులరాళ్ల తలపైని పెట్టుకొని
తబ్బిబ్బు పడనేల? మనసా!

నీ తెలివితేటలను, నీ నీటుగోటులను
నీ వెరుగకున్నావు, మనసా!
నీతిమాలిన యితరరీతులను చేపట్టి
నిక్కినీల్గెదవేమె? మనసా!
పరులు పన్నినయట్టి ఉరులలో తగులుకొని
పరుగాడకున్నావు, మనసా!
పంజరములో పడ్డ పంచవన్నెల చిలుక
పరువయ్యె నీబ్రదుకు, మనసా!
ఉన్నదంతా ఊడె, కొన్న దొక్కింతైన
కుదురుపడకున్నదే, మనసా!
చన్నదానికినై విచారించనేల? యిక
సరసమార్గము గొనవె, మనసా!

—

# పుస్తక సమీక్ష

## రయితు బిడ్డ

కర్త: న. వెంకటరత్నం, దానవాయి పేట, రాజమహేంద్రవరము. వెల అర్థ రూపాయ.

ఈ పుస్తక మెనిమిది కథల సంపుటి. ఇందులో రైతుబిడ్డ, సంస్కృతదోషము, పరివర్తనము పెద్దకథలు. తక్కినవి చిన్నవి. మొదటికథపేరే గ్రంథనామముగా నొసర్పబడినది.

ఆంగ్ల విద్యావంతులను గ్రామములలో నివసింపుమని కాంగ్రెసు నాయకులు చెప్పినప్పుడు చాలామంది కా యుపదేశము రుచింపదు. పట్టణములలోని యాహార ముల కలవాటుపడినవారికి గ్రామజీవనము దుస్సహ మనిపించక మానదు. గాంధీమహాత్ము డీబోధ చాల కాలమునుంచి చేయుచున్నను అనాగరిక గ్రామములు హూణభాషాభ్యాసితుల నాకర్షింప లేకున్నవి. మహాత్ముని యుపదేశముయొక్క కార్యసాఫల్యము 'రైతుబిడ్డ'లో చూపబడినది. కాలేజీలో ప్రొఫెసరుగానున్న యతడు ఆంగ్లవిద్యారతిరైన భార్యతో గ్రామములో నివాస మేర్పరచుకొని ఆదర్శప్రాయమైన జీవనము చేయుచుండును. వీరు హరిజనబాలకు నొకనిని చేరదీసినందున గ్రామములో కూడ వీరికి బహిష్కారము సంభవించినది. పల్లెలోనుండి వ్యవసాయములో నిమగ్నులై యున్నను వీరు వార్తాపత్రికలను గాని, రాజకీయ చర్చలనుగాని విడిచిపెట్టలేదు. వానితోపాటు వీరిని సి. ఐ. డీలుకూడ వదలిపెట్టలేదు. ఆ దంపతుల రాజకీయపరిజ్ఞానము పుత్రుని మాటలనుండి గ్రహింపవచ్చును. తీవ్రమైన సంస్కారవాంఛతో ఆచార్యపత్నినోట వడలిన క్రింది వాక్యములు మన దేశీయు లందరును గమనింపదగినవి.

"దేశమంతా మూర్ఖులు. నూటికి తొంబది తొమ్మండుగురు పరమపశువులు. ఎవ్వడైనా ఒక్క వ్యక్తి మానవుడుంటే అతడు నిద్రపోతూ వుంటాడు. ఈ తొంబదితొమ్మండుగురే సంఘాన్ని దేశాన్ని నడుపుతున్నారు. ఆ వొక్కడు తెలిసివుండికూడా 'పదుగు రాడుమాట' అని చెప్పి తానుకూడా పశువులలో చేరిపోతాడు. ఇదంతా మార్పు కావడానికి కొంతకాలము పడుతుంది."

కథ లన్నిటిలో మానవహృదయపరివర్తనము సహజముగా చిత్రింపబడినది. 'సంస్కృతదోషము'లో భార్యాభర్త లన్యోన్యప్రేమతో నున్నను భార్య యొక్క చిన్ననాటిమిత్రుడు వచ్చినంతనే భర్త అనవసరముగా నమమానపడి, తిరిగి తనతప్పు తా దిద్దుకొనును. పరివర్తనములో జీవితములోని ఒడుదుడుకులవలన మానవుడు విరాగిరైయి అవస్థాంతరములో సంసారి యగును. ఇట్టికథలు సంఘసంస్కారమునకు బాగుగా తోడ్పడగలవు.

వెం. శ్రీ.

---

## UNPASSED UNTOUCHABILITY

(English)

కర్త: పి. వెంకయ్య, వెల ఎనిమిదణాలు.

గ్రంథకర్త తన ఏబదియేండ్ల యనుభవముచే ప్రస్తుతము హైందవవిశ్వవిద్యాలయములలో జరుగు అన్యాయమును తొలగించుట కీపుస్తకమును వ్రాసెను. అన్ని తరగతులలోను, ముఖ్యముగా స్కూలుఫైనలు పరీక్షలోను కొందరు విద్యార్థులు తప్పి మరల నాతరగతియే చదువవలసివచ్చుచున్నది. ఏవో కొన్ని విషయములలో నియమితమైన మార్కులు రాలేదని విద్యార్థి పురోభిగమనము నరికట్టుట మంచిదికాదని గ్రంథకర్త యభిప్రాయము. ప్రత్యేకవిషయములలో నెక్కు అభిరుచితో బనిచేయుటకు స్కూలుఫైనలుపరీక్ష అడ్డు తగులుచున్నది. పాశ్చాత్యదేశములలో ననేకవిషయములలో ప్రసిద్ధిగాంచిన వాషింగ్టను, ఈడిసను మొదలగువా రిట్టి పరీక్షలను గడవలేదు. ఈపరీక్షలు విద్యార్థులకేగాక, బీదవారై ఇండ్లు పొలము లమ్మి చదువుచెప్పించు తల్లిదండ్రులకుగూడ నష్టదాయకములుగా నున్నవి

…వున, ప్రతివిద్యార్థియు సక్రమముగా పాఠశాలకు …చ్చి, హాజ్జాపరునకు సంతృప్తికరముగా చదివిన …డల సంవత్సరాంతమున పరీక్ష యవసరము …కనే పైతరగతికి విద్యార్థిని పంపవలెనని గ్రంథకర్త …దము. విద్యార్థి చదువువిషయములో శ్రద్ధవహింపక …యినయెడల తండ్రికి మూడుపర్యాయములు తెలిపి …ఠశాలనుండి తొలగింపవలెనేగాని తప్పింపగూడదు. …ంతేగాక విద్యార్థులు సోమరిపోతులు గాకుండునట్లు …ద్యాశాఖాధికారులు విద్యాప్రణాళికలో మార్పు లొన …ంచవలెను. ఈమార్పులకొరకు దేశమంతటను ప్రచా…ము చేసి శాసనసభలో చట్టు మొనరింపవలెనని గ్రంథ…ర్త తీవ్రముగా వాదించినాడు. ఈపుస్తకము విద్యార్థి…ంఘముల కుచితముగా బంపదును.

వెం. శ్రీ.

## వేదము వేంకటరాయ శాస్త్రి సంస్మృతి

కర్త: నూతి వేంకటసుబ్బరామయ్య, యమ్. ఏ., నెల్లూరు. వెల పన్నెండణాలు.

ఆంధ్ర వాఙ్మయంలో జీవితచరిత్రలు చాల తక్కువ. ఆంధ్రులలో మహాపురుషులు తక్కువనుటచే గాదు; మన గ్రంథకర్తల జీవిత విషయమున నాదరము లేక పోవుటయే కారణము. కవులైనను స్వీయ చారిత్ర రచనయందు ముందంజ వేయుటలేదు. ఒకటి రెండు స్వీయచరిత్రములకన్న నెక్కువ ఆంధ్రలోకమునం దుద్భవిల్లలేదు. జీవితమునందు పేరు ప్రతిష్ఠలు గాంచి మహాపురుషు లనిపించుకొనినవారిలో వేదం వేంకటరాయశాస్త్రిగా రొకరు. శాస్త్రిగారితో గలిగిన ఇరువదేండ్ల పరిచయములో వారు తెలిసికొనిన విష…

యము ఈ పుస్తకములో సుబ్బరామయ్యగారు ప్రకటించినారు.

శాస్త్రిగారికి నాట్యకళయందమిత ప్రీతి. వీరు చిన్నప్పుడే షేక్స్పియరు నాటకముల నత్యంత శ్రద్ధతో పఠించి, అతడు వ్రాసినన్ని నాటకములను వ్రాయ సంకల్పించుకొనినారు. నాటకములను వ్రాయుటతోడనే వీరు సంతృప్తి నొందక, నాటక సమాజములను స్థాపించి వానిచే స్వీయ నాటకములను రంగస్థలమునందు నటింపజేసెడివారు. వీరి నాటకములన్నిటిలో నాంధ్రదేశమున ప్రసిద్ధి కెక్కినది ప్రతాపరుద్రీయనాటకము. ఏ చరిత్రాధారము లేకనే జనశ్రుతి ననుసరించి దీనిని రచించినారు. ఈ నాటకములోని పాత్రలు, పేరిగాని హాస్యము శాస్త్రిగారి జీవిత సంఘటనములనుండియే సృష్టింపబడినది. ఇదిగాక బొబ్బిలి, ఉష మొదలైన స్వతంత్ర నాటకములను, శాకుంతలము, విక్రమోర్వశీయము మొదలగు సంస్కృతానువాదములను రచించిరి.

శాస్త్రిగారిలో కవితాశక్తి కన్న పాండిత్య పటిమ ఎక్కువ. అందువలననే వీరి కావ్యములకన్న వీరి వ్యాఖ్యానము లెక్కువ పేరుగాంచినవి. కొరుకరాని కొయ్య యను ఆముక్తమాల్యదకు వ్యాఖ్య రచించి శాస్త్రిగా రాంధ్రులకు చిరస్మరణీయులైనారు. వీరు మేఘసందేశమునకును శృంగారనైషధమునకును, విజయవిలాసమునకును అమూల్యమైన వ్యాఖ్యానములు రచించినారు.

వీరు జీవితమునందు చాలా సన్మానములను బొందినారు. 'మహామహోపాధ్యాయ', 'కళాప్రపూర్ణ' ఇత్యాది బిరుదాంకితులైనారు. కాని, పూర్వకవులతోబాటు వీరికిని అంతిమదశయందు దారిద్ర్యము తప్పలేదు. మిత్రసాహాయ్యముచే నెట్లో ఋణవిముక్తులై ఎనుబదియారవయేట శాస్త్రిగారు పరమపదించినారు. ఆంధ్రవాఙ్మయమున కపారసేవ చేసిన శాస్త్రిగారి జీవితమును స్మరింప చేసిన శ్రీ సుబ్బం వేంకట సుబ్బరామయ్యగారు ధన్యులు.—

వెంపటి శ్రీనివాసమూర్తి.

---

# గ్రంథ స్వీకారము

---

**సినిమా పరిశ్రమ**— గ్రంథకర్త శ్రీ కం. కృ మూర్తిగారు. పిఠాపురం కృష్ణాముద్రాక్షర శా యందు ముద్రితమైనది. గ్రంథకర్తగారికి వ్రా పుస్తకముల తెప్పించుకొనవచ్చును. వెల రు ౧-౦-౦.

**తరిదాలువు దళసరి** — ఇది విష్ణుమాహాత్మ్యము గూర్చిన గ్రంథము. మొదటి భాగము. అచ్చ తెనుగు ప్రబంధము. గ్రంథకర్త, శ్రీ పోల ప్రగడ కృష్ణమూర్తిగారు, పర్లాకిమిడి అ వ్రాసిన గ్రంథములు దొరుకును.

**చిత్రకేతూపాఖ్యానము (హరికథ)** — రచయి శ్రీ సన్యాసప్పన్న భాగవతార్ గారు. హెడ్మా స్టరు; ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు వసాది, గంట్యాడ పోస్టు: విజయనగర తాలూకా, విశాఖపట్టణం జిల్లా: వెల రు ౦-౬-౦.

**మన బిడ్డలు** — రచయిత: శ్రీ బుర్రా వెంక శాంచారయ్యగారు. వెల రు. ౦-౬-౦.

**ప్రపంచవీరులు (రెండవ భాగము)** —. రచయి శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తిగారు. దీనికి పైపుస్తకమునకున్న ప్రకటనకర్తలు, శ్రీ జమి నమ్మకొవ్వాన్స్. పోస్టుబాక్సు ౨౫౧. మద్రాస్ వెల రు. ౦-౬-౦.

**రాజాబహద్దరు వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ గారి జీవితచరిత్ర**: గ్రంథకర్త: శ్రీ సురవర ప్రతాపరెడ్డిగారు. ప్రకాశకులు: బాలిక ఉన్నత పాఠశాల కమిటీ, నారాయణగూడెము హైదరాబాదు (దక్కన్) వెల. మేలు ప్ర రు. ౦-౧౨-౦, సాదా ప్రతి రు. ౦-౬-౦.

---

# పత్రికా స్వీకారము

**మాతృభారతి**—దక్షిణ హైదరాబాద్, నారాయణగూడయందలి బాలికల ఉన్నత పాఠశాలపక్షమున "మాతృభారతి" యను పేరుతో ఒకలిఖితమాసపత్రిక ప్రకటింపబడు చున్నది. అందలి ప్రధాన వ్యాసముల గొన్నింటిని ఏరి తత్పాఠశాలాధికారవర్గము వారు ప్రత్యేక సంపుటంగా ముద్రింపించి వెలువర్చుచుందురు. అట్టి సంచికలు ఇదివరకు మూడు ప్రకటితములయినవి. ఇప్పుడు చతుర్థసంపుటము మా కార్యస్థానము చేరినది. పెద్దవారలు వ్రాసినవి ఏవో రెండు మూడు వ్యాసాలు తప్ప తక్కినవన్నీ మూడవఫారం మొదలుకొని మెట్రిక్కువరకూ గల బాలికలచే వ్రాయబడినవి. శ్రీమతి సేనాని భారతిగారు వ్రాసిన గద్యపద్యరచనలు మిగుల హృదయంగమములై ముందుముందు ఆమె మంచి వ్యాసకర్త్రి గాగలదని సూచించుచున్నవి. శ్రీమతి ఇందిరాదేవిగారు ఆంధ్రభాషాభివృద్ధికొరకు కొన్ని అవశ్యకములైన సూచనలను గావించి యున్నారు. ప్రాచీన హిందూనాగరికతను గూర్చిన వ్యాసము చదువుతూవుంటే హరవిలాస్ శారద గారి "హైందవాధిక్యత" అనే గ్రంథము స్మరణకు వస్తుంటుంది. పత్రికలోని కథలూ, వ్యాసాలు ఒక్క విషయానికి చెందినవికావు. ఇదానీంతన మాసపత్రికల్లోని ౯౦ పాళ్లు కథలూ స్త్రీ పురుషుల ప్రేమయే ప్రధానవిషయంగా గలవి. కాని ఈ మాతృభారతిలో భక్తి, ప్రేమ, మద్యపాననిషేధం, విద్య ఇత్యాదివిషయాలు ప్రధానంగాగలవి వ్యాసాలూ, కథలూ అన్నీనీ. సంపుటంలోని కథలను చదువుతూవుంటే బాలికాప్రపంచంలో వున్నా మనిపిస్తుంది కాని ప్రౌఢలయిన తరుణీప్రపంచంలో గాదు. ఇందులో వ్రాసినవా రందరూ ముమ్ముందు ఆదర్శప్రాయలైన రమణులు కాగల రని భావమేర్పడుతుంది. విద్యార్థినుల నిట్లు కాలానుగుణములైన కర్తవ్యముల నవలంబించులాగు చేయుచున్న తత్పాఠశాలవ్యవహర్తలు అభినందనీయులు.

**అడ్వర్టైజరు వార్షిక సంచిక** — రాధాకృష్ణ చిత్రాలుగల టైటిలుపేజితో, మిస్. సూర్యకుమారిముఖపటంతో, ప్రొఫెసర్. కె. రామమూర్తియొక్కయు, అఖిలభారత, ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు నాయకులయొక్కయు, త్రిపురి కాంగ్రెసుయొక్కయు చిత్రములతో మంచి ఆకర్షణీయంగా వుంది ఈ వార్షికసంచిక. కేవలం చిత్రపటపరిధానం మాత్రమేకాదు ఇందలి వ్యాసాలునూ పఠనీయములు. ఇది ఆంధ్రాంగ్ల భాషామిశ్రితపత్రిక యని చాలామందికి తెలిసేవుంటుంది. వార్షికసంచికయు నదేవిధంగా రెండుభాషలవ్యాసాలతో నలరారుతూ వుంది. కాని ఆంధ్రానికే ఎక్కువ ప్రాధాన్యము. నాల్గింటమూడువంతులు ఆంధ్రభాషావ్యాసాలు. రకరకాలవ్యాసాలున్నూ ఎక్కువ సంఖ్యలో మంచికథలున్నూ వున్నాయి. వీటికితోడు ఆరంభంలో నేపద్యరచనలుగలవు. ఇక ఆంగ్ల భాషారచనలు సమయానుకూలము లైనవి. సోషలిజం అనే వ్యాసం ప్రతికూలురను గూడ తన కనుకూలురనుగా చేసికోడానికి ప్రయత్నిస్తుంది. సినిమా ఇండస్ట్రి రచనలో దాని భూతభవిష్యత్తుల చరిత్ర బాగుగ వర్ణితమైనది. ఒకచిన్నరచనలో హిట్లరు రహస్యం వెలువర్చారు. కథారూపంలో ప్రస్తుత అయిరోపాపరిస్థితి విమర్శిత మైంది. ఈపత్రిక ఇట్లు సమయానుకూలంగా ప్రవర్తింపగడంగుటచే చిరకాలం వర్ధిల్లుతుందను ఆశగలదు. సంపాదకులు కె. శ్రీనివాసరావుగారు. పత్రిక విజయనగరం, శ్రీ వేదవ్యాసప్రెస్సులో ముద్రితమైనది. సాలుచందా పోస్టేజి సహా ఒక రూపాయ మాత్రమే.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.